# నాలుగు నవలలు

('మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఆమె ఎవరు?

రచన: వాణిశ్రీ

## మరణశిక్ష

రచన : వసుంధర

## గోవా యాత్ర

రచన: సికిందర్

## చేతిలో కత్తి-మెడలో త్రాచు

రచన: ప్రతాప రవిశంకర్

పొగమంచు — ఐదవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ - - 77
మే, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఆమె ఎవరు?

## వాణిశ్రీ

గోడ గడియారం ఠంగ్....ఠంగ్ మని తొమ్మిది గంటలు కొట్టింది.

"అప్పుడే తొమ్మిదైందే?" అంటూ డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాడు జయకృష్ణ.

"అప్పుడే అంటే!....గడియారం ముందుకు పోతుందనా మీ అర్థం?" అంది అతని భార్య నవ్వుతూ.

"అదికాదు ఈరోజు వీలైనంత తొందరగా భోజనం చేసి నిద్రపోదామనుకున్నాను. కాని తొమ్మిదైంది. నిద్ర పోయే సమయానికి పదికి తక్కువ కాదు" అన్నాడు.

"పోలీసులు నిద్రపోతే ఎట్లా? దేశం తగలబడిపోతుంది" అంది ఆమె నవ్వుతూ.

"పోలీసులు నిద్రపోతేనే మంచిదనిపిస్తోంది. దేశం ప్రశాంతంగా వుంటుందేమో?"

"పోలీసులే అలా అంటే ఎలా?"

## 4

"పోలీసునే అయినా నాకు వ్యక్తిగత అభిప్రాయాలు వుండగూడదా?"

"కూడదని ఎవరన్నారు? మీ మీద మీకే నమ్మకం తగ్గిపోతున్నట్లనిపిస్తోంది."

హాల్లో టెలిఫోన్ మ్రోగింది.

"మూడు ఏమిటో?" అన్నాడు జయకృష్ణ.

"ఇంకే ముంటుంది? ఏ మర్డర్ కేసో?...." అనుకుంటూ ఆమె వెళ్ళి టెలిఫోన్ ఎత్తింది.

"ఏమిటి?"

"మీ మెయిన్‌రోడ్ శిష్యుడు మాట్లాడతాడట" అంది.

"మెయిన్‌రోడ్ శిష్యుడు ఎవరు?"

"యస్.ఐ. గోపాల్. నెంబర్ వన్ టౌన్ యస్.ఐ. అతనేగదా, అతను వుండేది మెయిన్‌రోడ్ పోలీస్ స్టేషన్లోనే గదా. అందుకే అతన్ని మెయిన్‌రోడ్ శిష్యుడు అంటూ వుంటాను."

"బాగుంది. ఇంతకీ ఏమిటి సంగతి?"

"మామూలే. మెయిన్‌రోడ్‌లో ఘోరమైన యాక్సిడెంట్. గురువుగారు వెంటనే వున్నపాటున లేచిరావాలి."

జయకృష్ణ ఎంగిలిచేత్తోనే లేచి వెళ్ళి ఫోన్ అందుకున్నాడు.

"గోపాల్ ఏం జరిగింది?"

"మహారాణి హోటల్ ముందు చౌరస్తాకి, కొంచెం ప్రక్కగా యాక్సిడెంట్ సార్."

"ఎనీ డెత్స్?"

"యస్సార్. రోడ్డుమీద నడుస్తున్న ఒక యువతి చనిపోయింది. ఒక మోటార్ సైకిల్, మిల్క్ వ్యాన్,

అంబాసిడర్ యాక్సిడెంటయ్యాయి. మోటార్ సైకిల్ అతన్ని హాస్పటల్ కి పంపించారు. సీరియస్ గా వుంది అతని పరిస్థితి. అంబాసిడర్ డ్రైవర్ కి, లోపల ఇద్దరు పాసింజెర్లకి మైనర్ ఇంజరీస్."

"శవం అక్కడే వుందా?"

"లేకపోతే ఎలాసార్. మీరు వచ్చి ఇంక్వెస్టు రిపోర్టు రాయాలి. యఫ్.ఐ.ఆర్. పంపాలిగదా?"

"నో...అలాకాదు. ఆమె ఆన్ దీస్పాట్ చనిపోయిందా లేక హాస్పటల్లో పోయిందా? అని."

"ఆన్ దీస్పాట్ పోయింది సార్. శవం కదిలించలేదు. మీరు వస్తారుగదా?"

"వస్తున్నా" .అని ఫోన్ పెట్టేసి, గబగబా రెండు ముద్దలు తిని బయల్దేరాడు సర్కిల్ ఇనస్పెక్టర్ జయకృష్ణ.

జయకృష్ణ వెళ్ళేసరికి జనం యాక్సిడెంట్ జరిగిన ప్రదేశం చుట్టూ గుమిగూడి వున్నారు.

సర్కిల్ ఇనస్పెక్టర్ని చూసి పోలీస్ కానిస్టేబుల్స్ జనాన్ని దూరంగా పంపెయ్యడానికి ప్రయత్నిస్తున్నారు.

మిల్క్ వ్యాన్ క్రింద వుంది శవం.

ఆమెకు పాతికేళ్ళుండవచ్చు. మనిషి రంగు చామన ఛాయ. చదువుకున్న దానిలాగే కనిపించింది. మెడ బోసిగా వుంది. అవివాహితై వుంటుంది. సింపుల్ గా వుంది డ్రెస్సింగ్. ఆమె గుప్పెట్లో హేండ్ బ్యాగ్ రక్తంలో తడిసి వుంది. ఆమె జాబ్ చేస్తూ వుందో, లేక జాబ్ కోసం ప్రయత్నిస్తూ వుందో అనుకున్నాడు జయకృష్ణ.

యాక్సిడెంట్ కి కారణం ఏమిటో స్పష్టంగా కనిపిస్తూనే వుంది.

ఆమె రోడ్డు దాటుతూ మిల్క్ వ్యాన్ క్రిందపడి

వుండొచ్చు. వ్యాన్ డ్రైవర్ సడన్ బ్రేక్ వెయ్యడంతో దాని వెనుక నేవస్తున్న మోటారు సైకిల్ అతను కుడివైపుకి త్రిప్పాడు కంగారులో. అది వెళ్ళి ఎదురువస్తున్న అంబాసిడర్ కి గుద్దుకుంది. అంబాసిడర్ ప్రక్కకి తిప్పబోయి మిల్క్ వ్యాన్ కి గుద్దుకుని తిరగబడింది.

మూడు వాహనాలూ ముద్దగా పడి విచిత్రంగా కనిపిస్తున్నాయి.

'తప్పు ఎవరిదీ అని ఆలోచిస్తే రోడ్డు క్రాస్ చేస్తూ ప్రాణాలు కోల్పోయిన ఆమెదే' అనుకున్నాడు జయకృష్ణ.

మోటారు సైకిలిస్టు, అంబాసిడర్ డ్రైవర్, అందులో ప్రయాణీకులు హాస్పటల్లో అడ్మిటయ్యారు. మిల్క్ వ్యాన్ డ్రైవర్ మాత్రం భయంతో పారిపోయాడు.

బ్రేక్ ఇనస్పెక్టర్ యాక్సిడెంట్ జరిగిన ప్రదేశాన్ని మార్కు చేసి టేప్ తో కొలతలు వేయిస్తున్నాడు.

జయకృష్ణ ఆమె ముఖాన్ని కొంచెంసేపు పరీక్షగా చూశాడు. ఎక్కడా చూసిన గుర్తు రాలేదు.

రాత్రి పది కావొచ్చింది. సెకండ్ షో సినిమాలు మొదలయ్యాయి. రోడ్డుమీద ట్రాఫిక్ తగ్గుముఖం పట్టింది. ఎన్నో వందలమంది ఆమె శవాన్ని చూసి వెళ్తున్నారు. కాని ఎవరూ గుర్తుపట్టలేదు.

చిన్నసైజు హేండ్ బ్యాగ్ అది. ఆమె చేతి గుప్పిట నుంచి వదిలించాడు జయకృష్ణ. సేవింగ్స్ కార్పొరేషన్ వాళ్ళిచ్చిన కాన్వాస్ సంచి అది. జిప్ తెరిచి చూశాడు. ఎరుపురంగు చీర, రెండు బ్లౌజులు, బ్రాసరీలు వున్నాయి. చిన్న నోట్ బుక్ దొరికింది.

తెరచి చూశాడు. అన్ని పేజీలూ ఖాళీగానే

వున్నాయి. ఒక్క పేజీలోమాత్రం 'రేఖ ఎంటర్ ప్రైజెస్' అని అడ్రెస్ వుంది. ఆ నోట్ బుక్ లోనే డాక్టర్ మాధవి ప్రిస్క్రిప్షన్ రాసిన కాగితం మడతపెట్టి వుంది. డాక్టర్ మాధవి ప్రిస్క్రిప్షన్ రాసిన తేదీ చూశాడు. ఏప్రియల్ పదమూడు. ఈ రోజు పదిహేను. అంటే రెండు రోజుల క్రితమే ఆమె డాక్టర్ మాధవి నర్సింగ్ హోమ్ లో ట్రీట్ మెంట్ తీసుకుందన్న మాట.

బట్టల అడుగున కాగితం చుట్టిన వస్తువు ఏదో వుంది. తీసి చూశాడు. కొయ్యబారి పోయాడు సర్కిల్ ఇన్ స్పెక్టర్ ఆ వస్తువు చూసి. అది రక్తంలో తడిసిన కత్తి. ఆరు అంగుళాల పొడవు వుంది. రక్తం పచ్చిగానే వుంది.

'ఆమె ఎవర్నో కత్తితో పొడిచి చంపి హడావుడిగా పారిపోతూ మిల్క్ వ్యాన్ క్రింద పడిపోలేదుగదా' ఇన స్పెక్టర్ జయకృష్ణ బుర్ర గిరగిరా తిరిగిపోతూ వుంది.

"ఓ మైగాడ్" అన్నాడు యస్.ఐ.గోపాల్ రక్తంతో తడిసిన కత్తిని చూస్తూనే.

"ఈమె ఎవరో ఎప్పుడైనా చూశావా?" ప్రశ్నించాడు జయకృష్ణ.

"లేదు సార్"అన్నాడు గోపాల్ శవంవైపే పరీక్షగా చూస్తూ.

ఇంతలో పోలీస్ జీప్ వచ్చి ఆగింది. అందులోనుంచి యస్పీ, డియస్పీ దిగారు.

సెల్యూట్ చేసి ఎటెంక్షన్ లో నిలబడ్డారు ఇన స్పెక్టర్లూ, కానిస్టేబుల్సు.

"వండర్ గా వుండే ఈవిడ బ్యాగ్ లో మర్డర్ చేసిన కత్తి దొరకడం" అన్నాడు యస్పీ అంతా విని.

"మర్డర్ ఎక్కడ జరిగిందో తెలియదు. బట్ కత్తి

దొరికింది. ఇటీజ్ ఏ పెక్యూలియర్ కేస్" అన్నాడు డియస్పీ.

"ఎక్కడో మర్డర్ జరిగి వుండాలి. బహుశా ఈ ప్రాంతంలోనే ఆ ప్రదేశం వుండివుండాలి" అన్నాడు యస్పీ చుట్టూ కలయజూస్తూ.

"ఎవరైనా రిపోర్టు చేసేవరకూ మనకి తెలియదు. మిస్టర్ జయకృష్ణా! అన్ని స్టేషన్స్‌కీ హెచ్చరికలు పంపండి. పోలీస్ కంట్రోల్ రూమ్‌కి ఏదైనా రిపోర్టు వచ్చిందేమో కనుక్కోండి. మర్డర్ జరిగిందని రిపోర్టు వచ్చిన వెంటనే నాకు కాల్ పంపండి."

"యస్సార్."

"రేపు ఎవరైనా ఈ మెను గుర్తిస్తే సరి. లేకపోతే ఫింగర్ టిప్స్ తీసి కెమికల్ ఎగ్జామినర్‌కి పంపండి. ఈ మహాతల్లి స్టేట్ క్రిమినల్ కావచ్చుగదా." అన్నాడు యస్పీ.

"యస్సార్."

"పోస్టుమార్టమ్‌కి పంపించండి వెంటనే. ఇంక్వెస్టు రిపోర్టు తయారైందా?"

"లేదు సార్."

"త్వరగా కానివ్వండి. ఇది సిటీలో మెయిన్ రోడ్డు. హెవీ ట్రాఫిక్ వుండే రోడ్డు. ఆలస్యం కానివ్వకండి."

"యస్సార్. వెంటనే జరిపించేస్తాను సార్" అన్నాడు జయకృష్ణ.

కాస్సేపటికి యస్పీ, డియస్పీ వెళ్ళిపోయారు.

శవ పంచాయితీ జరిపించి శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించేశాడు.

"గోపాల్,"

"యస్సార్."

"ఈ అమ్మాయి రెండు రోజుల క్రితం డాక్టర్ మాధవి దగ్గర ట్రీట్‌మెంట్ తీసుకున్నట్లు ఆధారం దొరికింది. డాక్టర్‌కి తెలిసి వుండొచ్చు ఈ అమ్మాయి ఎవరో?"

"తెలిసి వుండొచ్చు. తెలియకపోయీ వుండొచ్చు గదా సార్."

"అవుననుకో. చూద్దాం ఏ పుట్టలో ఏ పాముందో?" అన్నాడు జయకృష్ణ నవ్వుతూ.

"ఇంత రాత్రి వెళ్దామంటారా?" అనుమానంగా ప్రశ్నించాడు గోపాల్.

"నో....నో.... లేడికి లేచిందే ప్రయాణమని అర్ధరాత్రే ఇన్వెస్టిగేషన్ మొదలుపెడదామంటావా? రేపు ఉదయం లోపలే ఎక్కడో మర్డర్ జరిగిందనే వార్త ఎలాగూ వస్తుంది. ఒక్కసారే బిగిన్ చేద్దాం."

"యస్సార్."

"రెండు రోజుల్నుంచి నిద్రలేదు గదయ్యా! ఈ రోజైనా కాస్త పెందరాళే హాయిగా పడుకుందామనుకున్నాను" ఆవులిస్తూ అన్నాడు సి.ఐ. జయకృష్ణ.

"మనకి హాయి ఎక్కడుంది సార్. ఎప్పుడూ హడావుడే. ముందే తెలిసివుంటే ఈ వుద్యోగానికి వచ్చి వుండేవాడిని కాను" నవ్వాడు యస్.ఐ. గోపాల్.

"వచ్చి రెండేళ్ళు కాలేదు అప్పుడే విరక్తిగా మాట్లాడుతున్నావే. మరి మేము ఏమనుకోవాలి, ఇరవై ఏళ్ళు సర్వీసు చేసినవాళ్ళం."

"మీరు అలవాటు పడిపోయారు సార్."

"మరి నువ్వూ పడాలి అలవాటు" నవ్వాడు సి.ఐ.

"పడక తప్పుతుందా సార్!"

"నేను వెళ్తున్నాగాని ఆ మిల్క్‌వ్యాన్ డ్రైవర్ ఎవరో కనుక్కొని రేపు స్టేషన్‌కి తీసుకొచ్చే ఏర్పాటు చెయ్యాలి."

"ఇంటికి వెళ్తున్నారా?"

"అంత అదృష్టంగూడానా? హాస్పటల్‌కి వెళ్ళాలి. ఆ మోటార్ సైకిలిస్టుకి తెలివి వస్తే స్టేట్‌మెంట్ తీసుకో వాలి. తెలివి రాకుండా చచ్చిపోయాడా ఇక మనకి తెల్ల వార్లూ నిద్ర వుండదు. తొందరగా తెలివి వస్తే బాగుం డును" అన్నాడు సి.ఐ.

"ఈపాటికి తెలివి వచ్చే వుంటుందేమో? ఫోన్ చేసి కనుక్కొందామా సార్?"

"వద్దు. నేను ఎటూ వెళ్తున్నా గదా!" అన్నాడు సి.ఐ.

## 2

సి.ఐ. జయకృష్ణ హాస్పటల్‌కి వెళ్ళేసరికి ఆ ఆవరణంతా జనంతో నిండిపోయి వుంది.

దాదాపు వందమంది ఆడ మగా గుమిగూడి వున్నారు.

ఆతనికి ఏం జరిగిందో అర్థం కాలేదు. యాక్సిడెంట్ జరిగిన తాలూకు వాళ్ళ బంధువులై వుంటారనుకున్నాడు.

కొందరు ఆడవాళ్ళు ఏడుస్తున్నారు. మగవాళ్ళు విచారాగ్రస్తులై వున్నారు.

తీరా విచారిస్తే ఆ మోటారు సైకిలిష్టు పోయాడని తెలిసింది.

ఆ కుర్రాడి పేరు రమేష్. నవరంగ్ సిల్క్ ఎంపోరి యమ్ ప్రొప్రయిటర్ రామనాథం కొడుకు. బి.యస్సీ. ఫైనలియర్‌లో వున్నాడు.

డ్యూటీలో వున్న డాక్టర్, సి.ఐ. తో చెప్పాడు

తలకి బాగా దెబ్బ తగలడంవల్ల చనిపోయాడని. స్టేట్‌మెంట్ తీసుకోడానికిగూడా అవకాశంలేకుండా స్పృహలోకి రాకుండానే మరణించాడు.

"పోస్టుమార్టమ్ రిపోర్టు రేపు పంపుతాము సార్!" అన్నాడు డాక్టర్.

"మిగిలిన వాళ్ళు ఎక్కడున్నారు?"

"టాక్సీలో వాళ్ళా?"

"అవును."

"డ్రైవర్ని సర్జికల్ వార్డులో అడ్మిట్ చేశాం. ప్యాసింజెర్లు వెళ్ళిపోయారు. కట్లుకట్టి పంపించాం. మైనర్ ఇంజరీస్. డ్రైవర్‌కి కాలు ఫ్రాక్చరైంది."

"అలాగా?"

"చూస్తారా అతన్ని."

"పదండి."

డాక్టర్, సి.ఐ. కలసి సర్జికల్ వార్డుకి వెళ్ళారు.

కునికిపాట్లు పడుతున్న నర్సు బూట్లచప్పుడు విని లేచి నిల్చుని హడావుడిగా వచ్చింది.

మూలుగుతూ పడుకున్నాడు డ్రైవరు. సి.ఐ.ని, డాక్టర్ని చూసి లేచి కూర్చోబోయాడు.

సి.ఐ. వారిస్తూ "లేవకు. పడుకో ఫరవాలేదు" అన్నాడు.

వార్డుబాయ్ స్టూల్స్ తెచ్చి బెడ్ ప్రక్కన వేశాడు.

"నీ పేరేమిటి?" అని ప్రశ్నించాడు సి.ఐ.

"యాదగిరి సార్."

"యాక్సిడెంట్ ఎలా జరిగిందో ఏమైనా చెప్పగలవా?"

"చెప్తాను సార్. నేను కళ్ళారా చూశాను,"

"చెప్పు."

"ఆ అమ్మాయి ఎవరో హఠాత్తుగా రోడ్డు దాటుతోంది సార్. మిల్కు వ్యాన్ డ్రైవరు హారన్ కొడుతూనే వున్నాడు. కాని కళ్ళుమూసి తెరిచే లోపల ఫ్రంట్ వీల్ క్రిందకి వెళ్ళిపోయింది సార్. సడన్ బ్రేక్ వేసినా లాభం లేకపోయిందనుకుంటాను. ఆమె తప్పించుకుంటుందిలే అనుకుని అతను బండి స్లో చెయ్యలేదు."

"ఐ.సీ...." తల వూపాడు సి.ఐ.

"మిల్కు వ్యాన్ వెనకనే వస్తున్న మోటారుసైకిల్ కుర్రాడు వ్యాన్ ఆగిపోగానే బండి ప్రక్కకి త్రిప్పి నాకు ఎదురు వచ్చాడు సార్. నేను కంగారుపడిపోయాను. ఏం చెయ్యాలో తోచలేదు. మోటారు సైకిల్ కి గుద్దుకుంది. మా బండి బ్రేక్ వెయ్యగానే ప్రక్కకి ఒరిగిపోయింది సార్!"

"అయితే ఆ అమ్మాయి కావాలని బండిక్రింద పడినట్లు ఏదైనా అనుమానం వచ్చిందా నీకు?" ప్రశ్నించాడు జయకృష్ణ.

యాదగిరి కళ్ళు మూసుకున్నాడు కాసేపు. జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నించాడు జరిగిన సంఘటన.

"నేను అంతగా గమనించలేదు సార్. అయినా కావాలని ఎవరైనా కారు క్రింద పడతారా సార్?"

"ఎందుకు పడరూ? వాళ్ళు చస్తూ మనల్ని చంపే వాళ్ళు వుంటారు కొందరు" నవ్వుతూ అన్నాడు జయకృష్ణ.

"ఎలా చచ్చిపోవాలో తెలియక కారు క్రింద పడితే పోలా అనుకునేవాళ్ళు వుండొచ్చు" అన్నాడు డాక్టరు.

"మీకొక విషయం చెప్పలేదు" అన్నాడు జయకృష్ణ.

"ఆమె హేండ్ బ్యాగ్‌లో ఒక కత్తి దొరికింది."

"ఈజిట్?" ఆశ్చర్యపోయాడు డాక్టర్.

"యస్ డాక్టర్. అది మామూలు కత్తికాదు. దానికి రక్తంగూడా వుంది. పచ్చి పచ్చిగా వుంది. అంటే ఆ అమ్మాయి అప్పుడే ఎవర్నో చంపి హడావుడిగా పారిపోతూ యాక్సిడెంట్‌కి గురైందని నా అనుమానం" అన్నాడు జయకృష్ణ.

"ఎవరిని చంపింది?"

"అదే తెలియడం లేదు."

"అంటే మీకు ఇంకా రిపోర్టు రాలేదన్నమాట."

"లేదు. ఎక్కడో మర్డర్ జరిగింది. కాని ఎక్కడో తెలియదు."

"వండ్రఫుల్."

"మీరు రెడీగా వుండండి రేపు హాస్పటల్‌కి మూడో శవం రాబోతూ వుంది పోస్టుమార్టంకి" నవ్వుతూ అన్నాడు సి.ఐ. జయకృష్ణ.

# 3

పోలీస్ స్టేషన్‌లో ఫోన్ రింగైంది.

సి.ఐ. జయకృష్ణ రిసీవర్ ఎత్తి "జయకృష్ణ స్పీకింగ్" అన్నాడు.

"డియస్పీని మాట్లాడుతున్నాను."

"గుడ్ మార్నింగ్ సార్!"

"ఏదైనా మర్డర్ జరిగినట్లు రిపోర్టు వచ్చిందా?"

"నో.... సార్!"

"ఈజిట్?"

"యస్సార్."

"రాత్రి రాకపోతే ఈ వుదయమైనా వస్తుందను

కున్నాను. ఇంకా రాలేదా?"

"నో.... సార్!"

"నాకొక అనుమానం వస్తోంది?"

"వాట్ సార్?"

"ఆ కత్తికి వున్నది మనిషి రక్తమేనా లేక ఏ కోడిని కోస్తే వచ్చిన రక్తం కాదుగదా?"

జయకృష్ణ నవ్వాడు.

"నో సార్. అది మనిషి రక్తమే. ఇంకా ఎనిమిదే గదా అయ్యింది. ఈ పూట రిపోర్టు రావచ్చును."

"ఆ అమ్మాయి ఎవరో తెలిసిందా?"

"లేదు సార్! చూస్తే ఈ వూరికి క్రొత్త అనిపిస్తోంది. త్రీడేస్ బాక్ డాక్టర్ మాధవి నర్సింగ్ హోమ్‌లో ట్రీట్‌మెంట్ తీసుకున్నట్లు ఆధారం దొరికింది. నేను అదే పనిలో వున్నాను సార్."

"వెంటనే డాక్టర్ని కలుసుకోండి."

"యస్సార్."

"ఓ.కె.

జయకృష్ణ రసీవర్ క్రెడిల్ మీద పెట్టేశాడు.

సి.ఐ. నర్సింగ్ హోమ్‌కి వెళ్ళి హాల్లో కుర్చీలో కూర్చున్నాడు. కొందరు ఓ.పి. వార్డు బల్లలమీద కూర్చున్నారు. జనం ఎక్కువమంది లేరు. అప్పుడప్పుడే వస్తున్నారు. అంతా ఆడవాళ్ళే. ఎక్కువమంది కడుపుతో వున్నవాళ్లు. పసిపిల్లలతో వచ్చినవాళ్ళు.

కాసేపటికి నర్సు వచ్చింది.

"నమస్తే సార్!" అంది చనువుగా, ఎంతో పరిచయం వున్నదానిలా.

"నమస్తే. డాక్టర్ గారు ఇంకా రాలేదా?"

"వార్డులో వున్నారు. పది నిముషాల్లో వస్తారు సార్!"

తల వూపాడు సరేనన్నట్లు.

"డాక్టర్ గారు గైనకాలజీ స్పెషలిస్టు సార్" అంది నర్సు.

"అలాగా?" అన్నాడు.

"ట్రీట్ మెంట్ మీకా సార్?" అంది.

"నాకేం జబ్బులేదు" అన్నాడు నవ్వుతూ.

"లేదని తెలుస్తూనే వుంది సార్! కాని పొరపాటున వచ్చారేమోనని గుర్తుచేస్తున్నా సార్!" అంది నవ్వుతూ.

"ఒక కేసు ఇన్వెస్టిగేట్ చేస్తూ వచ్చాను. కొంచెం ఇన్ఫర్మేషన్ కావాలి" అన్నాడు.

డాక్టర్ కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళ్ళి కూర్చుని ఇనస్పెక్టర్ని రమ్మని కబురుచేసింది.

"నమస్తే డాక్టర్" అన్నాడు.

"నమస్తే!" అంది ఆమె.

సి.ఐ. ప్రిస్క్రిప్షన్ చీటీ ఆమె చేతికిచ్చి "ఈ అమ్మాయి మీ వద్ద ట్రీట్ మెంట్ తీసుకుంది. గుర్తుపట్ట గలరా?" అన్నాడు.

"యస్. ఏం కావాలి మీకు?"

"ఆమె రాత్రి షుమారు తొమ్మిది గంటలకు మెయిన్ రోడ్డులో యాక్సిడెంట్ జరిగి మరణించింది" అన్నాడు.

డాక్టర్ మాధవి తృళ్ళిపడి "నిజంగా?" అంది నమ్మ లేనట్లుగా చూస్తూ.

"నిజం డాక్టర్. ఆమె ఎవరో ఏమిటో ఎవరూ ఐడెంటిఫై చెయ్యలేదు. ఆమె బ్యాగ్‌లో ఈ చీటీ దొరికింది. మీ పేరు వుందిగాని పేషెంట్ పేరు లేదు.

అందుకే మీకు తెలిసి వుంటుందేమోనని వచ్చాను."

"తెలుసు. ఆమె పేరు రాజేశ్వరి. ఇక్కడ రెండు రోజులు ఇన్ పేషెంట్ గా వుందిగూడా!" అంది డాక్టర్ మాధవి.

"ఇన్ పేషెంట్ గానా?"

"అవును."

"ఎందుకు?"

"మెన్సెస్ ట్రబుల్."

"ఐ.సీ. ఆమె అడ్రస్ మీకు తెలుసా?"

"తెలియదు."

"తెలియదా?"

"వుహూఁ...." పెదవి విరిచింది డాక్టర్ మాధవి.

"మరి ఆమెను ఎవరు అడ్మిట్ చేశారు?"

"నా తమ్ముడు."

"అతనికి పరిచయం వుందా?"

"బస్సులో పరిచయమట."

"ఆమె గురించి మీరేమైనా చెప్పగలరా?"

"ఆమె గురించి నేనేం చెప్పగలను? ఆమె జబ్బుగురించి చెప్పగలనుగాని" నవ్వింది డాక్టర్.

"జబ్బుగురించి వివరాలు అక్కర్లేదు. ఆమె ఎవరు? చెప్పగలిగితే చెప్పండి. తల్లిదండ్రులు ఎవరో తెలిస్తే శవాన్ని అప్పగిస్తాము" అన్నాడు.

"ఆమె ఈ వూరు మనిషి కాదనుకుంటాను. అయినా నాకు వివరాలు తెలియవు. మా తమ్ముడు ఆమెను తీసుకొచ్చి అడ్మిట్ చేశాడు. రెండు రోజులుంచి ఈ కాప్సిల్స్ వాడమని రాసిచ్చాను. తర్వాత నాకు కనిపించలేదు" అంది డాక్టర్ మాధవి.

"ఆమె గురించి మీ తమ్ముడు ఏం చెప్పాడు?"

"ఆ సమయంలో నేను లేను. నా అసిస్టెంట్ డాక్టర్ సుశీల వుంది. మా తమ్ముడు ఆమెను అడ్మిట్ చేసి వెళ్ళాడనీ, బిల్లు తనే ఇస్తానన్నాడనీ ఆమెకు డైట్ కూడా ఇవ్వమని చెప్పాడనీ తెలిసింది. తర్వాత అంటే మర్నాడు నాకు ఫోన్ చేశాడు. బస్సులో పరిచయమైందనీ, బాధ పడుతూ వుంటే తీసుకొచ్చి అడ్మిట్ చేశాననీ చెప్పాడు. వాడు తర్వాత రాలేదు. రెండు రోజుల తర్వాత డిశ్చార్జి చేశాను."

"ఐ.సీ.... అయితే ఆమె పూర్తి వివరాలు మీ తమ్ముడికి తెలిసి వుండాలి" అన్నాడు.

"వుండొచ్చు" అంది మాధవి.

"అడ్రస్ చెప్పండి. వెళ్ళి కలుసుకుంటాను."

"బి. గంగరాజు, ఇన్కమ్‌టాక్స్ ప్రాక్టీషనర్, కొత్తపేట. చౌరాస్తాలో బోస్ బొమ్మ వుంది చూడండి. కుడి ప్రక్కగా వెళ్తే ఆఫీసు కనిపిస్తుంది" అంది డాక్టర్ మాధవి.

"థాంక్స్" అని లేచాడు జయకృష్ణ.

"నో మెన్షన్" అంది డాక్టర్ మాధవి.

## 4

ఆఫీసు ముందు పోలీస్ వ్యాన్ ఆగడంచూసి ఆఫీస్ బాయ్ బైటకు వచ్చి తొంగిచూసి వెళ్ళాడు.

సి.ఐ. జయకృష్ణ విజిటర్సు రూమ్‌లో కూర్చున్నాడు.

గంగరాజు గది బైటకు వచ్చి "లోపలకి రండి" అన్నాడు విష్ చేసి.

"ఏమిటి ఇలా వచ్చారు? పోలీసులు వచ్చారంటే ఏదో

విశేషమే" అన్నాడు గంగరాజు నవ్వుతూ.

"రాజేశ్వరి గురించి వివరాలు అడగడానికి వచ్చాను. ఆమె రాత్రి మెయిన్ రోడ్డులో యాక్సిడెంట్లో చని పోయింది" అన్నాడు.

"రాజేశ్వరా? ఆమె ఎవరు?" అన్నాడు గంగరాజు ఆశ్చర్యపోతూ.

'ఆమె ఎవరో తెలియక ఈయన దగ్గరికి వస్తే 'ఆమె ఎవరు?' అని ఎదురుప్రశ్న వేస్తాడేమిటి కర్మ' అనుకుని అనుమానంగా చూశాడు జయకృష్ణ.

గంగరాజుకి దాదాపు నలభై ఏళ్ళుంటాయి. ఎత్తుగా, హుందాగా వున్నాడు. తలలో అక్కడక్కడా తెల్ల వెంట్రుకలు వున్నా, వొత్తుగానే వుంది తల.

టేబుల్ నిండా వున్న ఫైల్సు, ఎకౌంట్ బుక్స్, బీరువాల నిండా వున్న రిఫరెన్సు బుక్స్ చూస్తుంటే అసమానూ బిజీగా వుండే మనిషని తెలిసిపోతూనే వుంది. ఇటువంటివాళ్ళు వాళ్ళ పనిలో తప్ప తక్కిన విషయాల్లో ఆసక్తి కలిగి వుండరు. ఇతను అటువంటి వాడేనా? రాజేశ్వరికి ఇతనికీ సంబంధం ఏమిటి?

"రాజేశ్వరి ఎవరో నాకు గుర్తురావడం లేదు. ఆమె ఏ కంపెనీకి చెందినది?"

అతని మాటలకు అడ్డువచ్చి "ఆమె ఏ కంపెనీకి చెంది నదో నాకు తెలియదు. మూడు రోజుల క్రితం మీరు స్వయంగా మీ అక్కగారి నర్సింగ్ హోమ్‌లో అడ్మిట్ చేయించారట గా!"

గంగరాజు కొన్ని క్షణాలపాటు కళ్ళు మూసుకుని "ఓ....ఆమా!.... నేను ఎవరో అనుకుంటున్నాను. ఏమిటీ ఆమె చనిపోయిందా?" అన్నాడు.

"అవునండీ పాపం. రోడ్డు క్రాస్ చేస్తూ మిల్క్ వ్యాన్ క్రిందపడి చనిపోయింది."

"అయ్యో!........అంటూ" విచారం వ్యక్తపరిచాడు గంగరాజు.

"ఆమె శవం మార్చురీలో వుంది. బంధువులు వస్తే అప్పగించాలి గదా! అందుకే మీకు తెలిసి వుంటుందని వచ్చాను. ఇంతకీ ఆమెకూ మీకు ఏమిటి సంబంధం?"

గంగరాజు కొంచెం కంగారుపడినట్లు కనిపించాడు. తర్వాత సర్దుకుని "నాకూ ఆమెకూ ఏమీ సంబంధం లేదు. ఆమె ఎవరో అసలు?" అన్నాడు.

"ఏమీ సంబంధం లేకపోతే చాలా ఇంట్రెస్ట్ తీసుకుని ఆమెను మీ అక్కగారి నర్సింగ్ హోమ్‌లో ఎందుకు జేర్పించారు? బిల్లు గూడా మీరే పే చేస్తానన్నారనీ, ఆమె వద్ద వసూలు చెయ్యొద్దన్నారనీ తెలిసింది."

"అవును. నిజమే. అసలు జరిగింది చెప్తాను వినండి. విజయవాడ నుంచి సూపర్ ఎక్స్‌ప్రెస్‌లో వస్తున్నాం. ఈ వూరు చేరేసరికి దాదాపు రాత్రి ఎనిమిది దాటుతోంది. అంతకు ముందు అరగంట నుంచీ మా ప్రక్కసీట్లోనే కూర్చున్న ఈ అమ్మాయి ఎందుకో బాధపడుతోంది. నా భార్య ఆమెను అడిగింది.

ఆమె ఏం చెప్పిందో గాని బస్టాండు కొంచెం దూరంలో వుండగా నా భార్య మా అక్కగారి నర్సింగ్ హోమ్‌లో చేర్పించమని అడిగింది. ఆమెకు తోడు ఎవరూ లేరని చెప్పింది. అదేదో ఆడవాళ్ళకు సంబంధించిన వ్యాధి అని చెప్పింది. బస్టాండుకు వెళ్ళే దోవలోనే మా అక్కగారి నర్సింగ్ హోమ్ వుంది. కండక్టర్ని రిక్వెస్టు చేసి అక్కడ బస్సు ఆపి దిగిపోయాం. ఆమెను అందులో అడ్మిట్ చేసి

మేం ఇంటికి వెళ్ళిపోయాం. అంతే. అంతకంటే వివరాలు నాకు తెలియవు."

అదంతా వింటూ తల పట్టుకుని కూర్చున్నాడు సి.ఐ. జయకృష్ణ.

"అయితే, ఆమె ఒంటరిగా విజయవాడ నుంచి వచ్చిందని మీకు తెలుసు. అంతే."

"అంతే. ఆ బస్సు విజయవాడనుంచి బయల్దేరింది. ఆమె మాతో పాటు అక్కడ్నుంచి వచ్చింది."

"అంతకంటే మీకు వివరాలు తెలియవు."

"లేదు సార్!"

"సరే సార్! వెళ్ళొస్తాను. అవసరమైతే మళ్ళీ కలుసుకుంటాను. థాంక్స్" అని సెలవు తీసుకుని బైటపడ్డాడు సి.ఐ.

స్టేషన్ కి వచ్చేసరికి పది దాటింది.

"మీకోసమే ఎదురుచూస్తున్నాను సార్!" అన్నాడు యస్.ఐ. గోపాల్.

"ఏమిటి విశేషం?"

"మిల్క్ వ్యాన్ డ్రైవరు దొరికాడు. వాడిని లాకప్ లో పడేశాను."

"అంతేనా? యేమంటున్నాడు?"

"ఏమంటాడు? నా తప్పేం లేదని మొత్తుకుంటున్నాడు."

"డ్రైవర్లు ఇంకేమంటారు?"

"విశేషం అదికాదు. మహారాణి హోటల్ మేనేజర్ వచ్చి వెళ్ళాడు."

"ఎందుకూ?"

"రూమ్ నెంబరు 116 రేఖా ఎంటర్ ప్రైజెస్ మేనే

జింగ్ పార్ట్నర్ కుమారస్వామి పేరుతో బుక్ చేసి వుందట. రాత్రి అతను అందులో నిద్రపోయాడట. మర్నాడు అంటే ఈ రోజు వుదయం తలుపులు తెరవలేదట. పంచనామా చేసి తలుపులు తెరవమని అప్లికేషన్ రాసిచ్చిపోయాడు. అందులో ఆ కుమారస్వామి సూసైడ్ చేసుకున్నాడేమోనని డౌట్ పడుతున్నాడు."

జయకృష్ణ కుర్చీలో కూర్చుని తల పైకెత్తి ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి సార్ ఆలోచిస్తున్నారు?"

"ఏం లేదు. రాజేశ్వరి కుమారస్వామిని మర్డర్ చేసి పారిపోతూ మిల్క్ వ్యాన్ క్రిందపడి చనిపోయిందా? అని ఆలోచిస్తున్నాను."

"రాజేశ్వరి ఆమె పేరా?"

"అవును. డాక్టర్ మాధవి నర్సింగ్ హోమ్కి వెళ్ళి వస్తున్నాను. కాని వివరాలు ఎవరికీ తెలియవు. రాజేశ్వరి విజయవాడ నుంచి ఒంటరిగా వచ్చిందని చెప్పారు."

"కుమారస్వామిని రాజేశ్వరి మర్డర్ చేసి వుంటుందని ఎలా వూహిస్తున్నారు?" ప్రశ్నించాడు యస్.ఐ.

జయకృష్ణ నవ్వాడు.

"పద చూద్దాం. కుమారస్వామి సూసైడ్ చేసుకుని వుంటే నా ఐడియా తప్పు. మర్డర్ చేసివుంటే ఆ చేసింది ఖచ్చితంగా రాజేశ్వరే" అన్నాడు జయకృష్ణ కుర్చీలో నుంచి లేస్తూ.

## 5

మహారాణి హోటల్ రూమ్ నెంబరు 116 బ్రేక్ చేశారు.

వెల్లకిలా పడుకుని బెడ్ మీద వుంది శవం. రెండు

చేతులూ వెనక్కి విరిచి కట్టివున్నాయి నైలాన్ తాడుతో. నోట్లో గుడ్డలు కుక్కి వున్నాయి. గుండెలో, మెడమీద, పొట్టలో కత్తిపోట్లు వున్నాయి.

దాదాపు పది కత్తిపోట్లు. ఎవరో కసితీరా పొడిచినట్లు వుంది.

హోటల్ మేనేజర్ భయంగా చూశాడు ఇన్‌స్పెక్టర్ వంక.

"ఇతనేనా కుమారస్వామి?" ప్రశ్నించాడు జయకృష్ణ.

"అవున్సార్?"

"ఇతను తరచుగా మీ హోటల్లో రూమ్ తీసుకుంటూ వుంటాడా?"

"గెస్టుకోసం అని విజిటింగ్ రిజిష్టర్‌లో రాయించి తీసుకుంటూ వుంటాడు."

"ఐ.సీ...." అంటూ రూమ్ మొత్తం పరిశీలనగా చూశాడు.

ప్లైవుడ్ పార్టిషన్ అవతలకి వెళ్ళి చూశాడు. సన్‌గ్లాస్ టేబుల్, నాలుగు కుర్చీలు వున్నాయి. టేబుల్ మీద రకరకాల డిషెష్, జానీవాకర్ విస్కీ బాటిల్ వున్నాయి. ఇద్దరు కూర్చుని భోజనం చేసినట్లు రెండు ఎంగిలి ప్లేట్లు అలాగే వున్నాయి! విస్కీ బాటిల్లో మూడు వంతులు ఖాళీ అయింది. నాలుగో వంతు ద్రవం వుంది సీసాలో.

"కుమారస్వామితో పాటు మరొక అమ్మాయి వచ్చింది. ఎవరు ఆమె?" ప్రశ్నించాడు జయకృష్ణ.

భయంగా చూశాడు హోటల్ మేనేజర్.

"ఎవరో సార్ నేను చూడలేదు."

"మీరు చూసే వుండాలి."

"లేదు సార్. నేను రెస్టారెంట్ కౌంటర్లో వున్నాను. లాడ్జింగ్ కి వెళ్ళే మార్గం ప్రక్కగా వుంది. రెస్టారెంట్ లో కూర్చున్నవాళ్ళు చూడకుండానే లాడ్జింగ్ కి ఎవరైనా వెళ్ళిపోవచ్చు."

"కార్లో వస్తే?"

"కారు పార్కు చేసి వెళ్తారు."

"కారు పార్కు మీకు కనిపిస్తుంది గదా!"

"కనిపిస్తుంది."

"కుమారస్వామి ఎప్పుడు వచ్చాడు?"

"కారులోనే వచ్చాడు. సాయంకాలం నాలుగింటికి."

"వెంట ఎవరున్నారు?"

"ఎవరూ లేరు. ఒంటరిగానే వచ్చాడు."

"నో....మీరు అబద్ధం చెప్తున్నారు. నిజం చెప్పండి. లేకపోతే చాల సీరియస్ గా వుంటుంది వ్యవహారం" కటువుగా అన్నాడు జయకృష్ణ.

"నిజం సార్. నేను ఆమె ఎవరో చూడలేదు."

"అయితే మీ హోటల్ బ్రోతల్ హౌస్ గా గూడా వుపయోగపడుతుందన్న మాట."

"అన్ని హోటల్స్ అంతే సార్! ఎవరు మొగుడూ పెళ్ళాలో ఎవరికి తెలుసు? రోజుకి వందరూపాయలు అద్దె మాకు కావాలి. ఎవరొచ్చినా ఇవ్వక తప్పదు. అంతా ఘరానా పెద్దమనుషులే" అన్నాడు హోటల్ మేనేజర్.

"మీ లాడ్జింగ్ లో పనిచేసే బాయిస్ ని ఒక్కసారి పిలిపించండి."

"అలాగే."

కాసేపటికి ఒక్కొక్కళ్ళే రాసాగారు. అందర్నీ ప్రశ్నించాడు జయకృష్ణ.

రాజయ్య అనే కుర్రాడు ఎవరో ఆడమనిషి వచ్చిందని చెప్పాడు. కాని ముఖం చూడలేదట. రెస్టారెంట్ నుంచి క్యారేజి తెచ్చిపెట్టాననీ, అప్పుడామె బాత్ రూమ్ లోకి వెళ్తూ వుంటే చూశాననీ, ముఖం కనిపించలేదనీ చెప్పాడు. క్యారేజి తెచ్చాక తనను వెళ్ళిపొమ్మన్నారనీ, తర్వాత లోపల బోల్టు పెట్టుకున్నారనీ ఖచ్చితంగా చెప్పాడు.

ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్టు వచ్చి గ్లాసులమీద డిష్‌ల మీద పౌడర్ చల్లి ప్రింట్స్ ట్రేస్ చేస్తున్నాడు.

కాసేపటికి కుమారస్వామి బంధువులు వచ్చారు.

శవ పంచాయితీ జరిపి శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించారు.

# 6

"కుమారస్వామి నాకు మేనమామ కొడుకు" అన్నాడు మేనేజర్ సీట్లో కూర్చున్న అతను.

నేమ్ బోర్డువంక చూశాడు సి.ఐ. జయకృష్ణ.

"ఆర్.కె. మూర్తి, బి.కామ్.," అని వుంది.

"చూడండి మూర్తిగారూ! కుమారస్వామి గురించి మీకు తెలిసిన విషయాలు చెప్పండి. చెడ్డవైనా సరే దాచకండి. కేసు ఈజీగా సాల్వ్ చెయ్యడానికి ఒక చిన్న విషయం సహాయపడవచ్చు" అన్నాడు జయకృష్ణ.

"అడగండి సార్. మీకేం కావాలన్నా నిజం చెప్తాను. వాడు పోయాక ఇక దాచుకోవడానికేముంటాయి?" విచారంగా అన్నాడు మూర్తి.

"కుమారస్వామికి చెడు అలవాట్లు వున్నాయా?"

"చెడు అలవాట్లు అంటే మీ దృష్టిలో ఏమిటో ముందు చెప్పండి."

"ఆడవాళ్ళతో వ్యభిచరించడం...."

"నాకు తెలిసినంతవరకూ వాడు మంచివాడు. పార్టీలలో తప్ప డ్రింక్ తీసుకోడు. ఆరోగ్య సూత్రాలు చాలా వరకూ పాటిస్తాడు. ఇక ఆడవాళ్ళ కోసం ప్రాకులాడినట్లు నేనెప్పుడూ నోటీస్ చెయ్యలేదు. మా కంపెనీలోనే దాదాపు పదిమంది ఆడపిల్లలు జాబ్ చేస్తున్నారు. ఎవరితోనూ డీలింగ్స్ లేవని ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు మూర్తి.

"మీరు భ్రమపడుతున్నారేమోనని నేను సందేహిస్తున్నాను."

"కావచ్చు. నిప్పులేనిదే పొగరాదనే సామెత వుంది గదా! అసలా పొగ సంగతే నా నోటీస్‌లోకి రానప్పుడు! నిప్పు సంగతి ఏం చెప్పగలను?"

"మీరు చెప్పేవాటికి జరిగిన సంఘటనకీ ఎక్కడా పొత్తు కుదరటం లేదు. కుమారస్వామి మహారాణి హోటల్లో గెస్టుకోసం రూమ్ బుక్ చేశాడు. విజిటర్స్ రిజిష్టరులో అతనే స్వయంగా సైన్ చేశాడు. ఆ రోజు అతని గదిలో రాజేశ్వరి గడిపినట్లు సాక్ష్యం వుంది. అతని శరీరంపై వున్న కత్తిపోట్లు రాజేశ్వరి బ్యాగ్‌లో దొరికిన కత్తితో పొడిచినట్లు రుజువైంది. రాజేశ్వరి అతన్ని చంపినట్లు తేలింది."

తల వూపాడు మూర్తి.

"రాజేశ్వరి ఎవరు? అనే విషయం తేలడం లేదు. మీరెప్పుడైనా ఆమెను చూశారా?" అంటూ డైరీలోనుంచి ఫొటోలు తీసి టేబుల్ మీద పెట్టాడు.

మూర్తి పరీక్షగా చూశాడు ఫొటోలన్నీ.

"లేదుసార్. ఈమెను ఎప్పుడూ చూళ్ళేదు" అన్నాడు

మూర్తి.

"కుమారస్వామికి పెళ్ళయి యెంతకాలమైంది?"

"పదేళ్ళు కావచ్చు. నా చెల్లెల్నే యిచ్చి పెళ్ళి చేశాం. ముగ్గురు పిల్లలు కూడా!" విచారంగా అన్నాడు మూర్తి.

"కుమారస్వామి ప్రవర్తన మంచిది. ఆడవాళ్ళతో డీలింగ్స్ లేవని చెప్తున్నారు. పోనీ అతను పూర్వాశ్రమంలో రాజేశ్వరిని ప్రేమించి వుండే అవకాశం వుందా?"

"చదువుకునే రోజుల్లో సంగతి చెప్పలేను. కాని ఆమె విజయవాడనుంచి వచ్చిందంటున్నారు. మావాడు విజయవాడలో యెప్పుడూ వుండలేదు. బి.యస్సీ. ఇక్కడే ప్యాసయ్యాడు. తర్వాత గిండీ ఇంజనీరింగ్ కాలేజీలో చదివాడు."

"ఆమె విజయవాడ నుంచి బస్సులో వచ్చింది. అంత మాత్రాన ఆమె నేటివ్ విజయవాడ అని నిర్ధారించలేం గదా!"

తల వూపాడు మూర్తి.

బాయ్ స్ప్రింగ్ డోర్ తెరచి ట్రేలో కూల్ డ్రింక్స్ తెచ్చి సర్వ్ చేశాడు.

"ప్లీజ్ టేకిట్" అన్నాడు మూర్తి స్ట్రా నోట్లో పెట్టుకుంటూ.

జయకృష్ణ కూల్ డ్రింక్ బాటిల్ నోట్లో పెట్టుకున్నాడు స్ట్రా అవతల పారేసి.

"నాకు ఇలా త్రాగటం ఇష్టం" అన్నాడు.

నవ్వాడు మూర్తి.

"రాజేశ్వరి, కుమారస్వామిని ప్రేమించి వుండొచ్చా? భగ్నప్రేమతో అతనిమీద కసి తీర్చుకుని...."

జయకృష్ణ మాటలకు అడ్డువస్తూ "అలా జరిగి వుండ

డానికి ఎలా అవకాశం వుంటుంది? వాడికి పెళ్ళయి పదేళ్ళు దాటింది. వాడి మీద కసి,కోపం వుంటే ఇన్నేళ్ళు వూరు కుంటారా ఎవరైనా?" అన్నాడు.

"చెప్పలేం. కుమారస్వామి ఆమెను ఇన్నాళ్ళూ బాధ్య పెడుతూ వుండొచ్చును. ఆమె ఇక సహించలేక తెగించి అతన్ని చంపి వుండొచ్చు."

"అనుకోవడానికి ఎన్నో అనుకోవచ్చును. కాని నా కెందుకో ఇది వాడి లౌ ఎఫైర్ అనిపించడం లేదు. మనకు తెలియని రహస్యం ఏదో వుందని నాకు అనుమానంగా వుంది" అన్నాడు మూర్తి.

"వుండొచ్చును. మనం అన్ని కోణాల నుంచి కారణాలు వెతకాలి. కేసుకు అసలు కారణం తెలిసే వరకూ అన్నీ అనుమానించదగినవే" అన్నాడు జయకృష్ణ.

"మే బీ" అన్నాడు మూర్తి తల వూపుతూ.

"నేను మీ సిస్టర్ని కలుసుకోవాలనుకుంటున్నాను."

"తప్పకుండా." అంటూ బజర్ నొక్కాడు.

బాయ్ వచ్చాక "డ్రైవర్ని కారు పోర్టికోలో పెట్ట మను" అన్నాడు.

ఇద్దరూ రూమ్ బైటకు వచ్చారు.

"నాకు బండి వుంది లెండి" అన్నాడు జయకృష్ణ.

"మీ బండి వెనుక వస్తుంది. రండి ఇద్దరం నా కారులో వెళ్దాం" అన్నాడు.

"ఫరవాలేదు మీరు రండి" అంటూ జయకృష్ణ పోలీస్ వ్యాన్‌లో యెక్కి కూర్చున్నాడు.

ముందు మూర్తి కూర్చున్న ఫియట్‌ని అనుసరిస్తోంది పోలీస్ వ్యాన్.

ఆ వీధిలోకల్లా విశాలమైన ఆవరణలో కట్టబడిన

మూడంతస్తుల మేడ ముందు ఆగింది ఫియట్. ఇనుప గేటు మూసి వుంది. డ్రైవరు హారన్ కొట్టాడు. కాసేపటికి వాచ్ మాన్ వచ్చి గేటు బార్లా తీశాడు.

"రండి సార్!" అంటూ లోపలకు ఆహ్వానించాడు మూర్తి.

జయకృష్ణ, మూర్తిని అనుసరించి వెళ్ళాడు.

హాల్లో సోఫాలో కూర్చోబెట్టి మూర్తి మేడపైకి వెళ్లాడు. కొంచెం సేపటికి దిగి వచ్చాడు.

"పైకి రండి సార్" అన్నాడు.

జయకృష్ణ అతన్ని అనుసరిస్తూ "మీ సిస్టర్ పేరు?" అన్నాడు.

"అరుణ."

సర్కిల్ ఇనస్పెక్టర్ని చూస్తూనే అరుణకి దుఃఖం ముంచుకొచ్చింది.

"వూరుకోమ్మా! మీ రెంతో బాధలో వున్నారు. మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం భావ్యంకాదు. కాని ఇది మర్డర్ కేసు. ఇన్వెస్టిగేట్ చేసి హంతకుల్ని పట్టుకోవడం, అందుకు కారణాలు వెతికి పై అధికారికి రిపోర్టు చెయ్యడం వంటి బాధ్యతలున్నాయి. అందుకే తప్పని పరిస్థితిలో మిమ్మల్ని ఇబ్బంది పెట్టవలసి వచ్చింది" అన్నాడు.

అరుణ కాసేపటికి వూరడిల్లింది. చీర చెంగుతో కళ్ళు తుడుచుకుని "కూర్చోండి" అంది.

జయకృష్ణ కూర్చున్నాడు.

మూర్తి బాల్కనీలోకి వెళ్ళిపోయి పచార్లు చేస్తూ వున్నాడు.

"మీకు పెళ్ళయి పదేళ్ళయింది కదూ!"

అరుణ తల వూపింది అవునన్నట్లు.

"మీ భర్త చాల మంచివాడని మూర్తిగారు చెప్పారు."

ఆమె ఏమీ మాట్లాడలేదు. శూన్యంలోకి చూస్తూ వుంది.

"మీకు తెలిసిన సంగతేగదా! మీ భర్తని రాజేశ్వరి అనే అమ్మాయి చంపింది. మీ రెప్పుడైనా ఆమెను చూశారేమో గుర్తుకు తెచ్చుకోండి" అంటూ డైరీలో నుంచి రాజేశ్వరి ఫొటోలు ఆమెకు అందించాడు.

అరుణ నీళ్ళునిండిన కళ్ళను తుడుచుకుని తదేకంగా ఆ ఫొటోలను చూసింది.

తల అడ్డంగా వూపుతూ "ఆమెను ఎప్పుడూ చూళ్ళేదు సార్" అంది.

"పోనీ మీ పెళ్ళికాక పూర్వం మీ భర్త ఎవర్నయినా ప్రేమించారని మీకేమైనా తెలుసా?"

అరుణ అనుమానంగా చూసింది.

"నా వుద్దేశ్యం కరెక్టు కాకపోవచ్చును. మీకేమైనా తెలిసి వుంటే చెప్పండి" అన్నాడు.

"లేదుసార్. నాకేమీ తెలియదు" అంది.

జయకృష్ణ దృష్టి క్రింద అంతస్థులో లైఫ్ సైజు ఫొటో మీద పడింది. అది కుమారస్వామిదే. ఆ ఫొటోకి పూలదండ వేసివుంది. నుదుట కుంకుమబొట్టు పెట్టారు. కాని ఆ పూలదండ ఎండిపోయి వుంది. అది గులాబీ పూలదండ.

జయకృష్ణకి ఆశ్చర్యం వేసింది. కుమారస్వామి చనిపోయి రెండు రోజులు కాలేదు. అప్పుడే పూలదండ వెయ్యడమూ, అది ఎండిపోవడమూ ఎలా సంభవించి వుంటుంది?

"థాంక్స్ అరుణగారూ! అవసరమైతే మిమ్మల్ని

మళ్ళీ కలుసుకుంటూను" అన్నాడు.

మూర్తితో కలసి క్రిందకు దిగివచ్చాడు.

ఆ ఫొటో ముందు ఆగి తల పైకెత్తి చూశాడు. రంగూన్ స్టూడియో అని డేట్ స్టాంపు వుంది. అక్టోబరు 16, 1976 తారీఖున తీసిన ఫొటో అది. నాలుగేళ్ళ క్రితం ఫొటో కాబట్టి కుమారస్వామి ముఖం కొంచెం లేతగా వుంది.

ఆ పూలదండ సంగతి ఎలా ప్రశ్నించాలో అతనికి అర్థం కాలేదు. బ్రతికున్న వారికి ఎవరైనా పూలదండ వేస్తారా?

"ఈ ఫొటో...." అని ప్రశ్నార్థకంగా చూశాడు మూర్తి వైపు.

"ఇది సుధాకర్‌ది" అన్నాడు మూర్తి.

జయకృష్ణ ఆశ్చర్యపోయాడు.

"సుధాకర్ ఎవరు?" అన్నాడు.

"కుమారస్వామి తమ్ముడు. వాడు చనిపోయి మూడేళ్ళయింది. సడన్‌గా పోయాడు. బ్లడ్ క్యాన్సర్" అన్నాడు మూర్తి.

"ఐ.సీ....అచ్చం కుమారస్వామి లాగే వున్నాడు. అతని ఫొటో అనుకున్నాను" అన్నాడు జయకృష్ణ ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ.

"ఇద్దరూ ఒకలాగే వుంటారు రూపంలో. కుమారస్వామికంటే రెండేళ్ళు చిన్నవాడు వీడు. ప్రవర్తనలో పోలికలు లేవు ఇద్దరికీ. వాడు బాగా చదువుకుని ఇంజనీరై వ్యాపారాన్ని వృద్ధిచేస్తే, వీడికి చదువు వంటబట్టక చెడు తిరుగుళ్ళు తిరిగి రోగాల పాలై పోయాడు."

"ఐతే ఇతను చనిపోయేముందు ఎక్కడ వుండేవాడు?"

"ఇక్కడే వుండేవాడు. కుమారస్వామి తమ్ముడి గురించి పట్టించుకునేవాడు కాదు. వాడు యెక్కడెక్కడో తిరుగుతూ విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెడుతూ వుండేవాడు."

జయకృష్ణ నవ్వుతున్నవాడల్లా ఆగి "అయితే సుధాకర్ ఎప్పుడైనా విజయవాడలో చదువుకున్నాడా?" అని ప్రశ్నించాడు.

మూర్తి ఆలోచనలోపడి "యస్ ఇనస్పెక్టర్ గారూ! రెండేళ్ళు విజయవాడలోనే హాస్టల్లో చదువుకున్నాడు. కరక్టే. ఇప్పుడు గుర్తుకొస్తోంది. ఏడెనిమిదేళ్ళ క్రితం అనుకుంటాను. అప్పుడు వాళ్ళ ఫాదర్ బ్రతికే వున్నాడు. ఇంట్లో వుండి సరిగా చదవడం లేదని విజయవాడ పంపించారు. కాని అక్కడా అంతే. ఇంటర్ గూడా ప్యాసవలేక పోయాడు. పైగా అన్నీ తగాదాలు తెచ్చేవాడని వాళ్ళ ప్రిన్సిపాల్ లెటర్సు రాసేవాడు" అన్నాడు.

"నాకిప్పుడు ఒక అనుమానం వస్తోంది. సుధాకర్ అనుకుని అతని విరోధులు ఎవరైనా అంటే రాజేశ్వరి కుమారస్వామిని మర్డర్ చెయ్యలేదుగదా!"

మూర్తి నవ్వాడు.

"సుధాకర్ చనిపోయి మూడేళ్ళయింది. అతనిమీద పగవున్న వాళ్ళు ఇన్నాళ్ళూ ఏం చేశారు? పైగా సుధాకర్ చనిపోయాడని ఆ మాత్రం తెలుసుకోకుండా ఇంత దారుణం చేస్తారా?"

"సమ్ మిస్టేక్ ఈజ్ దేర్!" అన్నాడు జయకృష్ణ.

మూర్తి ఆలోచనలో పడిపోయాడు.

"థాంక్యూ మిస్టర్ మూర్తి! సీ. యూ. ఎగైన్"
అన్నాడు జయకృష్ణ పోలీస్ వ్యాన్ ఎక్కుతూ.

## 7

"రావోయ్! గోపాల్. రామస్వామి మనకొక తంటా తెచ్చిపెట్టాడు" అన్నాడు సి.ఐ. జయకృష్ణ.

యస్.ఐ. గోపాల్ విష్ చేసి వచ్చి కూర్చున్నాడు.

ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్టు రామస్వామి నవ్వాడు గోపాల్‌ని చూసి.

"ఏమిటి సార్ విశేషం?" అన్నాడు గోపాలో.

"ఏముంది? రాజేశ్వరి కుమారస్వామిని మర్డర్ చేసిందని మనం అనుకుంటున్నాంగదా! ఇప్పుడేమో ఆ కత్తి మీద మరొకరి ఫింగర్ ప్రింట్స్‌గూడా కనిపిస్తున్నాయి. రాజేశ్వరి ఫింగర్ ప్రింట్స్‌గాక వేరే ఎవరివో ఫింగర్ ప్రింట్స్ గూడా వున్నాయి. దాన్నిబట్టి రాజేశ్వరితో పాటు మరొకరు రంగంలోకి దిగారు" అన్నాడు జయకృష్ణ.

"నేను అనుకుంటూనే వున్నాను సార్. ఎంత ధైర్యం గలిగిన ఆడపిల్లయినా ఒక మగాడిని కట్టేసి, కదలకుండా, అరవకుండా నోట్లో గుడ్డలు కుక్కి చంపగలదా? అని అనుమానం పీడిస్తూనే వుంది. కాని ఏం చెప్పగలం. ఏమో తెగించిన ఆడది ఎంత దారుణమైనా చెయ్యగలదు అని అనుకున్నాను."

"నువ్వలాగే అనుకోగాని ఈ తలనొప్పి వ్యవహారం ఎప్పుడు తేలుతుందో? రాజేశ్వరి మర్డరు చేసిందని తేలి వుంటే అందుకు కారణాలు తెలియకపోయినా కొంప మునిగేది ఏమీ లేదు. కేసు క్లోజ్ చేయించేవాళ్ళం. కాని ఇప్పుడు హంతకుడు యెవరో మరొకరు అని అనుమానిం

చాల్సి వస్తోంది" అన్నాడు జయకృష్ణ.

"విజయవాడ నుంచి మెసేజ్ వస్తే బాగుండును సార్" అన్నాడు గోపాల్.

"నమ్మకం ఏముంది? ఎవరైనా ఇన్ఫర్మేషన్ ఇస్తే గదా తెలిసేది."

"మనం ఏం చెయ్యాలి ఇప్పుడు?"

"వీళ్ళ ఫింగర్ ప్రింట్స్, ఫింగర్ ప్రింట్స్ బ్యూరోకి పంపుదాం. పాత క్రిమినల్ యెవరైనా ఈ మర్డరు చేసి వుంటే తెలుస్తుంది గదా!" అన్నాడు జయకృష్ణ.

"పాత క్రిమినల్ కాకపోతే!"

"ఫింగర్ ప్రింట్స్ బ్యూరోనుంచి రిపోర్టు రానివ్వు. కాకపోతే అప్పుడే ఆలోచించవచ్చు."

"క్రీడెంచి మేలెంచమన్నారుగదా! ఈలోపల మన ఇన్వెస్టిగేషన్ సాగించాలి."

"ష్యూర్! ష్యూర్!"

"కుమారస్వామి మర్డర్ కేసు అన్ని పేపర్లలో వచ్చింది చూశారా?"

"ఆఁ....చూశాను."

"మహారాణి హోటల్ మేనేజర్ లబలబ కొట్టుకుంటు న్నాడు తను హోటల్‌కి చెడ్డపేరు వచ్చిందని."

"మనం ఏం చేస్తాం దానికి. రోజులన్నీ ఒకలాగే వుంటాయా?" అని నవ్వాడు జయకృష్ణ.

"అవుననుకోండి."

"మిస్టర్ గోపాల్ నువ్వొక పని చెయ్యాలి."

"చెప్పండి సార్!"

"రేఖా ఎంటర్‌ప్రైజెస్ ఆఫీసుకి వెళ్ళి కొంత సమా

చారం సేకరించుకు రావాలి."

"మీరు వెళ్ళివచ్చారుగా!"

"వెళ్ళాననుకో. కాని ఈసారి మఫ్టీలో వెళ్ళి కుమార స్వామి స్టెనోనిగాని, పర్సనల్ జవాన్నిగాని పట్టుకో. కుమారస్వామి పర్సనల్ లైఫ్ అంటే అతను ఎలా ప్రవర్తించేవాడు వీలైనంత రాబట్టు. వాళ్ళలో ఎవరైనా రాజేశ్వరిని ఎరిగిన వాళ్ళు వుంటే వుండొచ్చు."

"యస్సార్. వెంటనే వెళ్తాను. కాని మనం అక్కడికి వెళ్ళి వాళ్ళని బ్రతిమాలేకంటే స్టేషన్‌కి తీసుకొచ్చి అడిగితేనే నిజం చెప్తారని నా వుద్దేశ్యం."

"నీ ఇష్టం. నేను ఫింగర్ ప్రింట్స్ ఫింగర్ ప్రింట్స్ బ్యూరోకి పంపే ఏర్పాటు చేస్తూ వుంటాను. నువ్వా పనిలో వుండు" అన్నాడు జయకృష్ణ.

యస్.ఐ. గోపాల్ టెలిఫోన్ డైరెక్టరీ తీసి రేఖా ఎంటర్‌ప్రైజేస్ ఫోన్ నెంబర్ నోట్ చేసుకున్నాడు.

రెండుసార్లు ట్రైచేశాక నెంబర్ దొరికింది.

"రేఖా ఎంటర్‌ప్రైజెస్ ప్లీజ్."

"ఐ వాంట్ మిస్టర్ మూర్తి, మేనేజర్."

"ప్లీజ్ బీ ఆన్ ది లైన్."

కొంచెం సేపటికి రిప్లై వచ్చింది.

"సారీ సర్. మిస్టర్ మూర్తి గాన్ ఔట్‌సైడ్. నా టైమిాజ్ ఎబౌవుట్ ఫోర్ ఓ క్లాక్. హీ మేనాట్ కమ్ టూ ఆఫీస్. ప్లీజ్ రింగ్ టూ ఆర్.వి.ఆర్. క్లబ్ ఆర్ టూ హిజ్ రెసిడెన్స్."

"థాంక్స్."

గోపాల్ టెలిఫోన్ క్రెడిల్ మీద పెట్టేశాడు.

"ఎవరికి ఫోన్."

"వాళ్ళ మేనేజర్ మూర్తి వున్నాడేమోనని ఫోన్ చేశాను. లేడట."

"అతనెందుకు? అయినా అతనికి ఏమీ తెలియదు. అతని గొడవ అతనిదే. తన చెల్లెల్ని ఇచ్చాడు కాబట్టి కుమారస్వామి మంచివాడు, బుద్ధిమంతుడూ అంటూ చెప్పుకొచ్చాడు."

"ఇంటిగుట్టు రచ్చకెక్కించుకుంటారా ఎవరైనా?"

"అంతే.... అంతే...."

"నేను మేనేజర్ని కలుసుకోవడానికి కాదు ఫోన్ చేసింది."

"మరి?"

"అతను లేనప్పుడు వెళ్తే పని సులభంగా వుంటుంది. తీరా అతను వుంటే వాడికి ఏదైనా గైడెన్సు ఇవ్వొచ్చుగా!"

"నీ ఐడియా కరెక్టే."

"ఇప్పుడే వెళ్ళి కుమారస్వామి పర్సనల్ జనాన్ని పిల్చుకుని వస్తాను" అన్నాడు యస్.ఐ.

"వెళ్ళిరా!"

యస్.ఐ. వెళ్ళాడు.

జయకృష్ణ, డియస్పీ ఇంటికి వెళ్ళి మాట్లాడి వచ్చేసరికి స్టేషన్లో ఒక కుర్రాడు కూర్చుని వున్నాడు.

సి.ఐ. ని చూసి విష్ చేశాడు అతను.

"ఇతను కుమారస్వామి స్టెనో. మిస్టర్ రాఘవ" అన్నాడు యస్.ఐ.

తల వూపాడు జయకృష్ణ.

"ఏమిటి సంగతులు. మనకి పనికివచ్చే సమాచారం ఏదైనా వుందా?" ప్రశ్నించాడు సి.ఐ.

"ఇతను చెప్పే సంగతులు వింటూ వుంటే మతిపోతూ వుంది. కేసు మరొక మలుపు తిరిగేటట్లుంది" అన్నాడు యస్.ఐ.

"ఏమిటి?" ఆసక్తిగా ప్రశ్నించాడు.

"మూర్తి చెప్పినవాటికి ఇతను చెప్పేవాటికి పోలికలే లేవు. కుమారస్వామికి అన్ని అలవాట్లూ వున్నాయట. పైగా మహారాణి హోటల్ అతని బృందావనమనీ, అతనొక అపర శ్రీకృష్ణుడనీ చెప్తున్నాడు."

"అయితే మూర్తికి బావగారి సంగతి తెలిసి వుండకుండా వుండాలి. లేదా కావాలని మనతో అబద్ధాలు చెప్పి వుండాలి" అన్నాడు జయకృష్ణ.

"గొప్పవారి గోత్రాలు అంతే సార్" అని నవ్వాడు రాఘవ.

"అంతేకాదు సార్ రాఘవ మరొక ఆసక్తికరమైన సంగతి బైటపెట్టాడు."

"ఏమిటి?"

"కుమారస్వామి భార్య అరుణ కారెక్టర్ మంచిది కాదట."

"ఈజిట్?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సి.ఐ.

"అందులో ఆమె తప్పు ఎంతమాత్రమూ లేదుసార్. భర్త వ్యభిచారి. వారానికి ఒకరోజైనా పెందరాళే ఇంటికి చేరుకుంటే గొప్ప. ఎప్పుడూ క్లబ్బు పేకాట, హోటళ్ళలో క్యాబరే డ్యాన్సుల కాలక్షేపం. కొంతవరకూ తాగి హోటల్లోనే మందలతో మకాం. ఆమె మాత్రం ఏం చేస్తుంది? ఉప్పూ కారం తినే మనిషేగదా!" అన్నాడు రాఘవ.

"ఇంతకీ నువ్వు చెప్పేది సూటిగా చెప్పవయ్యా!"

అన్నాడు సి.ఐ.

"చెప్తాను సార్! కాని నన్నుమాత్రం ఈ కేసులో ఇరికించకండి. నా పేరు బైటపెడితే నా వుద్యోగం పోతుంది" బెరుగ్గా అన్నాడతను.

"నో....నో....అలా జరగదు చెప్పు" హామీ ఇచ్చాడు.

"కిరణ్ కుమార్ అని అసిస్టెంట్ మేనేజర్ వున్నాడు సార్. మూర్తిగారి తర్వాత అతనిదే పెత్తనం. ఫైల్సు మీద డిస్కుషన్స్‌కనీ, చెక్కులమీద సంతకాలకనీ మూర్తిగారికోసం ఇంటికి వెళ్తూ వుంటాడు సార్! ఎలా కలిసిందోగాని మూర్తిగారి చెల్లెలు అరుణతో సంబంధం కుదిరింది సార్!"

జయకృష్ణ ఆశ్చర్యంగా వింటున్నాడు అతను చెప్పేదంతా.

"ఇదంతా నీకెలా తెలుసు?"

"ఇటువంటివి ఎలా తెలుస్తాయి సార్! ఇంట్లో పని మనుషులద్వారా! వాళ్ళ ప్రవర్తనద్వారా! నాకే కాదు సార్! మా కంపెనీలో చాలామందికి తెలుసు వీళ్ళ వ్యవహారం. అందరికీ తెలిసినా ఎవరికీ తెలియనట్లు ప్రవర్తిస్తూ వుంటారు సార్! అసలు ఇదంతా ఆమె భర్తకి, అన్నకి గూడా తెలుసేమోనని నా అనుమానం. ఎందుకంటే రెండు నెల్ల క్రితం కిరణ్ కుమార్ వుద్యోగం పోయింది."

"ఐ.సీ...." అన్నాడు జయకృష్ణ ఏదో ఆలోచిస్తూ.

"వీళ్ళ ప్రవర్తన విచ్చలవిడిగా వుండి వుంటుంది. అందుకే కట్ చేసి వుంటారు."

"అది సరే. కుమారస్వామి మర్డర్ గురించి మీరేం చెప్తారు?"

"నేను అనుమానించడం కిరణ్ కుమార్ నే. కుమార

స్వామి భార్య, కిరణ్ కలసి ఈ మర్డర్ చేయించి వుంటా రని నా అనుమానం. ఎందుకంటే కిరణ్ కుమార్ కి ఇంకా పెళ్ళికాలేదు. భర్తపోయాక తన కనుసన్నలలో వుండే ఇతన్ని చేపట్టవచ్చని ఆమె అనుకుని వుండొచ్చునుగదా!"

"మీది కేవలం అనుమానమేనా లేక ఏదైనా ఆధారం చూపగలగా? ఇంతకీ రాజేశ్వరిని మీరెప్పుడైనా చూశారా?" ప్రశ్నించాడు సి.ఐ.

"రాజేశ్వరి ఎవరో నాకు తెలియదు. నేనెప్పుడూ చూళ్ళేదు. ఆ రాజేశ్వరి ఏ బ్రోతలో అయివుంటుంది సార్! ఇదంతా గూడా పైడితల్లి ద్వారా జరిగివుంటుందని నాకు అనుమానం" అన్నాడు రాఘవ.

"పైడితల్లి ఎవరు?"

"పైడితల్లి కుమారస్వామి జవాన్ సార్! ఈ మర్డర్ జరిగిన మర్నాటినుంచే వాడు కనిపించడంలేదు. నాకు వాడి మీదే అనుమానం. డబ్బు ఆశపెడితే ఎలాంటి పనికైనా సిద్ధమే వాడు."

"ఐ.సీ.... పైడి తల్లి అడ్రస్ తెలుసా?"

"తెలుసు సార్! మా వర్కర్సు అడ్రసులన్నీ మా రికార్డులో వుంటాయి. చూసి చెప్తాను."

"ఫోన్ చేసి చెప్పండి."

"నో సార్! నేను రేపు నోట్ చేసి స్వయంగా అందజేస్తాను."

"కిరణ్ కుమార్ ఏం చేస్తున్నాడు ప్రస్తుతం?"

"ఏం చేస్తాడు సార్? రోడ్లు సర్వే చేస్తున్నాడు" అంటూ నవ్వాడు రాఘవ.

"కిరణ్ కుమార్ అడ్రస్ గూడా కావాలి."

"అలాగేసార్, పైడితల్లి అడ్రస్ తోపాటు కిరణ్

కుమార్ అడ్రస్ గూడా తెలియజేస్తాను."

"ఓ.కె. థాంక్స్" అన్నాడు జయకృష్ణ.

## 8

"గుడ్ మార్నింగ్ సార్!" అంటూ ప్రవేశించాడు రామస్వామి.

"కమిన్ రామస్వామీ!" అన్నాడు సి.ఐ.

బ్రౌన్ కలర్ కవరులో నుంచి ఫింగర్ ప్రింట్స్ తీసి సి.ఐ. ముందు వుంచి "నిన్న మీరు పంపిన టీ గ్లాస్ మీద ఫింగర్ ప్రింట్స్ తీశాను సార్" అన్నాడు.

"అవి కిరణ్ కుమార్ వి. కత్తిమీద ప్రింట్స్‌తో టాలీ అయ్యాయో లేదో చూశావా?"

"చూశాను సార్! అవి కిరణ్ కుమార్ వి కాదు" అన్నాడు రామస్వామి.

"కాదా!...." అంటూ నిరుత్సాహ పడ్డాడు జయకృష్ణ.

ఇంతలో స్టేషన్ బైట పోలీస్ వ్యాన్ ఆగింది.

ఇద్దరు కానిస్టేబుల్స్ ఒక బక్క మనిషిని బలవంతంగా లాక్కుని వస్తున్నారు. వాడు గిలగిల కొట్టుకుంటున్నాడు భయంతో. యస్.ఐ. గోపాల్ నవ్వుకుంటూ లోపలకు వచ్చాడు.

"ఎవరు అతను?" ప్రశ్నించాడు సి.ఐ.

"వాడేసార్ పైడితల్లి. వూళ్ళోనే వున్నాడు కాని ఇంట్లో లేడు. వాళ్ళ బావమ్మర్ది ఇంట్లో మకాం పెట్టాడు. వెతికి పట్టుకొన్నాను" అన్నాడు యస్.ఐ.

పైడితల్లి లోపలకు వస్తూనే అమాంతం సి.ఐ. కాళ్ళ మీద పడిపోయి ఏడవసాగాడు.

"నాకేం తెలియదుసార్!"అంటూ శోకాలు పెట్టాడు.

కానిస్టేబుల్ బలవంతాన పైకి లేపి నిల్చోబెట్టాడు.

"ఎందుకు అలా ఏడుస్తావ్?" విసుగ్గా అన్నాడు సి.ఐ.

"నాకే పాపం తెలియదు సార్. నన్ను అన్యాయంగా పట్టుకున్నారు సార్!" ఏడుస్తూనే చెప్తున్నాడు పైడితల్లి.

"తెలిసింది చెప్పు. లేకపోతే పదేళ్ళు జైలు పడుతుంది."

"నాకేం తెలుసు సార్?"

"ఏం తెలియకపోతే డ్యూటీ మానుకుని నీ బామ్మర్ది ఇంట్లో యెందుకు దాక్కున్నావ్?" గద్దించాడు సి.ఐ.

"చెప్పు. కిరణ్ కుమార్ నీతో ఏం చేయించాడు? ఆ రాజేశ్వరి ఎవరు? నిజం చెప్పు."

"కిరణ్ బాబు నాకేం చెప్పలేదు సార్!"

"మరి యెవరు చెప్పారు? ఏం చేయించారు? నిజం చెప్తే వదిలేస్తాం. లేదా మరి ఇంటికి వెళ్ళవ్!"

"ఆ అమ్మ ఇంతపని చేస్తదని తెలియక బుద్ధి గడ్డితిని ఆ పని చేసాను సార్!"

"ఏ అమ్మ?"

"ఆ అమ్మే సార్! రాజేశ్వరమ్మ."

"వూఁ.... చెప్పు. రాజేశ్వరి ఎవరు?నువ్వు ఏం చేశావు?"

"ఎవరో నాకేం తెలుసు సార్! ఒకరోజు నేను డ్యూటీచేసి ఇంటికి పోతుంటే పలకరించింది. వాళ్ళ అన్న యెవడో వున్నాడంట. ఆడికి వుద్యోగం కావాలంట. డైరెక్టర్ని కలుసుకునే మార్గం చెప్పమంది. మామూలు సంగతే గదా అని అయ్యగారికి చెప్పాను. అయ్యగారు ఆవిడని మిహారాణి హోటల్లో వుంచి రమ్మన్నారు. అంతే సార్! ఆ తర్వాత నాకేం తెలియదు."

"పోనీ రాజేశ్వరి ఏ వూరునుంచి వచ్చిందో నీకు

తెలుసా?"

"విజయవాడ నుంచి వచ్చానని చెప్పింది సార్. వాళ్ళ అన్నకి వుద్యోగం గురించి అయ్యగారితో మాట్లాడటానికి వచ్చానని చెప్పింది. అంతేసార్. అంతకంటే నాకేం తెలియదు" అన్నాడు పైడితల్లి కళ్ళు తుడుచుకుంటూ.

"వీడిని లాకప్‌లో పడెయ్యండి" అన్నాడు సి.ఐ. లేచి నిల్చుని.

"సార్! అన్యాయం సార్! నాకే పాపం తెలియదు సార్!" పైడితల్లి గోల పెడుతుంటే కానిస్టేబుల్స్ లాక్కెళ్ళి లాకప్‌లో పడేసి తాళం పెట్టారు.

"కేసు కొంచెం క్లియరయినట్లు కనిపిస్తోంది గోపాల్. వీళ్ళ కంపెనీలో ఏదో వుద్యోగాల గొడవ అనుకుంటాను. ఎవరో వుద్యోగం రాలేదని కసితో అతన్ని మర్డరు చేసినట్లుంది. వాళ్ళెవరో విజయవాడ నుంచి వచ్చివుండాలి. అతను రాజేశ్వరి అన్న ఏమో? తెలుసుకోవాలి. నేను మూర్తిని కలుసుకుని వస్తాను" అన్నాడు జయకృష్ణ.

తల వూపాడు గోపాల్.

జయకృష్ణని చూస్తూనే "రండి....రండి...." అని ఆహ్వానించాడు.

"కేసుకి క్లూ దొరికింది."

"చెప్పండి."

"ఈ మధ్య మీ కంపెనీలో ఏవైనా వుద్యోగాలకి ఇంటర్వ్యూలు జరిగాయా?"

"వూఁ. జరిగాయి. ఎక్కౌంటెంట్స్, టెక్నీషియన్స్ వగైరా దాదాపు పాతిక వేకెన్సీలు ఫిలప్ చెయ్యాలని పేపర్‌లో అడ్వర్‌టైజ్ చేశాం. ఇంటర్వ్యూలు జరిగాయి కూడా. అప్పాయింట్‌మెంట్స్ పంపలేదు ఇంకా. ఈ

లోపల ఈ దారుణం జరిగింది" అన్నాడు మూర్తి.

"విజయవాడ నుంచి వచ్చిన కాండిడేట్స్ లిస్ట్ తియ్యండి" అన్నాడు జయకృష్ణ.

మూర్తి బజర్ నొక్కి బాయ్ రాగానే "ఏ.యమ్‌ని పిలువు" అన్నాడు.

అసిస్టెంట్ మేనేజర్ వస్తూనే ఇద్దరికీ విష్ చేశాడు.

"వేకన్సీలు ఫిలప్ చెయ్యడానికి అప్లికేషన్స్ కాల్ ఫర్ చేశాంగదా! ఆ ఫైల్ తీసుకురండి" అన్నాడు మూర్తి.

అతను కాసేపటికి ఫైల్ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

మూర్తి తల వూపాడు అతన్ని వెళ్ళమన్నట్లుగా.

మూర్తి ఫైలు తిరగేసి "మొత్తం నలుగురు వున్నారు సార్!" అన్నాడు.

"కథంతా ఈ నలుగురిలోనే వుంది," అన్నాడు జయకృష్ణ.

"ఎలా?"

పైడితల్లి చెప్పినదంతా చెప్పాడు జయకృష్ణ.

అంతా విని "నాకు తెలియదు మావాడి వ్యవహారం. అయితే పైడితల్లి అన్నీ ఏరేంజ్ చేస్తుంటాడన్నమాట రాస్కెల్," అన్నాడు మూర్తి.

"వాళ్ళ అడ్రసులు నోట్ చేసి ఇవ్వండి. వీళ్ళలో ఎవరో ఒకరికి రాజేశ్వరి చెల్లెలు కావచ్చు. అది తేలితే మబ్బు విడిపోయినట్లు కేసు తేలిపోతుంది. హంతకుడు దొరికిపోతాడు." అన్నాడు జయకృష్ణ.

మూర్తి నలుగురి అడ్రసులు కాగితంపై నోట్ చేసి ఇచ్చాడు.

"విజయవాడ వెళ్ళిరావాల్సి వస్తుంది. తర్వాత కలుస్తాను." అని సెలవు తీసుకుని వచ్చేశాడు జయకృష్ణ.

# 9

రాజశేఖరానికి బేడీలువేసి నిల్చోబెట్టారు పోలీస్ స్టేషన్‌లో.

ఫింగర్ ప్రింట్స్ తియ్యడానికి స్టాంప్ పాడ్ తెస్తూ వుండగా అన్నాడు రాజశేఖర్. "ఎందుకూ ఆ ఫార్సంతా నేను ఒప్పుకుంటున్నాను గదా! వాడిని మర్డర్ చేసింది నేనే."

"చేసినవాడివి అప్పుడే ధైర్యంగా నిలబడివుంటే నీ చెల్లెలు చనిపోకుండా వుండేది గదా! అంత పిరికివాడివి మర్డర్ యెలా చేశావు?"

తన చెల్లెలు గుర్తుకు రాగానే రాజశేఖర్ ముఖం విషాదమైంది. వర్షం కురిసేముందున్న ఆకాశంలాగా నల్లబడింది ముఖం.

"నిజమే సార్! తప్పు చేశానేమోనని ఇప్పుడనిపిస్తోంది." అన్నాడు.

"అసలు యేం జరిగిందో చెప్పు?"

"ఏం చెప్పను సార్! జరిగిందంతా ఒక ట్రాజెడీ. నా జీవితమే ఒక ట్రాజెడీ," అన్నాడు రాజశేఖర్.

"చదువుకున్నవాడివి మర్డర్ చేశావంటే నమ్మలేకుండా వున్నాను. ఎంతో బలమైన కారణం వుంటే గాని ఒక మనిషిని మరొకమనిషి చంపలేడు. చెప్పు? ఏం జరిగింది?"

"ఇదంతా నా పొరపాటువల్లనే జరిగింది సార్!"

"నీ పొరపాటా?"

"అవును సార్. రేఖా ఎంటర్ ప్రైజెస్ వాళ్ళు ఎకాం

మెంట్ జాబ్ కి నన్ను ఇంటర్వ్యూకి పిలిచారు. ఇంట ర్వ్యూకి వెళ్ళాను. నలుగురు ఇంటర్వ్యూ చేశారు.

అందులో మేనేజింగ్ డైరెక్టర్ ని చూసి నేను ఆశ్చర్యపోయాను. ఎందుకంటే అతను విజయవాడ కాలేజీలో చదువుకున్నవాడే. నాకు జూనియర్. మా రాజేశ్వరిని అల్లరి పెట్టినందుకు చితుగా తన్నాను ఒకరోజు. నేనంటే వాడికి కోపం. ఎన్నో ఏళ్ళ తర్వాత మేనేజింగ్ డైరెక్టర్ హోదాలో అతను నా భవిష్యత్తు నిర్ణయించగల పొజిషన్ లో వున్నాడని అనుకునేసరికి నా మనస్సు చెడిపోయింది.

ఇంటర్వ్యూ సరిగా చేయలేకపోయాను. వాడు నా మీద కోపంతో ఆ జాబ్ నాకు రాకుండా చేస్తాడని వూహించాను. నిరాశతో విజయవాడ తిరిగి వెళ్ళిపోయాను. ఆ సంగతి రాజేశ్వరికి చెప్పాను. మామూలుగా మర్నాడు వేరే పనిమీద వైజాగ్ వెళ్ళాను. అక్కడొక ఫ్రెండ్ వుద్యోగానికి సహాయం చేస్తానన్నాడు. ఎంతో ఆశతో వెళ్ళాను.

నిజానికి యెంత చిన్న వుద్యోగమైనా అవసరం నాకు. మా నాన్న రిటైర్డు గుమస్తా. నూటఏభై వస్తుంది పెన్షన్. పైగా ఆయన జబ్బు మనిషి. నేను, అమ్మ, చెల్లెలు, తమ్ముడు ఇంతమంది ఆ పెన్షన్ మీదే ఆధారపడ్డామంటే పరిస్థితులు ఎంత దారుణంగా వుండి వుంటాయో మీరు వూహించుకోవచ్చు.

రెండు రోజుల తర్వాత నేను వైజాగ్ నుంచి వచ్చేసరికి రాజేశ్వరి ఇంట్లో లేదు. నాకు వుద్యోగం రావడానికి ప్రయత్నం చేస్తానని చెప్పి వెళ్ళినట్లు తెలిసి ఆశ్చర్యపోయాను. దరిద్రం భరించలేక రాజేశ్వరి సిగ్గు విడిచి

వాడిని ప్రాధేయపడటానికి వెళ్ళిందని తెలిసి నా కడుపు మండిపోయింది. తీరా అది వాడిని కలుసుకుంటే యేం జరుగుతుందో వూహించుకునేసరికి నా రక్తం వుడికి పోయింది. వాడు....ఆ పశువు రాజేశ్వరి శీలాన్ని చెరుస్తాడు. నో....అలా జరగడానికి వీల్లేదు....దరిద్రంతో ఇంటిల్లపాదీ మాడిపోయినా సరే!

తక్షణం లాకీ పట్టుకుని వెళ్ళాను. చివరికి పైడితల్లి చెప్పాడు రాజేశ్వరి అనే అమ్మాయి మహారాణి హోటల్లో వుందనీ, రూమ్ నెంబర్ 116 అని. ఆవేశంతో వెళ్ళాను. అప్పటికి రాత్రి యెనిమిది కావొచ్చింది. నేను అనుకున్నట్టే వుంది ఆ రూమ్‌లో పరిస్థితి.

నాకు గతమంతా గుర్తుకొచ్చింది. రాజేశ్వరి నన్ను చూసి కొయ్యబారిపోయింది. వాడు త్రాగిన మైకంలో బూతులు తిట్టాడు. రూమ్ తలుపులు మూసి వాడిని మర్డర్ చేసి వచ్చేశాను. వాడితోపాటే నా చెల్లెల్ని గూడా చంపాలనుకున్నాను కాని చంపలేకపోయాను. కాని చచ్చిపోయిందని భావించి వచ్చేశాను."

"కాని నువ్వు చేసిన పొరపాటు యేమిటో నీకు తెలిసిందా?"

"తర్వాత తెలిసింది సార్. ఆ మేనేజింగ్ డైరెక్టర్ పేరు కుమారస్వామి అనీ, నా శత్రువు అతని తమ్ముడు సుధాకర్ అనీ తర్వాత అంతా ఐపోయాక తెలిసింది సార్!" విచారంగా అన్నాడు రాజశేఖర్.

—ఐపోయింది—

# మరణ శిక్ష

## వసుంధర

"నా పేరు రాజారావండి!" అన్నాడా యువకుడు.

"నాతో ఏం పని నీకు!" అన్నాడు రామభద్రయ్య.

"ఒక్క పది నిముషాలు మీతో మాట్లాడాలండి-" అన్నాడు రాజారావు.

"మాట్లాడు___"

రాజారావు అనుమానంగా కాస్త అటూ ఇటూచూసి "విషయం కాస్త రహస్యమైంది. ఇక్కడే మాట్లాడవచ్చు నంటారా?" అన్నాడు.

రామభద్రయ్య ముఖంలో కాస్త కుతూహలం కనబడింది___"నాతో రహస్యమా___చాలా ఆశ్చర్యంగా వుందే___ఏమిటో త్వరగా చెప్పు__" అన్నాడు.

"ఇక్కడే చెప్పొచ్చు ఫరవాలేదంటే చెప్పేస్తానండి...." అన్నాడు రాజారావు కాస్త వినయంగా.

"ఫరవాలేదు__చెప్పు...." అన్నాడు రామభద్రయ్య.

"నాకో పదివేలు కావాలి!" అన్నాడు రాజారావు.

"పదివేలా—ఎందుకు?" అన్నాడు రామభద్రయ్య.

"జీవితంలో చివరి ఘడియలు సమీపించాయి నాకు. ఇప్పుడున్నలాంటి జీవితం బహుశా ఈ ఒక్క రోజులోనే ఆఖరు కావచ్చు. అందుకని ఈ ఒక్కరోజూ వీలైనంత సుఖంగా గడపాలనుకుంటున్నాను. అందుకు డబ్బు కావాలి. డబ్బు నా దగ్గర లేదు కదా—అందుకని మీ దగ్గరకు వచ్చాను. డబ్బంటే మీకు లెక్క లేదని తెలుసు. పదివేలుకాదు, పాతికవేలడిగినా మీరిస్తారని తెలుసు! కానీ నాకు అత్యాశ లేదు. ఒక్క రోజులో పాతిక వేలు ఖర్చు పెట్టగల సరదాలూ నాకు లేవు. పదివేలు చాలు" అన్నాడు రాజారావు.

"నీ కోరిక చిన్నదే కావచ్చు. అది తీర్చగల సామర్థ్యం నాకుండి వుండనూ వచ్చు. కానీ నేను నీకు డబ్బు యెందుకు ఇస్తాననుకున్నావ్?" అన్నాడు రామభద్రయ్య. ఆయన కంఠంలో కోపం లేదు. జవాబుకోసం ఎదురుచూస్తున్న ఆయన కళ్ళు రాజారావు ముఖ కవళికలను సునిశితంగా పరిశీలిస్తున్నాయి.

"నాకు మీరు తప్ప ఇంకెవ్వరూ లేరు కాబట్టి...." అన్నాడు రాజారావు.

"నువ్వెవరో నాకు తెలియదు...." అన్నాడు రామభద్రయ్య.

"మీకా ఇబ్బంది యేమీ అవసరం లేదు....అన్నీ నేను చెబుతాను...." అన్నాడు రాజారావు.

"చెప్పు—!"

"లలిత మీ అమ్మాయే కదూ!" అన్నాడు రాజారావు.

"ఎవ్వడిగే లలిత యెవరో నాకు తెలియదు కానీ లలిత పేరుగల కూతురు నా కుంది—"

రాజారావు చిన్నగా నవ్వి—"మిమ్మల్నొట్టే ఇబ్బంది పెట్టదల్చుకోలేదు. నే నెరిగున్న లలిత మీ అమ్మాయి ఒక్కతే! ఇంకా అనుమాననుంటే...." అంటూ జేబులోంచి రెండు కార్డు సైజు ఫోటోలు తీసి ఆయన ముందుంచాడు.

రామభద్రయ్య ఆ ఫోటోలు ఆత్రుతగా చూశాడు. ఆయన ముఖం పాలిపోయింది. ఆ ఫోటోల్లో లలిత, ఒక పురుషుడు శాస్త్రకారుడు చెప్పిన శృంగార రీతుల్లో ఉన్నారు.

"నువ్వు....నువ్వు....బ్లాక్ మెయిలర్ వా?" అన్నాడు రామభద్రయ్య.

"ఏమాత్రమూ కాను...." అన్నాడు రాజారావు తాపీగా—"నేను బ్లాక్ మెయిలర్ కానని కొద్దిసేపట్లోనే మీరు తెలుసుకుంటారు. ఈ ఫోటోలు మీకు చూపించాల్సినవి కాదు. కానీ తప్పనిసరి అయింది—"

"ఇప్పుడే నిన్ను పోలీసులకు పట్టిస్తాను...." అన్నాడు రామభద్రయ్య.

"అది మీ వల్ల గాదు. ఇంకో రెండు గంటల్లో నేను మీ ఇల్లు కదిలి రాకపోతే—నా మిత్రుడ్ని కలుసుకోక పోతే—ఈ ఫోటోలు ఊరంతా పంచిపెట్టబడతాయి-" అన్నాడు రాజారావు.

"ఇలాంటి ఏర్పాటేదో చేసుకునే వచ్చి ఉంటావని ఊహించాను. కానీ నేను నిన్ను నిర్బంధించి, ప్రాణాలు తీస్తానని బెదిరించి నీ స్నేహితుడి అచూకీ తెలుసుకో గలను—" అన్నాడు రామభద్రయ్య.

"ఈ రోజుతో జీవితం ముగిసిపోతున్నవాడ్ని. నన్ను మీ రేమీ చేయలేరు. నాకు చావంటే భయం లేదు...."

రామభద్రయ్య కూతురు ఫోటోలవంక బాధగాచూసి కళ్ళు మూసుకుని యేదో గొణుక్కున్నాడు.

"ఖజురాహో, కోణార్క శిల్పాలకంటె ఈ ఫోటోలు బాగున్నాయి—" అన్నాడు రాజారావు.

"వర్ణనలు తర్వాత. ముందు త్వరగా యిక్కడ్నించి వెళ్ళు. నువ్వెన్ని చెప్పినా ఈ ఒక్క రోజులో వదులావని నమ్మలేను. ఇప్పుడు నువ్వడిగింది పదివేలు. చాలా ఎక్కువ. రెండువేలిస్తాను ...." అన్నాడు రామభద్రయ్య.

"నేనడిగిన డబ్బు ఎంత తక్కువో మీరు తెలుసుకోవడానికెంతోసేపు పట్టదు—"

"చెప్పు—" అన్నాడు రామభద్రయ్య.

"ఇక్కడే చెప్పనా?" అన్నాడు రాజారావు మళ్ళీ.

రామభద్రయ్య క్షణకాలం తటపటాయించాడు. తను కూర్చున్న చోట్నించి లేచి-గుమ్మంవరకూ వెళ్ళి చూసి వచ్చి మళ్ళీ కూర్చుని-"ఫరవాలేదు-చెప్పు!" అన్నాడు. గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది ఆయన కంఠం.

"గోమతి మీ రెండో కూతురు కదూ?" అన్నాడు రాజారావు.

ఈ పర్యాయం రామభద్రయ్య కళ్ళలో భయం స్పష్టంగా కనబడింది. ఆయన భయాన్నధికం చేస్తూ రాజారావు జేబులో చెయ్యి పెట్టాడు. నెమ్మదిగా ఓ ఫోటో బయటకు లాగాడు.

ఈసారి ఎలాంటి దృశ్యం చూడాలోనని రామ భద్రయ్య భయపడుతున్నప్పటికీ ఆయన ఆ ఫోటోను చూశాడు. ఫోటోలో గోమతి వుంది. ఆమె చేతిలో కొద్దిగా తెరవబడ్డ బ్రీఫ్ కేసు ఉంది. బ్రీఫ్ కేసు నిండా బంగారు కణికలు వున్నాయి. గోమతికి ఎదురుగా వున్న ఒక వ్యక్తి ఆ బ్రీఫ్ కేసు వంకే చూస్తున్నాడు.

"ఈ ఫోటో నాకెందుకు చూపించావ్?" అన్నాడు రామభద్రయ్య.

"మీకు విక్టర్ తెలియదా?" అన్నాడు రాజారావు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ.

"వాడెవరు? ఎక్కడుంటాడు?"

"ఒకప్పుడైతే వాడెక్కడుంటాడో చెప్పడం కష్టమే- కానీ ఇప్పుడు చెప్పడం సులభమే!"

"ఎందువల్ల?" అన్నాడు రామభద్రయ్య.

"ప్రస్తుతం విక్టర్ జైల్లో ఉన్నాడు...." అన్నాడు రాజారావు.

"ఎందుకు....?"

"మీకు తెలియదంటే నేను నమ్మను. అయినా చెబుతున్నాను. వాడిమీద స్మగ్లింగ్ గురించి చాలా నేరాలున్నాయి. నెల్లాళ్ళ క్రితం పోలీసులకు రెడ్ హ్యాండెడ్ గా పట్టుబడ్డాడు...."

"వాడి సంగతి నాకిప్పుడెందుకు చెబుతున్నావ్?"

"తెలియదంటే నమ్మను. మీకు చూపిన ఫోటోలో వున్న మగ మనిషి విక్టర్ అన్న విషయం మీ కింకా తెలియలేదా?"

రామభద్రయ్య ఆశ్చర్యపోలేదు...."సో!"అన్నాడు.

"నేను పదివేలడిగాను. మీరు రెండువేలిస్తానన్నారు.

అందుకే ఈ ఫోటో చూపించాను...."

రామభద్రయ్య ఓసారి కణతలు నొక్కుకుని —"మూడువేలిస్తాను...." అన్నాడు.

"మీ దగ్గర్నుంచి పదివేలు తీసుకోవడానికి నేనింకా చాలా విశేషాలు చెప్పాల్సొచ్చేలా వుంది!" అన్నాడు రాజారావు కాస్త సీరియస్‌గానే.

"ఇంకా ఎన్ని విశేషాలున్నాయేమిటి నీ దగ్గర!" అన్నాడు రామభద్రయ్య. భయం ఆయన కంఠాన్ని విడిచిపెట్టలేదు.

"చాలా తెలుసు. ఇటీవల నీ కొడుకు కంట్రాక్టులో కట్టబడిన రైల్వే వంతెన కూలిపోతే అది పెద్ద గొడవగా మారకుండా ఉండడానికి ఎవరెవరికి ఎంతెంత లంచాలిచ్చారో ససాక్ష్యంగా నిరూపించగలను. నీ భార్య తాగుడుకు బానిస అన్న విషయం తెలుసు....ఇంకా...."

"ఆగు...." అన్నాడు రామభద్రయ్య కంగారుగా— "అసలెవరు నువ్వు? నా కుటుంబంమీద ఎందుకు పగబట్టావ్? నన్నెందుకిలా మాటలతో హింసిస్తున్నావ్!"

"నేనెవరినో తర్వాత చెబుతాను. కానీ నేను మిమ్మల్ని మాటలతో హింసించడంలేదు. నిమ్మకాయ రసం పుండుమీద పడితేనే మండుతుంది కానీ నాలికమీద వేసుకుంటే పుల్లగా బాగుంటుంది. నేను కొన్ని నిజాలు చెబుతుంటే పుండులాంటి మీ శరీరానికవి నిమ్మరసంలా పనిచేస్తున్నట్లున్నాయి" అన్నాడు రాజారావు.

"పదివేలూ ఇచ్చేస్తాను. మళ్ళీ నా జోలికి రావుకదూ" అన్నాడు రామభద్రయ్య.

"ముందు డబ్బు తీసుకురా. అది తీసుకున్నాక నీకో ముఖ్య విశేషం చెప్పాలి" అన్నాడు రాజారావు.

రామభద్రయ్య గదిలోంచి బయటకు వెళ్ళి రెండు నిముషాల్లోనే వెనక్కు వచ్చాడు.

ఒక వందరూపాయలకట్ట రాజారావు ముందు పడింది.

రాజారావు దాన్నందుకున్నాడు. ఓపికగా నోట్లు లెక్క పెట్టాడు. నంబర్లు వరుసగా, వేర్వేరుగా వున్నాయో లేదో చూసుకున్నాడు. ఆ కట్టను జేబులోకి తోసేసి—

"సో—ఇప్పుడు అసలు విషయం చెబుతున్నాను. నేను బ్లాక్ మెయిలర్ని కాను. అనగా డబ్బుకోసం మరోసారి నీ దగ్గరకు రాను. కానీ ఈ రాత్రి రెండుగంటలకు మరోసారి నీ దగ్గరకు వస్తాను" అన్నాడు.

"ఎందుకు!" అన్నాడు రామభద్రయ్య.

"ఎందుకేమిటి?—చంపడానికి!" అన్నాడు రాజారావు.

రామభద్రయ్యకు ముచ్చెమటలు పోశాయి. తేలికగా నవ్వేయాలని ప్రయత్నించాడు కానీ ఆయనకు నవ్వు రాలేదు. రాజారావు మాట్లాడే పద్ధతి బెదురుపుట్టించే విధంగా వుంది.

"నన్ను నువ్వు చంపుతావా?" అన్నాడు రామభద్రయ్య.

"అవును. కత్తితో గుండెల్లో పొడిచి చంపుతాను. ఈరోజు రాత్రి రెండు గంటలకు!" అన్నాడు రాజారావు. చాలా సామాన్యమైన విషయం చెప్పినట్లు అతను చాలా తాపీగా అన్నాడు.

"ఎందుకు నన్ను చంపడం?"

"ఎందుకన్నది నేను చెప్పను. అది నీ ఊహాకే వదిలి పెడుతున్నాను. ఎటొచ్చీ నేను చెప్పినట్లు వింటే నువ్వు చచ్చినా నీ పరువు పోదు. చెప్పినట్లు వినకపోతే చావు

నెలాగూ తప్పించుకోలేవు కానీ పరువు కూడా పోతుంది."

"అంటే?"

"నువ్వు నేనెవరో తెలుసుకునేందుకు ప్రయత్నించ కూడదు. ఈ హత్యనుంచి తప్పించుకుందుకు ప్రయత్నించ కూడదు. చావుకు సిద్ధపడి రాత్రి రెండు గంటలలోగా పూర్తి చేసుకోవలసిన రాచకార్యాలేమైనా వుంటే పూర్తి చేసుకో. దుష్టాలోచనలు కట్టిపెట్టు. సరిగ్గా రాత్రి పన్నెండు గంటలకు నేను నీకు ఫోన్ చేసి యెక్కడకు రావాలో చెబుతాను. నీనుంచి యెటువంటి ప్రతిఘటన వచ్చినా నేను సహించను. నీకు సంబంధించిన రహస్యా లన్నీ బయటపెట్టేస్తాను. అలా కాక బుద్ధిగా వున్నావా రెండు గంటలకి నువ్వు వస్తావ్—అంతకు మించిన అన్యాయం నీకేమీ జరగదు" అన్నాడు రాజారావు.

"ఎందుకు నన్ను చంపడం?....కావాలంటే ఇంకా యెక్కువ డబ్బు తీసుకో...." అన్నాడు రామభద్రయ్య.

"వద్దు....పదివేలు చాలు నాకు. నిన్ను చంపాలన్నది నా జీవితాశయం. అదీ మామూలుగా కాదు. నిన్ను నిస్సహాయుణ్ని చేసి చంపుతాను. నీ డబ్బు, నీ హోదా, నీ బంధు బలగం—యెవ్వరూ నిన్ను రక్షించలేరు. ఇన్నాళ్ళకు నా జీవితాశయం ఫలిస్తోంది" అన్నాడు రాజారావు.

"వద్దు....నన్ను చంపొద్దు....నీకేం కావాలంటే అది స్తాను...." అన్నాడు రామభద్రయ్య.

"నాక్కావలసింది నువ్వివ్వలేవు. అది నీవల్ల కాదు. నీకు చావు తప్పదు. నువ్వు చావుకి సిద్ధపడు...."

"నాకు చావాలని లేదు. నీలో ఏదో పెద్ద పగ ఉన్న ట్లుంది. అందుక్కారణం చెప్పు. నేను నా తప్పు దిద్దు కుంటాను. నువ్వు చెప్పినట్లు వింటాను...."

రాజారావు అదోలా నవ్వాడు....“నువ్వు బ్రతకాలంటే ఒకే ఒక్క ఉపాయముంది. ఏదో బలీయమైన కారణంవల్ల నేను నిన్ను రెండు గంటలకు కలుసుకోలేక పోతే మళ్ళీ యెప్పుడూ నిన్ను కలుసుకోను. నీ జోలికి రాను....”

రామభద్రయ్య కళ్ళలో ఏదో మెరుపు మెరిసింది.

“అలా ఆశపడకు. ఆ బలీయమైన కారణం నీచేత సృష్టించబడింది కాకూడదు. అందుకు నువ్వే ప్రయత్నం చేసినా జీవితాంతం నిన్ను వేటాడి నీకు మనశ్శాంతి లేకుండా చేస్తాను. నీకు సంబంధించినంతవరకూ దేవుడి మీద భారంవేసి ఊరుకో. నీ అదృష్టం బాగుంటే బ్రతుకుతావు. నేనీ డబ్బుతో జల్సా చేస్తాను. ఈ ఒక్క రాత్రితో నాకూ జీవితం అఖరేకదా మరి!” అన్నాడు రాజారావు.

“నువ్వు యువకుడివి. నిండా నూరేళ్ళ జీవితం ఉంది నీకు. ఎందుకు హత్యల ఆలోచనలతో నీ మనసునూ, జీవితాన్నీ పాడు చేసుకుంటావు. నామాట విను. నువ్వు కోరిన డబ్బిస్తాను. ఆ డబ్బుతో హాయిగా జీవించు. నీ పగకు కారణమేమిటో చెప్పు. ఒకోసారి అకారణంగా అయిన వాళ్ళను అపార్ధం చేసుకుని పగ పెంచుకోవడం జరుగుతుంది. నాకు అన్నీ కాస్త వివరంగా చెప్పు” అన్నాడు రామభద్రయ్య. ఆయన కంఠంలో ఎంతో ఆదుర్దా వుంది.

“మిస్టర్ రామభద్రయ్యా! నాది తిరుగులేని నిర్ణయం. నీ సలహాలు నేను ఈ చెవిలో విని ఆ చెవిలోంచి వదిలేశాను. ఈ రోజు రాత్రి రెండు గంటలకు నీ చావు ఖాయం. నా కంఠంలో ప్రాణముండగా నిన్ను వదిలిపెట్టను” అని రాజారావు అక్కడ ఒక్క క్షణంకూడా ఆగకుండా లేచి వెళ్ళిపోయాడు.

# 2

రాజారావు వెళ్ళిపోయిన గంటవరకూ రామభద్రయ్య గదిలోంచి కదలలేదు. అలాగే కుర్చీలో కూర్చుని ఏవేవో ఆలోచిస్తున్నాడు.

తనిరుక్కున్నది చాలా విచిత్రమైన పరిస్థితి!

ఈ రాత్రి రెండు గంటలకు తను హత్య చేయబడతాడు. హంతకుడెవరో తెలుసు. ఎలా చంపుతాడో తెలుసు. కానీ ప్రతిఘటించడు తను. హంతకుడుగారూ, నన్ను చంపండి అంటూ తనే హంతకుడికి యెదురు వెడతాడు. హంతకుడు తనను చంపేస్తాడు.

తను పోలీసులకీ విషయం చెప్పుకోలేదు. పోలీసులకే కాదు, ఎవరికీ చెప్పుకోలేదు.

ఒక విధంగా చెప్పాలంటే ఆ రాజారావెవరో కానీ తనకు ఉరిశిక్ష విధించాడు. పరువు, ప్రతిష్ఠలకు ఖైదీగా వున్న తను ఈ ఉరిశిక్షనుంచి తప్పించుకుపోయే ప్రయత్నం చేయలేదు.

రాజారావు సూచనలను తూచా తప్పకుండా పాటించాలన్న నిర్ణయానికి వచ్చేక రామభద్రయ్య గదిలోంచి లేచాడు. భార్యను పలకరించాలని అనుకున్నాడాయన.

ఆయన వెళ్ళేసరికి భార్య రమాదేవి ఇంకా నిద్ర లేవలేదు. ఆమె గాఢనిద్రలో ఉంది. వంటిమీద బట్టలు అస్తవ్యస్తంగా వున్నాయి.

రామభద్రయ్య ఆమెను సమీపించి వంటిమీద బట్టలు సరిచేశాడు. ఆమెకింకా మెలకువ రాలేదు.

"రాత్రి బాగా తాగి ఉంటుంది" అనుకున్నాడు రామభద్రయ్య. ఆయన ముఖం ముడతలుపడింది. భార్య ముఖంవంకే పరీక్షగా చూశాడాయన.

వృద్ధాప్యం ఛాయలు కనబడుతున్నప్పటికీ ఆ ముఖం ఇంకా అందంగానే ఉంది. నిద్రలో ఆమె ముఖం ఎంతో అమాయకంగా ఉంది.

"నా కారణంగానే కదా—రమాదేవి తాగుడుకు బానిసయింది—" అనుకున్నాడు రామభద్రయ్య.

అది ఈనాటి మాటకాదు. ఇరవై ఏళ్ళనాటి మాట. అప్పటికి రామభద్రయ్య ఇంకా గొప్పవాడు కాలేదు.

రామభద్రయ్య ఇంటికి ఓ మనిషి వచ్చాడు. అతడి చేతిలో ఓ బ్రీఫ్ కేసు ఉంది. అందులో రొక్కం పది లక్షల రూపాయలుంది. ఆ మనిషి రామభద్రయ్య బంధువుల స్నేహితుడు. ఏదో పనిమీద ఆ ఊరుకువచ్చి రామభద్రయ్య ఇంట్లో మకాం పెట్టాడు.

రామభద్రయ్య దృష్టి ఆ డబ్బుమీద పడింది. ఎలాగో అలా ఆ డబ్బు స్వంతం చేసుకోవాలనుకున్నాడు. అందుకు ఓ పథకం వేశాడు.

రామభద్రయ్యకు ఓ పోలీసినస్పెక్టర్ స్నేహితుడు. ఒకరోజు అతన్ని తన ఇంటికి ఏదో మిషమీద పిలిచాడు. పదిలక్షల మనిషికి పోలీసుల పొడ గిట్టదు. అందువల్ల అతడు తన కాకలివేస్తున్నదని లోపలకు వెళ్ళాడు.

అప్పటికి రామభద్రయ్య అన్నంలో విషం కలిపి ఉంచాడు. ఆ విషయం రమాదేవికి తెలియదు. ఒక్క పది లక్షల మనిషికి తప్ప ఇంట్లో మరెవ్వరికీ ఆ అన్నం తనకు చెప్పకుండా పెట్టవద్దని రామభద్రయ్య భార్యకు చెప్పాడు. ఆ అన్నంలో విషముందని తెలిస్తే చేజేతులా భార్య అది అతనికి పెట్టడానికి భయపడుతుందని ఆయన అలా చెప్పాడు. మరెవరికీ అన్నం పెట్టకూడదన్న విషయంలో ఆయన భార్యచేత ఒట్టుకుడా వేయించు

కున్నాడు.

అయితే ఊహించని పరిణామం జరిగింది — రామభద్రయ్య రెండో కొడుకు నాలుగేళ్ళవాడు అన్నం పెట్టమని మారాం చేశాడు. వాడికి పెడితేగానీ తను తిననని అతిథి మొరాయించాడు. ఫలితంగా రమాదేవి భర్త ఆమోదం పొందకుండానే పిల్లవాడికీ, అతిథికీ భోజనాలు పెట్టింది.

ఇద్దరూ భోజనం చేస్తూండగానే చచ్చిపోయారు.

ఇంట్లో పోలీసినస్పెక్టరున్నాడు. మనిషి చచ్చిపోయాడు. కాబట్టి దీన్ని హత్యగా ఎవరూ జమ చేయలేదు. ఇంకో విశేషమేమిటంటే ఆ మనిషి దగ్గర అంత డబ్బున్నదని యెవ్వరికీ తెలీదు.

చూస్తూ చూస్తూ యెవరూ కన్నకొడుకును చంపుకోరు కాబట్టి అన్నంలో విషం అనుకోకుండా కలసిందనే అంతా భావించారు. ఏ కారణం లేకుండా యెవ్వరూ ఓ అపరిచితుణ్ని చంపాలనుకోరు.

హత్యాప్రయత్నంలో రామభద్రయ్య తన కన్న కొడుకును కూడా చంపుకున్నాడు. కానీ అది ఆయన నిర్దోషత్వాన్ని మరింత బలపరిచింది.

అసలు విషయం ఆ రాత్రే రామభద్రయ్య భార్యకు చెప్పేశాడు. ఆమె అది విని పెద్ద షాక్ తింది. కన్నబిడ్డను చేతులారా చంపుకున్నందుకు కుమిలిపోయింది.

పదిలక్షల ఆస్తి ముందు — కొడుకు పోవడం రామభద్రయ్యకంత బాధనిపించలేదు. అప్పటికాయనకు నలుగురు పిల్లలు. ఇద్దరబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు. ఇప్పుడు రెండో అబ్బాయి చనిపోయాడు.

"పిల్లలేముంది? కావాలంటే మళ్ళీ పుడతారు. ఇంత

ఆస్తి మళ్ళీ సంపాదించలేము. బ్రతికున్నవాళ్ళు సుఖంగా జీవిస్తారు" అన్నాడు రామభద్రయ్య భార్యను ఓదారుస్తూ.

"నాకలా అనిపించడం లేదండీ-డబ్బుకోసం ఓ మనిషి ప్రాణాలు తీయాలనుకుంటే అది మన బిడ్డనుకూడా కొట్టింది. అంటే దుర్మార్గం మనకు అచ్చిరాదు. ఈ డబ్బు మనల్ని సుఖపడనివ్వదు. అనవసరంగా మీరు తొందర పడ్డారు" అంది రమాదేవి. కడుపుశోకం ఆమెకు మతి పోగొడుతోంది.

రమాదేవి ఇంచుమించు పిచ్చిదానిలాగై పోయింది. "నా బిడ్డ—నా బిడ్డ—" అంటూ ఓ రాత్రివేళ లేచేది. మెలకువగా ఉన్నప్పుడల్లా ఏ పనీ చేయకుండా ఓమూలకు పోయి ఏడుస్తూ కూర్చునేది. ఒకోసారి — "దెయ్యం దెయ్యం—నా కుటుంబం మీద పగబట్టింది"అంటూ పెద్ద కేకలు వేసేది.

రామభద్రయ్యకు భార్య అంటే ఇష్టం. ఆమె ఈ స్థోరణి అతడికి బాధనిపించింది. కష్టాలనుంచి మరిపించడం కోసం అతడే ఒకరోజున ఆమెచేత బ్రాందీ తాగించాడు బలవంతంగా. అది బ్రాందీ అని తెలియక రమాదేవి అది తాగింది. తాగేక నిజంగానే ఆమెకు ప్రాణం హాయిగా ఉంది. కష్టాలామెకిప్పుడు గుర్తులేవు. గుర్తున్నా పట్టించు కునే స్థితిలో లేదు.

మర్నాడామె భర్తను—"నిన్నటి మందు బాగా పని చేసిందండీ" అంది.

అలా కొద్దిరోజులు మందు పేరుతో బ్రాందీ పుచ్చు కుందామె.

ఆమె బ్రాందీకి అలవాటు పడిపోతోందని గ్రహించి

కంగారుపడి రామభద్రయ్య ఆ దేమిటో ఆమెకు చెప్పే శాడు. అది మందుకాదనీ — బ్రాందీ అనీ తెలిసికూడా రమాదేవి దాన్ని వదిలిపెట్టలేకపోయింది.

క్రమంగా రామభద్రయ్య ఆర్థిక పరిస్థితి మెరుగైంది. ఒక్కసారిగా కాక తన డబ్బును క్రమంగా బయటకు తీశాడు రామభద్రయ్య. ఆయన ఆ డబ్బుతో కంట్రాక్టులు ప్రారంభించి కోటికి పడగలెత్తసాగాడు.

ఇంట్లో రమాదేవి తాగుడుకు బానిస అయింది. రామభద్రయ్యకు వ్యాపార వ్యవహారాలలో క్షణం తీరికలేదు. పిల్లలకు సరైన అదుపులేకుండా పోయింది. దాంతో ఒక్కరికీ మంచిబుద్ధులు అలవడలేదు. ఆ విషయంలో రామభద్రయ్య పూర్తిగా విస్మృహోయుడయ్యాడు. అయితే ఆయన పిల్లల ప్రవర్తన అరికట్టడానికీ, అదుపులో పెట్టడానికీ పెద్ద ప్రయత్నాలేమీ చేయలేదు. తన బిడ్డలకు డబ్బుకు లోటులేదు కాబట్టి వారి జీవితంలో ఏ లోటూ ఉండదని ఆయన నమ్మాడు....

రామభద్రయ్య భార్య తల నిమురుతూ ఆలోచిస్తున్నాడు. ఒకణ్ణి చంపి ఇంతవాడయ్యాడతను. ఫలితంగా తన కొడుకు చచ్చిపోయాడు. తన కూతుర్ని ఏ తండ్రీ చూడాలనుకోని విధంగా ఫొటోలో చూడాల్సివచ్చింది. మరో కూతురు నేరస్థులతో చేతులు కలుపుతోంది. బ్రతికున్న కొడుకు డబ్బుకోసం తొక్కని అక్రమ మార్గమంటూ లేదు.

తను ఒకే ఒక హత్య చేశాడు. ఆ తర్వాత కంట్రాక్టుల్లో అన్యాయంగానే డబ్బు సంపాదించినా తన ప్రవర్తనకు కొన్ని పరిమితులేర్పరచుకున్నాడు. ఎవరిచేతా వేలెత్తి చూపించుకో నవసరంలేని విధంగా మసలు

కున్నాడు.

కానీ తన సంతానం అలా కాదు. వాళ్ళు చెడు స్నేహాలు పట్టి అనుభవం లేకుండానే తప్పుడు పనులకు పూనుకుంటున్నారు. వాళ్ళు ఎప్పుడు ఏ ఇబ్బందుల్లో ఇరుక్కుంటారో నని తనకు బెంగగా ఉంటుంది.

"ఏమిటండీ ఆలోచిస్తున్నారు?" అంది రమాదేవి.

"మెలకువ వచ్చిందా?"—అన్నాడు రామభద్రయ్య.

రమాదేవి తలాడించింది.

"రమా! నువ్వింకా యెంతకాలం ఇలా అన్ని బాధ్యతలనూ తప్పించుకు తిరుగుతావు?" అన్నాడు రామభద్రయ్య బాధగా.

"అన్నీ చూసుకుందుకు మీరున్నారు. నాకేం లోటండీ?" అంది రమాదేవి.

"అలా అనకు. నా ఆరోగ్యం బాగుండడం లేదు. రాత్రి నాకు గుండెల్లో నొప్పి వచ్చింది. ప్రాణం పోతుందేమో అనిపించింది. అలాంటి నొప్పి ఇంకోసారి వస్తే ఈ రాత్రే నేను చచ్చిపోవచ్చు" అన్నాడు రామభద్రయ్య.

చటుక్కున లేచి అతడి నోరు మూసింది రమాదేవి.

"నా నోరు మూసి లాభం లేదు రమా! నాకు జీవితేచ్ఛ నశించింది. ఇంక ఈ సంసారాన్ని నువ్వే చూసుకోవాలి. చూసుకోకపోతే మన సంసారం వీధిన పడిపోతుంది...."

"నేనేం చేయను చెప్పండి" అంది రమాదేవి.

"గృహిణిగా నీ బాధ్యతలు నిర్వర్తించు. అంతే నేను కోరేది" అన్నాడు రామభద్రయ్య.

రమాదేవి నిట్టూర్చి—"ఒక మంచి కోరికను చాలా ఆలస్యంగా నా నుంచి కోరుతున్నారు" అంది.

"రమా! నీకు తాగుడు అలవాటు చేసింది నేను. ఆ

అలవాటు అవసరపడ్డానికి కారణం నేను. అయితే ఈ రోజుల్లో యెందరో తాగుతున్నారు. విదేశాల్లో ఆడా, మగా ప్రతిరోజూ తాగుతూనే వుంటారు. తాగుతున్నాను కదా అని నువ్వో మూల కూర్చుని జీవితమంతా గడిపెయ్యక్కర్లేదు. నీకు గర్భశోకం కలిగింది. నీ చేతి విషం తిని నీ కొడుకు మరణించాడు. ఆ దుఃఖం మరిచిపోవడానికి నువ్వు చేస్తున్నదేమిటి? మన పిల్లలు బ్రతికుండీ చచ్చిన వాళ్ళతో సమానమయ్యారు..” అన్నాడు రామభద్రయ్య.

“ఏమిటండీ మీ రేదో కొత్తగా మాట్లాడుతున్నారీ రోజున..” అంది రమాదేవి.

“ఈ ఫోటోలు చూడు....” అంటూ రామభద్రయ్య భార్యకు ఫోటోలందించి వాటి గురించిన వివరాలు చెప్పాడు.

రమాదేవి మత్తంతా ఒక్కసారిగా దిగిపోయింది. అప్రయత్నంగా “ఛీ ఛీ” అందామె.

“నువ్వన్న ఛీత్కారం మన పిల్లలకు వెళ్ళదు. పెంపకానికి వెడుతుంది. నువ్వుగానీ నేనుగానీ వాళ్ళనేనాడైనా పట్టించుకున్నామా? వాళ్ళ మార్గం సరిగ్గా లేదని నాకు తెలుసు. కానీ మరీ ఇంతలా చెడిపోయారని ఈ రోజే నాకు తెలిసింది....” అన్నాడు రామభద్రయ్య. ఆయన గొంతులో తడి ధ్వనించింది.

“ఏమిటండీ ఇదంతా? ఇన్నాళ్ళూ మీరు నాకెందుకు చెప్పలేదు!” అంది రమాదేవి.

“చెప్పకపోవడం నా తప్పు. తెలుసుకోవాలని యత్నించకపోవడం నీ తప్పు. ఇప్పటికైనా నువ్వు పిల్లల విషయంలో కలగజేసుకోలేకపోతే — వాళ్ళక్కూడా

మరికాస్త విసాన్నం పెట్టించం షేసేయ్. ఆ దుఃఖం మరిచి పోవడానికి నువ్వు ఇంకా స్త తాగుడు డోసు పెంచుకువు గాని....” అన్నాడు రామభద్రయ్య.

భర్త మాటలకు రమాదేవికి కలిగిన బాధ వర్ణనాతీతం!

రమాదేవి తాగుతుందన్న విషయం ఇంట్లో పిల్లల కూడా తెలియదు. అనారోగ్య కారణంగా ఆమె తన గది విడిచి రాదని వాళ్ళనుకుంటూ వుంటారు. రోజూ ఉదయం కాసేపు ఆమె వారితో మాట్లాడుతుంది. అంతే!

రమాదేవి గదిలో వుండే సీసాలన్నీ రకరకాల మందు సీసాలు. ఆ సీసాల్లో వుండేది మాత్రం బ్రాందీ.

తను ఇంత రహస్యంగా కాపాడుకుంటూ వస్తూన్న విషయం ఆ రాజారావుకెలా తెలిసిందో రామభద్ర య్యకు ఆశ్చర్యంగానే వుంది. కానీ రాజారావు కారణం గానే ఆయనకు తన కుటుంబ పరిస్థితి యెంత ఘోరంగా వున్నదో తెలిసింది. ఒకవిధంగా చెప్పాలంటే రాజారా వాయనకు మహోపకారం చేశాడు.

“ముందొకసారి లలితనిలా పిలవండి....” అంది రమా దేవి.

రామభద్రయ్య అక్కణ్నించి కదిలి లలిత గదికి వెళ్ళాడు.

లలిత అప్పుడే మేకప్ అవుతోంది. ఎక్కడికో వెళ్ళ డానికి సిద్ధంగా ఉందామె!

“లలితా నిన్ను అమ్మ పిలుస్తోంది....” అన్నాడు రామభద్రయ్య.

“ఎందుకు?” అంది లలిత ఆశ్చర్యంగా.

“నాకు తెలియదు....” అన్నాడు రామభద్రయ్య.

ఇద్దరూ రమాదేవి దగ్గరకు వెళ్ళారు. రమాదేవి లలితను

దగ్గరగా రమ్మనమని పిలిచి ఫోటో ఆమె చేతిలో పెట్టి- "దీని గురించి ఏం చెబుతావో చెప్పు!" అంది.

లలిత ఆ ఫోటోను చూసి షాక్ తింది. ఒక్క నిముషం ఆమెకు నోట మాట రాలేదు.

రామభద్రయ్య, రమాదేవి మౌనంగా ఆమె వంకనే చూస్తున్నారు.

కొంతసేపు మౌనంగా వున్నాక-నోరు విప్పాల్సిన బాధ్యత తనదేనని లలిత గ్రహించింది. ఆమె నెమ్మదిగా "నేను అతన్ని ప్రేమిస్తున్నాను...." అంది.

"ప్రేమిస్తే ఇంట్లో ఎందుకు చెప్పలేదు?"

"ఎవరికి చెప్పాలో తెలియలేదు...." అంది లలిత తడుముకోకుండా.

రమాదేవి, రామభద్రయ్యకూడా దెబ్బ తిన్నారు.... అవును....లలిత తన ప్రేమ గురించి ఎవరికి చెప్పుకుంటుంది! తల్లి ఆమెతో మాట్లాడదు. తండ్రికి మాట్లాడే తీరికలేదు. అడిగిన డబ్బివ్వడానికి ఏర్పాట్లున్నాయి.

"పెళ్ళి కాకుండా మొగవాళ్ళదగ్గర చనువుగా వుండకూడదని తెలియదా?" అంది రమాదేవి.

అప్రయత్నంగా రామభద్రయ్య కళ్ళముందు ఫోటోలోని కూతురు మెదిలింది. ఆమె వయసు ఇరవైమూడేళ్ళు. ఇంతవరకూ తనామె పెళ్ళి గురించి మంచి ప్రయత్నాలేమీ చేయలేదు. ఆ మాటకొస్తే రెండో కూతురు గోమతికి ఇరవై నిండాయి. పదహారేళ్ళకే ఎందరిళ్ళలోనో ఆడపిల్లల పెళ్ళిళ్ళు జరిగిపోతున్నాయి.

"తెలుసు...." అంది లలిత.

నెమ్మదిగా లలిత విషయం వివరించింది. ఫోటోలో అబ్బాయి చాలా మంచివాడు. అతని పేరు గోపాల్.

అతను యేదో కాలేజీలో లెక్చరర్‌గా పని చేస్తున్నాడు. ఇటీవల వారిద్దరకూ అనుకోని ఏకాంతం లభించు తాత్కాలికావేశంలో తప్పు చేశారు. ఈ ఫోటోలు తీసే ఏర్పాటు అతను చేసివుంటాడని ఆమె భావించడంలేదు.

"నువ్వు ఇంట్లోనే వుండు. ఆ గోపాల్‌ని కబురుపెట్టి రప్పిస్తాను. అతనికిష్టమైతే మీ ఇద్దరికీ పెళ్ళి జరిపిస్తాను" అన్నాడు రామభద్రయ్య.

తర్వాత లలితను వెళ్ళమని గోమతిని పిలిచారా దంపతులు.

గోమతికి చాలామంది బాయ్‌ఫ్రెండ్సున్నారు. వారిలో విక్టర్ ఒకడు. విక్టర్ స్మగ్లర్ అని ఆమెకు తెలియదు. తెలియక అతడికి కొన్ని వ్యవహారాల్లో సహకరించింది.

"నువ్వుకూడా ఎవర్నైనా ప్రేమిస్తున్నావా?" అన్నాడు రామభద్రయ్య.

ఆమె బాబూరావు అనే అతడి పేరు చెప్పింది. రామభద్రయ్య బాబూరావింటికి కబురంపించి—కొడుకుని పిలిచాడు.

రామభద్రయ్య కొడుకు మోహన్‌కు ఇరవైయేడేళ్ళు. మొదటిసారిగా తల్లి, తండ్రి కలిసి తనను గదిలోకి పిలిచినందుకు ఆశ్చర్యపడుతూ వచ్చాడతను.

రామభద్రయ్య అన్ని వ్యాపార వ్యవహారాలను గురించి అడిగాడు. మోహన్ చెప్పింది విన్నాక "నా ఆరోగ్యం నానాటికీ క్షీణిస్తోంది. ఇంతవరకూ నేను సంపాదించింది చాలు. ఇంక నువ్వు వ్యాపారం చేయక్కర్లేదు. కంట్రాక్టులగురించి ఆలోచించక్కర్లేదు. ఉన్న ఆస్తిని తీరువుగా ఖర్చుచేస్తూ ఇంట్లో అందరి అవసరాలూ చూస్తుండు. ఈ రోజునుంచి ఈ ఇంటికి, ఈ ఆస్తికి నువ్వే పెత్తందారువి.

నువ్వుకూడా ఎవర్నైనా ప్రేమించివుంటే చెప్పు.... వెంటనే పెళ్ళి జరిపించేస్తాను...." అన్నాడు రామభద్రయ్య.

మోహన్ గౌరి అనే పేదవాళ్ళపిల్లను ప్రేమించాడు.

రామభద్రయ్య ఎక్కువ వివరాలు వినే స్థితిలో లేడు- "నీకు నచ్చితే చాలు. కోతయినా ఫరవాలేదు. నీ పెళ్ళి జరిపించేస్తాను...." అన్నాడాయన.

## 3

ఏ ఆర్భాటమూ లేకుండా రామభద్రయ్య పిల్లల మూడు పెళ్ళిళ్ళూ రిజిస్ట్రారాఫీసులో ఆ రోజు జరిగి పోయాయి. కూతుళ్ళిద్దరికీ రెండేసి లక్షల రూపాయలు ఇచ్చాడు రామభద్రయ్య. ఈ పెళ్ళిళ్ళ గురించి వూరంతా ఆశ్చర్యంగా చెప్పుకున్నారు.

తను అన్ని రకాల కంట్రాక్టు వ్యాపారాలనుండీ విరమించుకుంటున్నాననీ, తన కొడుకు అందుకు అవసరమైన ఫార్మాలిటీస్ అన్నీ చూస్తాడనీ రామభద్రయ్య ఓ ప్రకటన కూడా చేశాడు.

ఆ సాయంత్రం రామభద్రయ్య ఇంట్లో పెద్ద విందు జరిగింది. ఎందరో పెద్దలు ఆ విందును పురస్కరించుకుని రామభద్రయ్యతో మాట్లాడాలని ప్రయత్నించారు. అయితే ఆయన యెవ్వరికీ ఆ అవకాశం యివ్వకుండా తప్పించుకు తిరిగాడు.

విందు తొమ్మిది గంటలకు ముగిసింది.

రాత్రి పదయ్యేసరికల్లా ఆ ఇంట్లో నిశ్శబ్దం వెలసింది.

మూడు గదుల్లోని మూడు జంటలకూ ఆరోజు రామభద్రయ్య గదిలో రమాదేవి కూడా ఆయనకు జంటగా

వుంది.

"చాలా విచిత్రమైన రోజిది!" అంది రమాదేవి.

"ఇంతవరకూ గుక్కెడుకూడా పుచ్చుకోలేదు నువ్వు" అంటూ గుర్తు చేశాడు రామభద్రయ్య.

"పుచ్చుకుంటాను కానీ.... పిల్లల పెళ్ళిళ్ళు యిలా క్షణాలమీద జరిపించేశారు. ఏమయింది మీకు?" అనడిగింది రామాదేవి.

"వాళ్ళందరికీ వయసులు మించిపోతున్నాయి. ఎంత సంపాదించినా తనివితీరడంలేదు నాకు. ఓ పిల్లాడు పోయాడని మిగతా వాళ్ళందరి జీవితాలూ బుగ్గిపాలు చేస్తున్నావు నువ్వు. మనకు పిల్లలై పుట్టినందుకు వాళ్ళు ముగ్గురికీ అన్నీ వుండీ అస్తవ్యస్థ జీవితం అయిపోయింది. వాళ్ళందరికీ ఇప్పుడు బాధ్యతలేర్పడ్డాయి. అమ్మాయిల బాధ్యత అల్లుళ్ళు వహిస్తారు. అబ్బాయిని కోడలు అదుపులో వుంచుతుంది...."

"కాని మీరు వ్యాపారం కూడా మానేస్తానన్నారు."

"అవును మరి.... చావుకు సిధ్ధపడుతున్నాను...." అన్నాడు రామభద్రయ్య.

"అవేం మాటలండీ?" అంది రమాదేవి.

"ఇందులో నీకు బాధేముంది? నేను చచ్చిపోతే కాస్త డోసు పెంచి ఆ బాధ మర్చిపోగలవు నువ్వు!" అన్నాడు రామభద్రయ్య.

"ఈరోజు మీరు నన్ను మాటలతో హింసిస్తున్నారు"

"నిమ్మరసం పుండుమీద పడితేనే మండుతుంది. నాలికమీద వేసుకుంటే పుల్లగా రుచిగా వుంటుంది. నేను చెప్పిన నిజం నిమ్మరసంలా పని చేస్తోంది పుండులాంటి నీ శరీరంమీద...." అన్నాడు రామభద్రయ్య విరాగిలా.

రమాదేవి భర్తవంక అదోలా చూసి—"ఈ రోజు నుంచి నేను తాగను...." అంది.

"నా మీద ఒట్టేయ్...."

ఒక్కక్షణం తటపటాయించి— "ఒట్టే!" అంది రమాదేవి.

"ఒకవేళ నేను ఈ రాత్రే చచ్చిపోయాననుకో— అప్పుడీ ఒట్టుకు విలువుంటుందా?"

రమాదేవి కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి— "ఎందుకండీ ఇలా మాట్లాడతారు! నేను తాగుడుకు అలవాటు పడ్డ మాట నిజం. కానీ ఆ ప్రభావం పిల్లలమీద పడకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాను. ఏ ఒక్క రోజైనా మీరు తాగవద్దని నిర్బంధించివుంటే నాకీ గతి పట్టివుండేది కాదు. మీ ప్రోత్సాహంమీద నే నాకిది అలవాటైంది. నా ఈ అలవాటు పోగొట్టడానికి మీ రెన్నడూ ప్రయత్నించలేదు. ఇన్నాళ్ళకు పూనుకున్నారు. ఇక వై యేళ్ళ ఈ అలవాటు పోగొట్టుకోడానికి నా శాయ శక్తులా ప్రయత్నిస్తాను...."

"ప్రయత్నించు రమా! నేను నిన్ను తప్పు పట్టడం లేదు. మన కుటుంబం ఎదుర్కొన్న అవకతవకలన్నీ నా కారణంగానే నే నాకు తెలుసు. ఎట్లొచ్చీ నేను చని పోయాక మన కుటుంబం నలుగురూ వేలెత్తి చూపేలా ఉండకూడదని నా ఆశయం. అందుకే నీకు ఇంతలా చెబుతున్నాను. ఈ రాత్రి నేను చనిపోయాననుకో నీకు రేపట్నించి రహస్యంగా బ్రాందీ యెవరు తెచ్చి పెడతారు?" అన్నాడు రామభద్రయ్య.

"ఏమండీ—మీ రాత్మహత్యా ప్రయత్నం చేస్తున్నారా?" అనడిగింది రమాదేవి అనుమానంగా.

"లేదు రమా! కాఫీ భగవంతుడు నాకీరాత్రికి మరణ శిక్ష విధించాడు. బహుశా ఈ రాత్రి నా చావు తప్పదు" అన్నాడు రామభద్రయ్య.

"నేను మీ పక్కనుండగా—ఆ యముడు కూడా మీ జోలికి రాలేడు." అంది రమాదేవి.

"రాత్రి పన్నెండు గంటలకు యముడి పిలుపు ఈ ఇంట ప్రతిధ్వనిస్తే నువ్వు మాత్రం ఏమి చేయగలవు రమా!" అన్నాడు రామభద్రయ్య—"అయినా నాకిప్పుడు చావంటే భయం లేదు. ఈ రోజు మనసు ప్రశాంతంగా వుంది—"

# 4

రాజారావు ఆ ఇంటి తలుపు తట్టాడు. ఓ యువతి వచ్చి తలుపు తీసింది.

"మీవారింట్లో లేరా?"

"ఆఫీసుకు వెళ్ళారు...." అందామె.

"నేను నీతోనే మాట్లాడాలి. లోపలకు రావచ్చా?"

ఆమె అంగీకారసూచకంగా తలాడించి లోపలికు నడిచింది. రాజారావామెను అనుసరించాడు.

లోపలకు వెళ్ళి కూర్చున్నాక — "గుర్తున్నానా?" అన్నాడు రాజారావు.

"ఊఁ" అందామె.

"అదృష్టమే—పెళ్ళయ్యాక కూడా నన్ను గుర్తుంచుకున్నావు...."

"ఎరిగున్న మనుషుల్ని మరిచిపోవడంకోసం ఎవరూ పెళ్ళి చేసుకోరు...."

"రాజుగారి కోటలో ధనముందిట. నువ్వు నన్ను జ్ఞాపముంచుకోవడంవల్ల కూడా అంతే లాభం నాకు...." అని

నిట్టూర్చాడు రాజారావు.

"నాతో ఏదో మాట్లాడాలన్నావ్!" అందామె.

"అవును. నేను నిన్నింకా ప్రేమిస్తూనే వున్నాను. ఇప్పుడు నేను ఇదివరకటి నేను కాదు. నా దగ్గర చాలా డబ్బుంది...." అంటూ అతను జేబులోంచి నోట్లకట్టను బయటకు తీసి టేబుల్ మీద పెట్టాడు—"నువ్వు కావాలంటే ఈ క్షణంలో ఈ డబ్బంతా నీ కిచ్చేయగలను—"

ఆమె ఆ డబ్బుకేసి ఆశగా చూసింది— "డబ్బంటే యెవరికీ చేదుకాదు. ఇంతకీ నువ్వు చెప్పబోయేదేమిటో?"

"నీ భర్తను వదిలిపెట్టి నాతో వచ్చేసేయ్. మన మిద్దరం హాయిగా జీవిద్దాం...."

ఆమె తెల్లబోయి అతనివంక చూసి—"స్పృహలో వుండే మాట్లాడుతున్నావా?" అంది.

"ఏం?"

"నా మీద నీకింకా అలాంటి దృష్టి ఉండడమే తప్పు. పెళ్ళికి ముందు ఏమోకానీ—పెళ్ళయ్యాక నేను పూర్తిగా వారి సొంతమైపోయాను. వారులేని జీవితాన్నూహించుకోలేదు. నువ్వెంత డబ్బు ఆశ చూపించినా నేనాయన్ను వదిలి రాలేను" అందామె.

"కానీ ఒకప్పుడు డబ్బు లేదన్న కారణంగానే నువ్వు నన్ను తిరస్కరించావు" అన్నాడు రాజారావు.

"ఎందుకు రాజా—అలాంటి అభియోగం వేస్తావు? నేను నిన్నెప్పుడూ తిరస్కరించలేదు. నిన్ను పెళ్ళి చేసుకోవడంకోసం నన్ను కని పెంచిన తలిదండ్రుల్నెదిరించే సాహసం చేయలేకపోయాను. వాళ్ళే నా డబ్బుగురించి నిన్ను కాదనలేదు. నీ గురించి వాళ్ళకాట్టే వివరాలు తెలియవు. నీ తలిదండ్రుల గురించిన వివరాలు నివ్వేమీ చెప్ప

లేకపోయావు. ఆడపిల్ల నిచ్చేటప్పుడు కుర్రాడి గురించి వెనకా ముందూ తెలుసుకోవాలని ఎవరైనా అనుకుంటారు గదా!"

రాజారావు నీరసంగా నవ్వి—"నాకో మేడ ఉందనుకో. బ్యాంకులో నా పేరున ఓ లక్ష రూపాయలున్నాయనుకో. నేను నిన్ను పెళ్ళాడాలనుకున్నాననుకో. అప్పుడు మీ అమ్మా నాన్నా నా తలిదండ్రులెవరో తెలియదని పెళ్ళి మానేసేవారా? వాళ్ళు వద్దన్నా నువ్వు మానేసేదానివా?" అన్నాడు. ఆమె మాట్లాడలేదు. అప్పుడతను మళ్ళీ—"అందుకే డబ్బు లేదన్న కారణంగానే నువ్వు నన్ను తిరస్కరించావని అంటున్నాను ...." అన్నాడు!

"నేను సామాన్యురాలిని. నువ్వింతలా వాదిస్తే నేనేమీ మాట్లాడలేను. నాకు పెళ్ళైపోయింది. వారే ఇప్పుడు నా దైవం. ఈ విషయంలో నేను వాదించదల్చుకోలేదు" అందామె.

"నువ్విలా అంటావని నాకు తెలుసు" అన్నాడు రాజారావు...."అయినా సరే నేను నిన్ను కోరడానికి వచ్చాను. నా మాట విను. నాతో వచ్చేసెయ్. నువ్వు రాకపోతే ఈ రాత్రితో నా జీవితం అంతమైపోతుంది."

"అంటే?"

"నేను నిన్ను మనసారా ప్రేమించాను. నీ తిరస్కారం నాకు జీవితంపై మోజు లేకుండా చేసింది. ఈ రోజు నా జీవితం గురించి ఒక నిర్ణయం తీసుకోదల్చాను. ఆ నిర్ణయానికీ నీ నిర్ణయానికీ ముడివడి వుంది. నువ్వు అవునంటే లక్షాధికారిగా అద్భుతమైన జీవితం గడుపుతాను. నువ్వు కాదంటే హంతకుడిగా మారి పోలీసులకు దొరికిపోయి—

ఉరిశిక్షను గురౌతాను" అన్నాడు రాజారావు.

"హంతకుడిగా మారతావా?"

"అవును. నాకు కొన్ని పాతపగలున్నాయి. నువ్వు నన్ను కాదనగానే వాటి అంతు తేల్చాలనుకుంటున్నాను. అందుకే ముందు నీ దగ్గరకు వచ్చాను" అన్నాడు రాజారావు.

"నీ జీవితంతో నాకింక సంబంధంలేదు. నా జీవితం వేరే వ్యక్తితో ముడివడిపోయింది."

రాజారావు డబ్బు జేబులో కుక్కుకున్నాడు. ఆమె వంక అదోలాచూసి జేబులో మళ్ళీ చేయిపెట్టాడు. అతని జేబులోంచి బయటకు వచ్చిన తళతళ మెరిసే కత్తినిచూసి ఆమె కంగారుపడింది.

"ఏమిటి....నువ్వు నన్ను చంపుతావా?" అంది తడబడుతూ.

"అవును...." అన్నాడు రాజారావు...."అరిచావా ఈ కత్తి నీ గుండెల్లో దిగబడుతుంది. మాట్లాడకుండా నేను చెప్పినట్లు విను."

"ఏం చేయాలి నేను?" అందామె ఏడుపు కంఠంలో.

"ఒక అందమైన ఆడపిల్లనుంచి వయసులో ఉన్న మగాడు ఏం కోరతాడు?....ఈరోజు నా తీరని కోరికల్ని తీర్చుకోబోతున్నాను. చెప్పినట్లు విన్నావా సరే....చచ్చినా సరే...." అన్నాడతను.

అతను చేతిలో కత్తితో ఆమెను సమీపించాడు. నడుంమీద చేయివేసి దగ్గరగా లాక్కున్నాడు. తన గుండెల్లోని కోర్కెనంతా పెదవులమీదకు రప్పించి ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె ప్రతిఘటించలేదు.

అతనికి ఉత్సాహం పెరిగింది.

# 5

ఆమె సన్నగా ఏడుస్తోంది.

"నా మంచితనం, ప్రేమ నిన్ను సాధించలేకపోయాయి. నువ్వు నా చేయి దాటిపోయావు. ఆ తర్వాత డబ్బుకూడా లొంగలేదు నువ్వు. కానీ ఈ కత్తి లొంగదీసుకుంది" అంటూ రాజారావు కత్తిని పెదాలతో స్పృశించి ముద్దు పెట్టుకున్నాడు.

"వారికి నా మొఖమెలా చూపించను?" అందామె ఇంకా ఏడుస్తూనే.

"నాలో ఆశలు రేపి నాదానివి పోతావని నమ్మించి ఆఖరుకు మీవాళ్ళు కాదన్నారని మా నేసినపుడు నాకు ముఖమెలా చూపగలనని నువ్వనుకోలేదు" అన్నాడు రాజారావు...."పోనీలే....ఒకప్పుడు నన్ను ప్రేమించినట్లు నటించావు. ఇప్పటికీ నిన్ను ప్రేమిస్తున్నాను నేను. మీవారికి ముఖమెలా చూపాలా అన్న నీ బాధ చూడలేను...." అంటూ అతను చటుక్కున ఆమె నోరుమూసి కత్తిని బలంగా గుండెల్లో దింపాడు.

ఆమె రెండు క్షణాలు గిలగిలా తన్నుకుని మంచంమీద వాలిపోయింది.

"విచారించకు .... రేపటెల్లుండిలో నేనూ నీదగ్గరకు వస్తున్నాను" అన్నాడు రాజారావు. తర్వాత అతినక్కడ ఎంతోసేపు వుండలేదు. అక్కణ్నించి బయల్దేరి ఓ షాపుకి వెళ్ళి కత్తి ఒకటి కొన్నాడు. అది జేబులో వేసుకుని మరో ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. ఒకామె తలుపు తీసింది.

"అహోబలరావుగారున్నారా?" అన్నాడతను.

"ఉన్నారు" అందామె.

"నేను వారితో మాట్లాడాలి."

"లోపలకు రండి!"

ఆ ఇంట్లో అహోబలరావుకు పర్సనల్ రూం వుంది. రాజారావు ఆ గదిలోకే వెళ్ళాడు.

"ఎవరు మీరు?" అన్నాడు అహోబలరావు.

"గుర్తున్నానా?" అన్నాడు రాజారావు అతడి ప్రశ్న వినకుండా.

అహోబలరావు అతన్ని పరీక్షగా చూసి—"నీ పేరు రాజారావు అనుకుంటాను...." అన్నాడు.

"అక్షరాలా అదే!" అన్నాడు రాజారావు-"అయిదు వేలు అడిగితే ఇవ్వలేదని నాకు రావలసిన ఉద్యోగం రాకుండా చేశావ్....గుర్తుందా?"

అహోబలరావు మాట్లాడకుండా రాజారావు వంకే పరీక్షగా చూస్తున్నాడు. అతనెందుకొచ్చాడో అతడి కళ్ళలోకి చూసి తెలుసుకుందామని ప్రయత్నిస్తున్నాడు.

"నాలాంటి వాళ్ళను చాలామందిని చూసి ఉంటావ్-అందువల్ల ఎంతమందినని గుర్తుంచుకోగలవు. కానీ నువ్వు నాకు బాగా గుర్తుండిపోయావు. నీ ఒక్క నిర్ణయం నా జీవనపథాన్ని మార్చేసింది. ఇంకా చెప్పాలంటే నాకు జీవితమనేదే లేకుండా చేసింది."

"మిస్టర్ .... నువ్వు చెప్పదల్చుకున్న దేమిటి?" అన్నాడు అహోబలరావు విసుగ్గా.

"నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఏ ఆధారమూ లేని నన్నామె వివాహం చేసుకోడానికి సుముఖంగాలేదు. ఆ సమయంలో శి. కంపెనీలో నా కుద్యోగం వచ్చింది. ఆ

ఉద్యోగం నాకు నీ ద్వారా వచ్చింది. అయితే నువ్వు నన్ను అయిదు వేలు అడిగావు. అప్పటికి నా దగ్గర లేవనీ కావాలంటే నోట్ రాసిస్తాననీ అన్నాను. నువ్వు నిర్దాక్షిణ్యంగా నిరాకరించావ్. ఆ ఉద్యోగం నాకు రాకుండా పోయింది. దాంతో నాక్కావలసిన ఆ అమ్మాయి కూడా నాక్కకుండా పోయింది. జీవితంలో నాకున్న ఒకే ఒక్క ఆలంబన ఆ విధంగా పోయింది...."

"ఇలాంటి కథలు చాలా విన్నాను...."

"నాకు తెలుసు. అందుకే ఇక ముందు అటువంటి కథలు వినే అవకాశం నీ కివ్వదల్చుకోలేదు" అంటూ జేబులోంచి కత్తితీసి మెరుపు వేగంతో అహోబలరావు గుండెల్లోకి దింపాడు.

అహోబలరావు ఈ పరిణామాన్నూహించినట్లు లేదు. అతను ఒక్క గావుకేక పెట్టి నేల కూలిపోయాడు. నేల కూలేక అరిచేశ క్తికూడా అతనిలో ఉన్నట్లులేదు. కత్తి చాలా బలంగా అతడి గుండెల్లోకి దిగినట్లుంది.

అహోబలరావు కేక గది అవతలకు వినబడినట్లుంది. అతడి భార్య గుమ్మందగ్గరకు వచ్చి కర్టెన్ ఒత్తిగించి తొంగి చూసింది.

అప్పటికి రాజారావు గుమ్మంవద్దకు వచ్చాడు. ఆమెను చూసి....లోపలకు రమ్మనమని సౌజ్ఞ చేశాడు. ఆమె నెమ్మదిగా గదిలోకి అడుగుపెట్టి అక్కడి దృశ్యంచూసి కెవ్వుమని అరవబోయింది కానీ అతడామె నోరు చటుక్కున మూసి—"అరవకు-నీ ప్రాణం కూడా తీయగలను" అన్నాడు.

ఆమె శరీరం అతడికి వేడిగా తలిగింది. భయంతో ఆమె శరీరం వేడెక్కిందని అతను గ్రహించాడు,

"నీకు నేను గుర్తుండి ఉండను. నీకు బహుశా నువ్వే ఏళ్ళుంటాయనుకుంటాను. శరీరాన్ని చక్కగా పోషిస్తున్నావు. వంటినిండా నగలు దిగేశావు. అన్ని కాస్మెటిక్స్ వాడుతున్నావు. నీకు పిల్లలు లేరు. తల్లిని కావాలన్న బెంగకూడా నీ కున్నట్లులేదు. ఓవేళ ఉన్నా నీ బుద్ధులకు జడిసి భగవంతుడే నీకా అవకాశం లేకుండా చేసి ఉంటాడు. ఆ రోజు నే నుద్యోగంకోసం నీ భర్త కాళ్ళా వేళ్ళా బడుతూంటే మధ్యలో నువ్వొచ్చి—"క్రొత్త సెక్రెటరీకి అర్థగిచ్చిన మాట మరచారా—అవతల ఓ అబ్బాయి అయిదు వేలుతో సిద్ధంగా ఉన్నాడు" అని నీ భర్తను విసుక్కున్నావు. అప్పుడు నువ్వసలు నావంక కన్నెత్తైనా చూడ లేదు. నా మాటలు విని నన్నో పురుగువాడికింద జమ వేశావ్. తప్పు నీ భర్తదే అయినా అందులో నీ పాత్ర ఏమీ తక్కువది కాదు" అంటూ ఆమె నోటిమీద తన చేతిని తొలగించాడతను.

భయంతో ఆమె వణికిపోతోంది. మాట్లాడే శక్తి కూడా ఆమెకున్నట్లు లేదు.

"ఆ రోజు నన్ను ఎందుకూ పనికిరానివాణ్ణిగా లెక్క వేశావ్. నా పొట్టకొట్టావు. నా జీవితంపై దెబ్బతీశావ్. ఈ రోజు నేను నీ నుదుటి కుంకుమ చెరిపేశాను. నువ్వు నన్నేమీ చెయ్యలేవు. నా గురించి పోలీసులకు చెప్పావంటే నేను జైల్నించి పారిపోయైనా వచ్చి నిన్ను చంపేస్తాను. అసలీరోజే నిన్ను చంపవలసి ఉందికానీ నిన్ను కాస్త అవమానించాలనే ఉద్దేశ్యంలో నీ ప్రాణాలజోలికి రావడం లేదు" అంటూ అతనామె చేయి వదిలిపెట్టి గదిలో ఓ మూలకు వెళ్ళమన్నాడు.

మాట్లాడకుండా ఆమె అలాగే చేసింది.

ఆ గదిలో టేబుల్ ఉంది. దానిమీద ఓ ప్లాస్టిక్ క్లాత్ ఉంది. సోఫాలున్నాయి. టీపాయ ఉంది. ప్రవేశ ద్వారానికి తెర ఉంది. రాజారావు టేబుల్ మీది ప్లాస్టిక్ గుడ్డనూ, గుమ్మదగ్గర తెరనూ తీసి అవతల విసిరేసి ఆమెను సమీపించి-"నీ వంటిమీది బట్టలన్నీ మర్యాదగా నాకిచ్చేసెయ్. ఒక్క ముక్క కూడా మాట్లాడకూడదు" అన్నాడు.

ఆమె అతను చెప్పినట్లే చేసింది.

రాజారావామె వంక హేళనగా చూసి — "ఇదీ నీ నగ్న స్వరూపం. దీన్ని కప్పడానికీ, అలంకరించడానికీ, ఆకర్షణీయంగా తయారుచేయడానికీ, సుఖపెట్టడానికీ— నా వంటివాళ్ళ నిండు జీవితాల నపహరించవలసిందిగా నీ భర్తను ప్రోత్సహిస్తున్నావ్. ఆ నీ భర్త శవం ఇక్కడే వుంది. కిక్కురుమనకుండా ఆ శవం పక్కన ఈ రూపంతో గడుపు. ఎవడో పుణ్యాత్ముడు వచ్చి తలుపు తీసేవరకూ ఇక్కడే ఇలాగే వుండు" అంటూ రాజారావు ఆమె బట్టలతో సహా గది బయటకు వెళ్ళి—తలుపు దగ్గరగా వేసి బయట గడియవేశాడు.

తన చేతిలోని బట్టల్నీ హాల్లో ఇందాకా పారవేసిన బట్టల్నీ తీసుకువెళ్ళి—ఇంట్లో వెతికి పాత గుడ్డల పెట్టెలో పారేశాడు.

# 6

"రా రాజా!" అంది సౌగంధి.

రాజారావు జేబులోంచి పదివేలు తీసి ఆమెకు అందించి "ఈరోజు రాత్రి పన్నెండుగంటల వరకూ నువ్వు పూర్తిగా నాదానివి కావాలి" అన్నాడు.

సౌగంధి ఆ డబ్బు అందుకుని—"నువ్వాడగాలికానీ—

డబ్బిచ్చినా ఇవ్వకపోయినా నేనెప్పుడూ నీదాన్నే!" అంది.

"అంత మాటన్నందుకు చాలా థాంక్స్" అన్నాడు రాజారావు — "నా దురదృష్టంకొద్దీ నిన్ను కాస్త ఆలశ్యంగా చూశాను. ముందే నిన్ను చూసి ఉంటే నా జీవితం ఇంకో దారిలో నడిచి ఉండేదేమో!"

"ఇప్పుడుమాత్రం నష్టమేముంది — నువ్వొప్పుకుంటే మనిద్దరం పెళ్ళి చేసుకుందాం."

రాజారావు నిట్టూర్చి — "అది సాధ్యంకాదు" అన్నాడు.

"నాకు తెలుసు. నేను వేశ్యననేగా?"

రాజారావు ముఖం ఎర్రగా అయింది-"నువ్వు వేశ్యవా? అలా అని ఎవరన్నారు? నువ్వు వేశ్యవు కాదు. వేశ్య అంటే డబ్బుకోసం ప్రేమికుల్నికూడా వదిలి ఎవణ్ణో కట్టుకునేవాళ్ళు. తమ తళుకుబెళుకులతో భర్తలకు వెర్రెక్కించి తమ సౌఖ్యం కోసం వారిని తప్పుదారులు తొక్కించేవారు. మర్యాదస్థులుగా చెలామణీ అవుతూ మనసులో వేశ్యల అదృష్టానికి అసూయపడేవారు..వారు.. వారంతా వేశ్యలు. నువ్వు వేశ్యకాదు. మాయామర్మం లేకుండా....నిర్మొహమాటంగా మగవాడిదగ్గర డబ్బు తీసుకుని—వెలకట్టలేని సుఖాలను ప్రసాదించే సౌఖ్య ప్రదాయినివి నువ్వు...."

"కలకాలం నేనలా పురుషజాతిని సుఖపెడుతూ ఉండిపోవాలనా—నువ్వు నన్ను పెళ్ళిచేసుకోనంటున్నావ్?!" అంది సౌగంధి.

"కాదు సౌగంధీ! నాకు గత జీవితంగురించిన బెంగలేదు. నీ జీవన విధానం గురించిన ఆలోచనలేదు. ఎడారిలో

ఒయాసిస్సులా కనబడ్డావ్ నువ్వు నాకు. ఒయాసిస్సుకీ ప్రయాణీకుడికీ అనుబంధం తాత్కాలికమే అవుతుంది. నీ విషయంలోనూ నాకు అంతే!" అని రాజారావు ఒక్క క్షణం ఆగాడు.

"అమ్మ పోగానే జీవితమంతా అంధకారమైపోయింది నాకు. వెంటనే చచ్చిపోవాలనే అనుకున్నాను. కానీ అమ్మ ఎన్ని కష్టాలనుభవించింది? ఎన్ని అవమానాలను భరించింది—అదంతా నన్ను బ్రతికించడానికేగదా! నన్ను అంత కష్టపడి బ్రతికించినందుకు నా వల్ల ఏదైనా మంచి కార్యం సిద్ధించాలిగదా! నా బ్రతుకు సార్థకం చేసుకోవాలి గదా—అందుకే బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను. ఆ నిర్ణయంలో ఆవేశం, ఉద్రేకం ఉన్నాయి బ్రతుకుమీద తీపిలేదు.

అంతలోనే నాకు ఆమెతో పరిచయమైంది. ఆమె పరిచయం నా జీవితంలో పన్నీటి జల్లులా కురిసింది. నాలో ఆవేశం, ఉద్రేకం తప్పుకుని ప్రేమానురాగాలు సిరపడ్డాయి. ఫలితంగా నేనుద్యోగ ప్రయత్నం మొదలు పెట్టాను. తన కంపెనీలో ఒక ఖాళీ ఉన్నదనీ అది నాకీయ వచ్చుననీ ఆ మేనేజరు చెప్పాడు. అయితే చివరిక్షణాల్లో ఆ హోబలరావు కలగజేసుకుని నాకు అడ్డుపడ్డాడు. ఉద్యోగం పోయింది. ఆమె నిర్దాక్షిణ్యంగా నన్నుకాదని తలిదండ్రులు చెప్పిన పెళ్ళి చేసేసుకుంది. జీవతమంతా శూన్యం! చెరుపుదామన్నా చెరిగిపోని ఆమె ముద్ర నా హృదయంపై పడిపోయింది.

ఒక్కసారి నాలోంచి ప్రేమానురాగాలు తప్పుకున్నాయి. పగ, ద్వేషం, ఆవేశం, ఉద్రేకం నన్నావహించాయి. అప్పుడే నాకు నీ పరిచయం లభించింది.

రామభద్రయ్య గురించిన వివరాలు సేకరించడానికి నువ్వు చేసిన సాయం ఈ జన్మకు మరువలేనిది. ఏ కారణంవల్లనో నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు. నేను నువ్వంటే యిష్ట పడుతున్నాను కానీ ఆమె స్థానంలో నిన్ను నా హృద యంలో ప్రతిష్ఠించలేకపోతున్నాను. అది నా దురదృష్టం. నాకూ నీకూ మాత్రమే తెలిసిన ఆ రామభద్రయ్య రహ స్యాలు అలాగే వుండిపోనీ!

ఈ రోజు రాత్రితో నా కార్యక్రమం ముగుస్తుంది. నా జీవితం కూడా ముగుస్తుంది. ఈ ఆఖరి గంటల్లో నీకు తెలిసిన విద్యలన్నీ ఉపయోగించి నన్ను రంజింపజేయి. ఈ జన్మకు నీ నుంచి నేను కోరేది అంతే! నీకోసమే ఆ పది వేలూ రామభద్రయ్యదగ్గర తీసుకున్నాను..." అన్నాడు రాజారావు.

సౌగంధి నిట్టూర్చి-"ఎవరేమనుకున్నా నువ్వొక అద్భుత మైన మనిషివి రాజా! నువ్వు దేశానికి కాకుండాపోయా వంటే ఆ తప్పు నీది కాదు. దేశం నిన్ను పోగొట్టుకుంది. కానీ నేను నిన్నుపోగొట్టుకోదల్చుకోలేదు. ఇప్పుడు మనం గడిపేవి ఆఖరుగంటలు కావడానికి వీల్లేదు.మనం ఎప్పుడూ ఇలా కలిసే వుండాలి-" అని..."అవసరార్థం శరీరా న్నమ్ముకోవడం ప్రారంభిస్తే అనతి కాలంలోనే అను కున్నకంటే బాగా సంపాదించగలిగాను. నేను సర్వ స్వతంత్రురాలిని. నేను నడుపుతున్న జీవితం వదిలిపెట్టా లని ఉంది నాకు. నిన్ను తప్ప మరే మగవాడ్నీ నమ్మను నేను. నువ్వు చేయూతనిస్తానంటేనే నే ఈ జీవితం వదిలి పెడతాను. లేకపోతే నా బ్రతుకు యెప్పటికీ యింతే!" అంది.

"సౌగంధీ-సమయం వృథా చేయకు. నా పట్టుదల నీకు

తెలుసు..." అన్నాడు రాజారావు.

సౌగంధీ రాజారావు ముందు వివిధ నృత్యాలు చేసింది. మంచి మంచి పానీయాలు తెప్పించింది. అతని కౌగిలిలో ఒదిగిపోయి, ఎన్నో రసవత్తరమైన కథలు చెప్పింది. తనకు వచ్చిన విద్యలు ప్రదర్శించింది.

"అద్భుతం-సౌగంధీ!" అన్నాడు రాజారావు ఓ క్షణంలో సంతోషం పట్టలేక.

"నువ్వు మెచ్చుకున్నావు..అదే చాలు!" అంది సౌగంధి.

రాజారావు టైము చూసుకుని ... "పదకొండున్న రయింది...ఇంకో అర గంటలో రామభద్రయ్యకు ఫోన్ చేయాలి!" అన్నాడు.

# 7

సరిగ్గా పన్నెండు గంటలకు రామభద్రయ్య ఇంట్లో ఫోన్ మ్రోగింది.

"అదిగో-మృత్యు దేవుడి పిలుపు..." అంటూ రామభద్రయ్య ఫోన్ దగ్గరకు నడిచాడు. రమాదేవి అతడి వంకే ఆశ్చర్యంగా చూస్తోంది.

"హలో- నేను..రామభద్రయ్యను..."అన్నాడు రామభద్రయ్య.

"నేను రాజారావును..." అంది అవతలి కంఠం.

"చెప్పు!"

"ఏం చేశావీరోజు?" అన్నాడు రాజారావు.

"భార్యను తాగుడు మానమని హెచ్చరించి ఒప్పించాను. నా ముగ్గురు పిల్లలకీ పెళ్ళిళ్ళు చేసేశాను. ఆస్తి వ్యవహారాలు అబ్బాయికి అప్పజెప్పేశాను. వ్యాపారం నుంచి విరమిస్తున్నట్లు ప్రకటన చేశాను.."

"ఒక్క రోజులో..ఇన్ని పనులు...సాధ్యమా?"

"ఏమో-నాకు సాధ్యపడ్డాయి..."

"ఇప్పుడేం చేస్తున్నావ్?"

"చావుకోసం ఎదురు చూస్తున్నాను...."

"భయంగా, బెంగగా...లేదా?"

"ఉంది-"

"బ్రతకాలనిపిస్తోందా?.."

"అనిపిస్తోంది..."

"కానీ నువ్వు బ్రతకవు. ఒంటిగంట కాగానే ఇంట్లో బయల్దేరి గోదావరి ఒడ్డున రావిచెట్టు దగ్గరకురా. కారులో కాకుండా నడిచిరా....నీ ఇంటిగ్గర్నుంచి అక్కడికి ప్రయాణం కాలి నడకన ఇరవై నిముషాలు పడుతుంది. ఒంటిగంటా ఇరవై కల్లా అక్కడుండాలి. జీవితం మీద ఇంకేవిధమైన ఆశలూ పెట్టుకోకు. పిచ్చిపిచ్చి వేషాలేవీ వెయ్యొద్దు..."

"నువ్వు చెప్పినట్లే చేస్తాను"అన్నాడు రామభద్రయ్య.

"బైదిబై ఈ రోజు నువ్వింకేమైనా చేశావా?"

"ఇంకేమైనా అంటే?"

"గతంలో చేసిన పాపాలగురించి తలచుకుని పశ్చాత్తాపపడడం లాంటివి."

"పశ్చాత్తాపపడేటంత పాపాలు నేనేవీ చేయలేదు"

"మంచిది. అలాగే అనుకో....ఒంటిగంటా ఇరవై కల్లా మాత్రం అక్కడుండాలి. మరిచిపోకూ....బై ...."

అవతల ఫోన్ క్లిక్కుమంది.

రామభద్రయ్య ఫోన్ పెట్టేశాడు. ఆయన శరీరంలో సన్నగా వణుకు ప్రారంభమైంది.

రమాదేవి ఆయన్ని సమీపించి "ఏమిటండీ ఆ ఫోన్" అనడిగింది.

"ఏదోలే నీకు సంబంధించింది కాదు."

"మీకు సంబంధించినవన్నీ నాకూ సంబంధించినట్లే. అదేమిటో చెప్పండి!"

"రమా! ఈ రోజింతవరకూ గుక్కెడు బ్రాందీ అయినా పుచ్చుకోలేదు. గొంతు ఏదోలా అనిపించడం లేదూ?" అన్నాడు రామభద్రయ్య చటుక్కున.

"నాకు దాని పేరు గుర్తుచేయకండి. తాగనని మీమీద ఒట్టేశాను...." అంది రమాదేవి.

"అయితే నీ ఒట్టుకు చిన్న పరీక్ష...." అన్నాడు రామభద్రయ్య.

"చెప్పండి...."

"నేను ఇప్పుడు ఇల్లు వదిలి పెడుతున్నాను. నువ్వు అన్న మాటమీద నిలబడి ఒక్క చుక్క కూడా బ్రాందీ పుచ్చుకోకుండా వుంటే రెండున్నరకల్లా నేను తిరిగి వస్తాను. నువ్వు నిగ్రహం కోల్పోతే- నేను తిరిగి రాననుకో...." అన్నాడు రామభద్రయ్య.

"మీరు దగ్గర లేకపోతే నన్ను నేను నిగ్రహించుకోలేనేమోనండీ. ఈ అలవాటు పూర్తిగా పోయేవరకూ మీరు కొంతకాలం నన్ను కనిపెట్టుకుని ఉండండి...." అంది రమాదేవి.

"ఏమీ లాభంలేదు. నామీద ఏమాత్రం గౌరవమున్నా నువ్వు నేను చెప్పినట్లు వినాల్సిందే!" అన్నాడు రామభద్రయ్య.

రమాదేవి యెంత చెప్పినా ఆయన వినలేదు. ఒంటిగంటకు కాస్త ముందుగానే ఆయన ఇల్లు వదిలిపెట్టాడు.

# 8

"నేను వెళ్ళాలి!" అంటూ లేచాడు రాజారావు.

"వద్దు రాజా-నువ్వు వెళ్ళద్దు...." అంటూ అతన్ని గట్టిగా కౌగలించుకుంది సౌగంధి.

"ఏ పరిస్థితుల్లోనూ యెవ్వరూ నన్నాపలేరు...." అంటూ మృదువుగానే అతనామెను విడిపించుకుందుకు ప్రయత్నించాడు. కానీ ఆమె పట్టు చాలా బలంగా వుంది.

అతనామె కళ్ళల్లోకి కళ్ళుపెట్టి చూస్తూ "సౌగంధీ! నాకూ జీవితంపైన ఆశ వుంది. కానీ కొన్ని యెదురుదెబ్బలకు నా మనసు బండబారిపోయింది. నాకై నేను నా నిర్ణయాన్ని మార్చుకోలేను. కానీ నువ్విలా నన్ను బంధించి వుంచినంతకాలం నేను బలవంతంగా ఇక్కణ్ణుంచి కదలను. నువ్వు నన్ను ఇచ్ఛాపూర్వకంగా వదిలిపెడితేనే ఇక్కణ్ణుంచి కదుల్తాను...." అన్నాడు.

సౌగంధి కళ్ళు మెరిశాయి. "ఇప్పుడే కాదు....యెప్పటికీ నేను నిన్ను వదలను. ఈ రాత్రంతా నేను నీతోనే గడుపుతాను. ఆ తర్వాత నువ్వు ఎప్పటికీ నా వాడివి...."

రాజారావు తనలో తాను అస్పష్టంగా యేదో గొణుక్కున్నాడు. టైము చూసుకున్నాడు. ఒంటిగంట కావడానికింకా ఇరవై నిముషాలు వ్యవధి వుంది. సౌగంధి ఇంటినుంచి గోదావరి ఒడ్డునున్న ఆ రావిచెట్టును చేరుకోవడానికి సరిగ్గా పదిహేను నిముషాలు చాలు. కానీ ఆమె తనని వదిలేలా లేదు.

నిముషాలు గడుస్తున్నాయి. సౌగంధి రాజారావు చుట్టూ చేతులువేసి అలాగే కౌగిలించుకునే వుంది.

రాజారావు మనసులో ఉదయం రామభద్రయ్యకు

చేసిన హెచ్చరిక మెదుల్తోంది—"ఏదో బలీయమైన కారణంవల్ల నేను నిన్ను రెండు గంటలకు కలుసుకోలేక పోతే మళ్ళీ యెప్పుడూ నిన్ను కలుసుకోను. నీ జోలికి రాను...."

ఇదే ఆ బలీయమైన కారణమవుతుందా? తను రామ భద్రయ్యాను కలుసుకోలేడా?

అయినా ఇదేం సెంటిమెంటు! ఏ శక్తి తనచేత ఆ మాట అనిపించింది.

సౌగంధి పక్కమీదకు వాలిపోయింది. ఇద్దరూ ఒకరి కొకరు అంటుకుని పడుకునివున్నారు. సౌగంధి మాత్రం అతడి చుట్టూ ఉన్న పట్టు సడలించడంలేదు.

రాజారావు దృఢసంకల్పంతో మెలకువగా వున్నాడు. యేదో క్షణంలో సౌగంధిని మత్తు ఆవరించకపోదనీ వెంటనే తను లేచి పోవచ్చుననీ అత నాశిస్తున్నాడు. మాట్లాడితే నిద్ర చెడిపోతుందన్న భయంతో అతను మౌనంగా వున్నాడు. సౌగంధి కూడా మాట్లాడించబోతే ఆమెను వారించి "నేను ఆలోచనల్లో వున్నాను. నన్ను మాట్లాడించడానికి ప్రయత్నించవద్దు...." అన్నాడు.

మధ్యాహ్నంనుంచీ సౌగంధికి విశ్రాంతి లేదు. అలసటతో ఆమె కళ్ళు మూతలు పడుతున్నాయి. కానీ ఆమె బలవంతాన నిద్రను ఆపుకుంటోంది.

టైము పన్నెండూ ఏభై, యాభైఒకటి, యాభై రెండు....యాభై అయిదు....

రాజారావు వాచ్ వంకే చూస్తున్నాడు. సౌగంధి పట్టు సడలడంలేదు.

టైము ఒంటిగంటయింది. రాజారావులో అసహనం

ప్రారంభమైంది. అర్థంలేని సెంటిమెంటు వదిలిపెట్టి లేచి పోవాలనిపించింది. అయితే అప్పుడు తన మాటకు విలువేముంటుంది?....ఇంతకాలంలోనూ అన్నమాట నిలబెట్టుకోని క్షణం లేదు. ఇప్పుడుమాత్రం అలా యెందుకు జరగాలి?

టైము ఒంటిగంటా ఒక నిముషం అయినప్పుడు గదిలో టెలిఫోన్ మ్రోగింది. మంచానికి ప్రక్కనే వున్న ఆ ఫోన్‌ను చేతితో అందుకునేటప్పుడు సౌగంధి కాళ్ళతో అతడికి బంధం వేసింది.

అయితే ఫోన్ వింటూనే ఆమె కలవరపడింది—మినిస్టరుగారు తనకోసం కార్లో వచ్చాడు. మెట్లదగ్గర ఎదురు చూస్తున్నాడు. కాదంటే పోలీసులు రావచ్చు. ఔనంటే రాజారావు వెళ్ళిపోతాడు.

ఎలాగూ తను రాజారావుని రక్షించుకోలేదని సౌగంధికి అర్థమైపోయింది.

"నేనే గనుక నీ అర్ధాంగి అయ్యుంటే నిన్ను రక్షించుకో గలిగేదాన్ని-ఆ జీవితం నువ్వు నాకు ప్రసాదించలేదు. ఇక ముందు ప్రసాదించే అదృష్టమూ వున్నట్లు లేదు...."

రాజారావామె మాటలు వినడంలేదు. ఇప్పుడతను ఆమె కౌగిట్లో లేడు. ఆమె కౌగిలి ఓ మినిస్టరుకోసం తనను వదిలిపెట్టింది. ఇదే తనకు అవకాశం.

అతను టైము చూసుకున్నాడు. ఒంటిగంటా అయిదు నిముషాలైంది.

హడావుడిగా ఆక్కడ్నించి బయలుదేరుతూ—"మినిస్టరూ—ఈవిధంగానైనా నువ్వు కొంత దేశసేవ చేశావు" అనుకున్నాడు.

# 9

రామభద్రయ్యా, రాజారావు ఒకరినొకరు చూసుకున్నారు.

"ఇన్నాళ్ళూ నువ్వు చేసిన తప్పులన్నీ ఒక యెత్తు ఈ రోజు చేసిన తప్పు ఒక ఎత్తు" అన్నాడు రాజారావు.

"ఏమిటది?"

"చావుకు సిద్ధపడ్డ ఈ ఒక్కరోజైనా మాలతి అనే పేరును తల్చుకున్నావా?" అన్నాడు రాజారావు.

"మాలతెవరు?" అని ఆగిపోయాడు రామభద్రయ్య. ప్రశ్న సగంలో ఉండగానే ఆయనకు మాలతెవరో గుర్తుకు వచ్చింది. మాలతిని తను గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు. తర్వాత పెద్ద కట్నంతో పెళ్ళి సంబంధం రాగా మాలతిని వదిలిపెట్టేశాడు. ఆమె యెవరో తనకు తెలియదన్నాడు. ఆమె యెంత యేడ్చినా మొత్తుకున్నా వినకుండా నానా మాటలూ అని మరీ వదిలిపెట్టాడు. అప్పుడామె గర్భవతి.

"నేను మాలతి కొడుకుని!" అన్నాడు రాజారావు.

రామభద్రయ్య దెబ్బతిన్నట్లు రాజారావు వంక చూశాడు. ఆయన ముఖంలో భావాలు వర్ణనాతీతం.

"అమ్మ జీవితంలో నానాకష్టాలూ పడింది. ఎన్నో అవమానాలు భరించింది. నన్నుమాత్రం కంటికి రెప్పలా చూసుకుంటూ పెంచి పెద్దవాడ్ని చేసింది. అమ్మ కారణంగా నేనూ కొన్ని అవమానాలకు గురయ్యాను. కానీ నాకు అమ్మమీద కోపం లేదు. నీలాంటివాడ్ని ఒక్కసారి నమ్మి జీవితంలో అన్నీ కోల్పోయిన అమ్మ చచ్చిపోయే

ముందు నే వివరాలిచ్చింది. అప్పుడే నిన్ను చంపాలన్న ఆవేశం వచ్చింది. కానీ ఓ చిన్న ప్రేమలో పడి ఆ ఆవేశాన్ని మరచిపోయాను.

అయితే చరిత్ర హీనుడైన నా ప్రేమ ఫలించలేదు. ప్రేమను నిలబెట్టుకునేందుకు ఏకైక సాధనమైన డబ్బు-నాకు లభించలేదు. మళ్ళీ నా ఆవేశం తిరగదోడింది. ఒక ఆలంబనాన్ని వెతుక్కుని ఓ యేడాదిపాటు నిన్నూ నీ కుటుంబాన్ని నీడలా వెన్నాడి రహశ్యాలు సంపాదించి నీ దగ్గరకు వచ్చాను. నువ్వెంత దుర్మార్గుడివైనా నీనుంచి ఒక్క ప్రేమ దృక్కు-కోసం ఎదురుచూస్తూనే వుంటుంది. అమ్మ స్వర్గంలో వుంది. నా చేతిలో చస్తే నువ్వూ అక్క-డికే వెడతావు—అమ్మా....నువ్వూ అక్కడ కలుసుకుందురుగాని...." అంటూ రాజారావు జేబులోంచి కత్తి తీశాడు. చీకట్లో ఆ కత్తి తళుక్కుమని మెరిసింది.

రామభద్రయ్య కళ్ళల్లో ఇప్పుడు నీళ్ళు వర్షిస్తున్నాయి. ఆయన ముఖంలో దుఃఖం తప్ప భయం ఏ కోశానా లేదు. అప్రయత్నంగా—"బాబూ!" అన్నాడు.

రాజారావు చేతిలోని కత్తితో ఆయనవంకే క్రూరంగా చూస్తున్నాడు.

"ఈరోజు మాలతిని స్మరించని మాట నిజమే! నా పాపానికి నిష్కృతి లేదు. నన్ను చంపేయి బాబూ!" అన్నాడాయన ఆర్ద్రకంఠంతో.

రాజారావు అదోరకంగా పిచ్చివాడిలా నవ్వి-"రామభద్రయ్యా! ఇప్పటికిద్దర్ని చంపాను నేను. అయినా అమ్మ నన్ను ప్రేమిస్తుంది. కానీ నిన్ను చంపితే మాత్రం అమ్మ

నన్ను క్షమించదు. స్వర్గంలో నా ముఖం చూడదు. నిన్ను చంపాలని నాకుంది. అయినా నిన్ను నేను చంపలేను. ఇంత వరకూ నువ్వనుభవించిన మనోవ్యథ చాలు. ఇంకమీదట హాయిగా బ్రతుకు" అంటూ చటుక్కున ఆ కత్తిని తన గుండెల్లో దింపుకున్నాడు.

రామభద్రయ్య ఉలిక్కిపడి—"బాబూ—" అని అరిచాడు.

రాజారావు తన కొడుకై ఉంటాడని ఆయన ఏ మాత్రమూ ఊహించలేదు. అతడు తన కొడుకని తెలియగానే ఆయనకు విచిత్రమైన అనుభూతులు కలిగాయి. అతన్ని పలకరించి ఓసారి దగ్గరగా తీసుకుని ఇంతకాలం అతడెలా జీవించాడో వివరంగా తెలుసుకోవాలనిపించింది. మాలతి గురించి ఏవేవో అడగాలనిపించింది. తనని చంపుతానని బెదిరించింది కన్నకొడుకు అని తెలియగానే మనసు తేలికపడింది కూడా. ఇంతలోనే ఈ ఘోరం జరిగింది.

తను జీవితాన్నంతా డబ్బుతో ముడిపెట్టాడు. అందుకే మాలతిని పొగొట్టుకున్నాడు. హత్యచేశాడు. కన్న కొడుకును చంపుకున్నాడు. భార్యను తాగుబోతుగా మార్చాడు. పిల్లలను చెడునడతకు గురిచేశాడు. ఈరోజు కన్నకొడుకు తన కళ్ళముందే చనిపోయాడు.

జీవితంలో తను సాధించినదేమిటి? శరీర సౌఖ్యాల గురించి ఆలోచించాడు కానీ మానసికాహ్లాదం గురించి మరిచిపోయాడు.

రామభద్రయ్య రెండడుగులు ముందుకు వేసి కొడుకును

సమీపించాడు. అప్పటికే రాజారావు కొనప్రాణంతో ఉన్నాడు. ఆయన చటుక్కున అతడి గుండెల్లోంచి కత్తిని బైటకు లాగి—"ఇక్కడి ఈ జీవితానికి రోజుతో స్వస్తి. నీ కోరిక ప్రకారం నేనూ ఈ క్షణంలోనే మాలతి దగ్గరకు బయలుదేరుతున్నాను" అంటూ రక్తసిక్తమైన ఆ కత్తిని తన గుండెల్లో పొడుచుకున్నాడు.

కొడుకు రక్తం తండ్రి రక్తంతో కలిసింది. రామభద్రయ్య నేలమీద పడిపోతూండేటే ఆ దృశ్యం చూసేకనే రాజారావు కళ్ళు మూతలుపడ్డాయి. అక్కడ రమాదేవి తన మాట నిలబెట్టుకుందో, లేదో తెలియదు.

—: ఐపోయింది :—

# గోవా యాత్ర

## సికిందర్

నేను జుత్తు కత్తిరించుకొని వేషం మార్చుకపోతే, బూటు కాలుతో తన్ని చంద్రమండలం పంపించేస్తానని మా నాన్న బెదిరించినప్పుడు, నాకు రవంతకూడా భయం వేయ లేదు: ఎందుకంటే చంద్రమండలానికి వెళ్ళడానికి రాకెట్ తప్ప మరో వాహనం లేదుగనుకా—అదీ చాలా ఖర్చుతో కూడుకొన్న ప్రయాణం గనుక!

గోవా వెళ్ళినప్పుడే నేను సోమరిపోతునీ, అప్రయోజకుడ్నీ అయ్యాను. చదువు ముగిశాక నాన్న చేతిలో డబ్బుపెట్టి ఎక్కడికైనా వెళ్ళి తిరిగిరమ్మని చెప్పినప్పుడు, నా మనసులో గోవా ఒక్కటే మెదిలింది.

గోవా! సముద్రపు ఒడ్డున సన్ బాత్ చేసే విదేశీయులు వెస్టర్న్ మ్యూజిక్ పారవశ్యంలో ఒళ్ళు మరచి నృత్యం చేసే హిప్పీలు మాదక ద్రవ్యాల మాయా ప్రపంచంలో ఓలలాడే బానిసజీవులు—వాటీ వరసల్ని గాలికి క్షేమగా వదిలేసి శరీరాల్ని కలుషితం చేసుకునే ధన్యజీవులూ—

వీళ్ళంతా కళ్ళముందు మెదిలి ఉత్సాహం ఉరకలు వేసింది.

గోవాలో గడిపిన ఆ మూడు నెల్లో మొదట అలవాటుపడింది మత్తుపానీయాలకి. ఆ తర్వాత స్వల్పంగా నల్లమందుకి. చివరకు హిప్పీజాతి సంస్కృతికి.

అయితే వాళ్ళ సమూహంలో వుంటూ ఎలాంటి కార్యక్రమాల్లోనూ పాల్గొనకుండా — ఏకాంతంలో ఇసుక తిన్నెల మీదనో లేక, కాటేజిలోనో కూర్చొని, శూన్యంలోకి వేదాంతిలా చూస్తూ పనికిమాలిన ఆలోచనలతో గడిపేవాడిని.

చివరకు—నా విహారయాత్ర ముగిశాక-ఒకానొక ఆదివారం ఉదయాన చిరిగిపోయిన దుస్తులతో, ఏపుగా పెరిగిన జుత్తుతో, భుజానికి వ్రేలాడుతూన్న బ్యాగుతో-గేటు తెరుచుకొని ఇంట్లో ప్రవేశించాను.

నన్ను చూసి అమ్మ గావుకేక పెట్టి లోనికి వురికింది— బూచాడి ననుకొని చెల్లాయి ఏడుపు లంకించుకుంది. ఈ గొడవంతా విని నాన్న నిదానంగా బయటకు వచ్చాడు.

నా అవతారం చూసి, అదరకుండా కొన్ని క్షణాల సేపు పరీక్షగా చూసి, అంతలోనే నిప్పులు చెరుగుతోన్న కళ్ళతో బలంకొద్దీ నా చెంపమీద వాయించాడు.

నేను విసురుగా వెళ్ళి బొచ్చుకుక్క మీద పడ్డాను....

అది స్వభావసిద్ధమైన శబ్దంతో తన బాధను ప్రకటించింది.

## 2

కాకా నా కళ్ళలోకి చూసి నవ్వి, "అయితే నువ్వెందుకూ పనికిరావని మీ నాన్న తేల్చేశాడన్న మాట!" అన్నాడు.

"అవును కాకా!" అన్నాను ఆందోళనగా.

కాకాతో నాకు చాలా కాలంగా పరిచయం వుంది. నాకంటే పదేళ్ళు పెద్దవాడు. చాలా గౌరవం గల మనిషి.

అతను మళ్ళీ నవ్వి అన్నాడు, "నువ్వు అప్రయోజకుడి వనీ, సోమరిపోతువనీ, మానవజాతికి చెందినవాడివి కావనీ ఆయన అసహ్యించుకుంటున్నాడన్న మాట!"

"అవును కాకా!"

కాకా నవ్వుతూ నా అవతారం పరిశీలించసాగాడు.

"నిజంగా ఈ వేషం మార్చుకోవాలని లేదా నీకు?"

అడ్డంగా తలూపి చటుక్కున అన్నాను: "నా జీవితంలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన గోవా విహార యాత్రలో నేను మిగుల్చుకున్న ఒకే ఒక్క స్మృతికి చిహ్నం—ఈ వేషం. దీన్ని విసర్జించను!"

"వేషంలో వెధవలా ఉన్నా భాషమాత్రం గుబాళిస్తోంది! హా. హా!"

"అదే నన్ను మనిషిగా గుర్తింపజేస్తోంది-అలా నవ్వకు!"

"ఆల్ రైట్, రాకేష్! నువ్వు నా ఆర్గనైజేషన్‌లో చేరితే ప్రయోజకుడ్ని చేసేయగలను. సమ్మతమేనా?"

"ఆర్గనైజేషన్ ఏమిటి కాకా? నువ్వు మిరపకాయల టోకు వ్యాపారం చేసేవాడివి కదా?" అడిగాను తికమకగా.

కాకా పెద్దగా నవ్వేశాడు. నవ్వాపుకొని నమ్మిన బంటుని కేకేశాడు.

మరుక్షణం పక్క గదిలోంచి ఒక పొట్టి మనిషి వచ్చాడు. అతన్ని గుర్తుపట్టాను. కాకా వ్యాపారంలో సహాయంగా ఉండేవాడు. పేరు గయారామ్.

"వస్తాద్ కాకా! యెందుకు పిల్చావు?" కీచుమన్నా డతను.

కాకా అన్నాడు: "ఈ హిప్పీని చూడు! గుర్తించావా?"

రామ్ ఆశ్చర్యంగా నన్ను చూశాడు.

"అరె, వస్తాద్ కా....కా....కా .... మేశ్వరరావు గారి కుమారుడు కదూ? రాకేష్! ఏమిటీ దుర్దశ!"

"దుర్దశ కాదు రామ్! ఒంటి దురద!" కాకా చెప్పాడు "ఇప్పుడు మిస్టర్ రాకేష్ ప్రయోజకుడ్ని కావాలని మన దగ్గరికి వచ్చాడు. ఇతనికి మన ఆర్గనైజేషన్‌లో ఆశ్రయం ఇవడం మన ధర్మం."

"కానీ కాకా, ఆ వ్యాపారం ఎందుకు మానేశావు?" అడిగాను.

కాకా తేలిగ్గా నవ్వేశాడు. "ఎంత దాచినా మిరప కాయల ఘాటు గాలి వాటానికి కొట్టుకుపోక మానదు కదా?"

"సరె, ముందు నీ ఆర్గనైజేషన్ యేమిటో చెప్పు!"

కాకా ఆలిండియా అనౌన్సర్‌లా అయిదు నిమిషాల్లో క్లుప్తంగా వివరించాడు: విని విస్తుపోయాను.

"అంతకంటే నువ్వు ప్రయోజకుడివి కాలేవు." కామెంట్ చేశాడతను.

"నీకు వేషం మార్చడం ఇష్టం లేదు. తండ్రితో బిజినెస్ చెయ్యాలని లేదు. పైకి చదవాలని లేదు. ఉత్తినే తిరగాలనీ లేదూ, తిని కూర్చోవాలనీ లేదు."

లేదని తలూపాను.

"వెరీగుడ్. అయితే నీకు ప్రయోజకుడ్ని కావాలని వుంది. అది ఫలానా రంగంలో కావాలని లేదు.మంచైనా

చెడైనా, న్యాయమైనా అన్యాయమైనా నిమిత్తంలేదు. ఏదోక మార్గంలో ప్రయోజకుడివి కావాలి. అంతేనా? అయితే నా ఆర్గనైజేషన్ గురించి ఆలోచించు! నేను చెప్పిన ప్రపోజిషన్ యెలా వుందో చెప్పు?"

కాకా మాటలు విని ఆలోచనల్లో పడ్డాను.

అతను నుళ్ళీ అన్నాడు: "నీలాటి హిప్పీకి—మానసిక పీడితుడికి—ప్రయోజకుడ్ని కావాలన్న ఆలోచన రావడం చాలా సంతోషకరం. అయితే అది మంచి పనుల ద్వారా ముందు సాధ్యంకాదు. క్రమంగా నువ్వు వాస్తవప్రపంచం లోకి దిగివచ్చేవరకు మంచి చెడు విచక్షణాజ్ఞానం వుండదు. కాబట్టి ముందు చెడ్డ పనులే చేస్తావు. కంగారుపడకు! నేను చెప్పిన ఆలోచనలో ఎంత పరమార్థముందో నీకిప్పుడే అవగాహన కాదు. ప్రతి మంచిలోనూ చెడు వున్నట్లు—ప్రతి చెడులోనూ మంచి వుంది. నువ్వు చెడ్డపనులు చేస్తూ కూడా మంచివాడిగా చెలామణి కావచ్చు. అదృష్టం కలిసి వస్తే అందరిచేత పూజింపబడవచ్చు...."

కాకా ఫిలాసఫీ అర్థంగాక, "ఎలా? అనడిగాను.

"నా ఆలోచన ద్వారా నువ్వు ఆర్జించే దానిలో నీకు తోచినంత మేరకు ఈ దేశంలో దారిద్ర్యాన్ని రూపుమాపే ప్రయత్నాన్ని చెయ్యి!"

"అంటే—దాన ధర్ముడిని కావాలా?"

"అవును. నీకు హాజీ మస్తాన్ తెలుసా? స్మగ్లర్ గా ఎన్ని చెడ్డ పనులు చేసినా మంచిపనులు చాలా చేశాడు."

"కావచ్చు. కానీ—నేనంత భారీ యెత్తుకు ఎదగను కదా ప్రజలచేత పూజింపబడడానికి? పైపెచ్చు ఖర్మ కాలితే పోలీసులచేత దండింపబడవచ్చు!"

కాకా ఇబ్బందిగా చూశాడు. "ఓ. కే., రాకేష్!

నా ఆలోచన అంగీకారమైతేనే తిరిగి కనపడు. ఇక వెళ్ళు!" అని లేచి లోనికెళ్ళిపోయాడు—

అది ప్రైవేట్ రూం, ఇతరులకు ప్రవేశంలేదని బోర్డు వుంది.

కాకా ఖరపకాయల బిజినెస్ దెబ్బకొట్టడంతో మత్తు మందుల స్మగ్లింగ్ లో దిగాడు. సిటీలో మత్తుమందులకు యువత ఇప్పుడిప్పుడే అలవాటు పడతోంది. ఇంకొన్నాళ్లు పోతే ఇక్కడకూడా బొంబాయి, మద్రాసుల్లో లాగ అండర్ గ్రౌండ్ క్లబ్బులూ, హిప్పీల స్థావరాలూ వెలిసే- అవకాశం లేకపోలేదు.

కాకా వ్యాపారం ఇప్పుడు సిటీలో బాగా వ్యాప్తి చెందినట్టు అతని మాటలద్వారా తెలుసుకొన్నాను. బొంభాయినుండి మత్తు పదార్థాలు విరివిగా సరఫరా అవుతున్నాయి. కాకా అడపాదడపా బొంబాయి వెళ్ళివస్తున్నాడు. సరుకు రవాణా చాలా సులభంగా జరుగుతోంది. స్థావరం కూడా రహస్యంగా ఏర్పాటు చేశాడు.

లాల్ బహదూర్ స్టేడియం వెనుక మారుమూల ఏకాంతంలో ఉన్న ఒక బిల్డింగ్ లో జూబ్లీ ట్రాన్స్ పోర్టు కంపెనీ ట్రక్కులు బొంబాయి—హైద్రాబాదుల మధ్య తిరుగుతుంటాయి. వాటిలో సరుకు చెక్ పోస్టుల కళ్ళబడకుండా రవాణా అవుతోందింతవరకూ.

కాకాకు ముఠా అంటూ ఏమీ లేదు. అతని నమ్మిన బంటు గయారామ్ తో, పార్ట్ నర్ షణ్ముగంతో వ్యవహారాలు స్వయంగా చూసుకుంటున్నాడు.

ఇవన్నీ ఆలోచించాక అతని ప్రపోజిషన్ తిరస్కరించాలనిపించలేదు. మూడు నెలలు గోవా వాతావరణానికి అలవాటిపడ్డ నాకు, ఇంతకంటే మరోవిధంగా ప్రయోజకు

డ్నయ్యే మార్గం ఎలా కనిపిస్తుంది?

మర్నాడు అతనికి నా అంగీకారం తెలిపాను.

అతను షేక్ హాండ్ ఇచ్చాడు. "వెరీగుడ్! రాకేష్, నువ్వు ఒప్పుకొంటావని నాకు తెలుసు! ఇక చిటికెలో నువ్వు చకచక మెట్లెక్కేసి ప్రయోజకుడివై పోతావు!"

ఆ సంతోషంలో కాకా నాకు టీ తాగించి, నా విధులు వివరించాడు. వాటి ప్రకారం నేనతని ఆర్గనైజేషన్‌లో బిజనెస్ ప్రమోటర్ని. కాలేజి కుర్రాళ్ళనూ, అమ్మాయిలనూ మత్తు పదార్థాలకు అలవాటుచేసి, యువతరాన్ని చెడగొట్టడం నా ముఖ్యమైన విధుల్లో ఒకటి.

అంతేగాక, కొన్ని ముఖ్యమైన నైట్ క్లబ్బులు, మొగల్ రూమ్స్ వంటి ప్రదేశాలకు వెళ్ళి అమ్మకాలు బాగా పెరిగేలా చేయాలి.

ఆ తర్వాత కాకా నన్ను గోడవున్‌కు తీసికెళ్ళి పార్ట్‌నర్ షణ్ముగంతో పరిచయం చేశాడు. అతని తమిళ యాస వినలేక నా చెవులు గోలపెట్టాయి. గోడవున్ నిండా బేలుపెట్టెలు, డ్రమ్ములు, గోనెసంచులూ మొదలైనవి వున్నాయి.

మరో గదిలోంచి క్రిందకు వెళ్ళే అండర్‌గ్రౌండ్‌లో సరుకు వుంది. కాకా రకరకాల పదార్థాలు చూపించి వాటి పేర్లూ, రుచులూ, ప్రభావమూ వివరించాడు.

"అదీ సంగతి! రేపటినుంచి నువ్వు కాలేజిల చుట్టూ తిరగాలి. జాగ్రత్త! త్వరపడి ఎవరినీ మచ్చిక చేసుకోకూడదు! ముందు ముఖాలు బాగా స్టడీ చెయ్యాలి-అమ్మాయిల విషయంలో ఇంకా జాగ్రత్తగా వుండాలి! మూడు నెలలు హిప్పీలమధ్య గడిపినవాడివి—స్వతహాగా నువ్వూ ఓ హిప్పీవి—నీకు అలాటి లక్షణాలు గలవాళ్ళని వల్లో

వేసుకోవడం కష్టం కాదనుకుంటాను....”

కాదని తెలూపాను.

“వెరీగుడ్! రేపు రంగంలో దిగి నీ సామర్థ్యం చూపించు!”

కాకా అలా సవాలు చేశాడు. దాంతో నా పౌరుషం పెరిగింది.

మర్నాడు ఉదయం సరిగ్గా తొమ్మిది గంటలకు నారాయణగూడ గర్ల్స్ కాలేజి కెళ్ళాను. నా రాకపోకలు, ప్రవర్తన నాన్నకు మరింత అనుమానం కల్గించాయి. నిల దీసి అడిగితే ఏదో కాంట్రాక్టు చేస్తున్నట్టు చెప్పాను.

ఆ రోజు కాలేజిదగ్గర నన్నెవరూ ఆకర్షించలేదుగానీ, నేను అందరినీ ఆకర్షించాను.

నా వాలకం, వేషం అందరికీ వినోదం కల్గించాయి. ఆ వినోదంలోంచి ఆనందం పుట్టుకొచ్చి నన్ను తమాషా పట్టించారు. కొందరు నా జుత్తుపీకారు. మరికొందరు బెల్టు వూడదీశారు....మరికొందరు దానితోనే నా వీపు వాయించారు. వ్యవహారం అలా బెడిసికొట్టడంతో అక్కడనుంచి కాలికి బుద్ధి చెప్పాను.

జరిగింది విని కాకా నన్ను తిట్టాడు. నేను మరో ఛాన్సు ఇవ్వమన్నాను.

అలా కాదని కాకా ఆ రాత్రి బొంబాయినుంచి ఒక పార్టీ వస్తున్నట్లు, హోటల్‌లో రహస్య సమావేశ ముందనీ, తను ఫోన్ చేసిన వెంటనే రమ్మనీ చెప్పాడు.

## 3

సరిగ్గా రాత్రి తొమ్మిది గంటలకు ఫోను మ్రోగింది. నెమ్మదిగా లేచి రిసీవరందుకొని పేరు చెప్పాను.

అవతల నుంచి షణ్ముగం పలికాడు: "హలో రాకేష్! అర్జెంట్ మాటర్! నువ్వు తక్షణం హోటల్ మయూర్ కెళ్ళు! నేనూ కాకా పదకొండు తర్వాత వస్తాం. అక్కడ సీక్రెట్ కాన్ఫరెన్సు ఉంది. అర్థమైందా?"

"అర్థమైంది."

"ఆ హోటల్లో నాకో గది వుంది. నువ్వు రిసెప్షనిస్ట్తో ఈ కోడ్ చెప్పు—రూం కీ ఇస్తాడు."

"ఏం చెప్పాలి?"

"జాగ్రత్తగా విను! నువ్వు టేబుల్ మీద చిన్నగా రెండు దెబ్బలు వెయ్యాలి. అతను టైమెంతని అడుగుతాడు. నువ్వు చెప్పాలి. అతను మళ్ళీ రేడియో టైమేనా అనడుగుతాడు. కాదు రైల్వే టైమని నువ్వు చెప్పాలి. ఓ..కే.?"

"ఓ.కే!"

"వెరీగుడ్! వెంటనే వెళ్ళి మా కోసం ఎదురుచూడు!"

ఈ మాటలతో లైను కట్ కావటంతో చాలాసేపు అలాగే నిలబడిపోయాను. నాకేమీ పాలుపోలేదు. షణ్ముగం మాటలేమిటో, ఈ వ్యవహారమేమిటో ఏమీ అర్థంగాలేదు.

పైగా నా మానసిక స్థితికూడా అస్వస్థంగా వుంది. సరిగ్గా తొమ్మిదిన్నరకు బయలుదేరి హోటల్కు చేరుకున్నాను. రిసెప్షన్లో జనం పల్చగా వున్నారు. కౌంటరులో గోడ్గోలర్లా ఉన్న వ్యక్తి నన్ను వింతగా చూశాడు.

నేను దగ్గరికెళ్ళి టేబిల్ మీద రెండు దెబ్బలు వేశాను. అతను ఉలిక్కిపడిచూసి, వెంటనే సంబాళించుకున్నాడు.

"టైమెంత?"

"తొమ్మిదిన్నర!"

"రేడియో టైమేనా?"

"నా దగ్గర రేడియో లేదు, రైల్వే టైం!"

"నీ చేతికి వాచీలేదు, ఎలా చెప్తున్నావు?"

"వాచీ లేదు కాబట్టే రైల్వేటైం చెప్పాను."

అతను కీ తీసి విసిరాడు. దాన్నందుకొని వెనక్కి తిరిగి నడిచాను. "రూమ్ వన్—టూ—ఫోర్!" అర్చాడతను వెనుకనుంచి.

రూం 124 మూడవ అంతస్తులో చివర్న వుంది. గబ గబ నడిచి తలుపు తెరిచి లోనికెళ్ళాను. వెంటనే తలుపు మూసి కీ త్రిప్పాను. స్మగ్లర్లు! వాళ్ళెంత క్రూరంగా వుంటారో సినిమాల్లో చూశాను: జాగ్రత్తగా మెలగాలి.

గదిలో చీకటిగా ఉంది. లైటు వెల్గించి కాంతివంతం చేశాను. గదిలో వెచ్చటి గాలి బయటకెళ్ళడానికి వెంటి లేటర్ లేదు. ఊపిరి కష్టమయింది....కిటికీ తెరిచి ఫ్యాను వేశాను. ఆ తర్వాత గదిలో చుట్టూ చూపులు సారించాను.

అప్పుడు కన్పించింది___బెడ్ మీద___

నా గుండె అదిరి, గిరుక్కున తిరిగి చుట్టూ చూశాను. గదిలో ఎక్కడా కదలికలేదు, శ్వాసలేదు. ఫ్యానుగాలి శబ్దం తప్ప అంతా నిశ్శబ్దం.

తేరుకొని ఒక్క దూకులో బాత్ రూం తలుపుదగ్గరి కెళ్ళి చెవులు రిక్కించాను___సవ్వడిలేదు. చేత్తో చిన్నగా తలుపు నెట్టాను.

లోపల ఎవరూ లేరు....

కానీ నేల తడిగా వుంది. టాప్ నుంచి ఒక్కొక్కచుక్క నీళ్ళు పడుతున్నాయి. డ్రైనేజి రంధ్రం దగ్గర సబ్బు నురగ ఉంది. షవర్ క్రింద రెండుమూడు పొడవాటి వెంట్రుకలున్నాయి. గదిలో టవల్ గానీ, దుస్తులుగానీ

లేవు.

సాలోచనగా వెనక్కి తిరుగుతోండగా హఠాత్తుగా ఫోను మ్రోగి నన్నదరగొట్టింది.

రిసీవర్ ఎత్తి చెవి దగ్గర పెట్టుకున్నాను.

"రాకేష్!" షణ్ముగం అర్చాడు, "నువ్వు చేరుకున్నావా?"

కుదుటపడి, "చేరుకున్నాను...." అన్నాను.

"గుడ్! మేం కాన్సేపట్లో వచ్చేస్తాం!"

"మంచిది—కానీ—"

"ఏమిటి?"

"నేను రాకముందు ఈ గదిలో ఎవరున్నారు?"

"నా గదిలోనా! ఎవరుంటారు! గది తాళం నా దగ్గర ఉంది!"

"రిసెప్షన్‌లో డూప్లికేట్ ఉంది...."

"ఏమిటి నువ్వనేది, రాకేష్!"

"జాగ్రత్తగా విను! నన్నాకట్టుకునేందుకు నామీద ఆడవాళ్ళను ఉసిగొల్పకు!"

"ఏమిటీ! నీకు మతి చెడింది! నీమీద నేను ఆడవాళ్ళను—హే భగవాన్! నేను బ్రహ్మచారిని! ఆంజనేయుడి భక్తుడ్ని!"

"అయితే ఇక్కడ బెడ్ మీద లేడీ హాండ్‌బాగ్ ఎలా వచ్చిందంటావ్?"

"హాండ్ బ్యాగా! ఎవరిది?"

"నీకు తెలుసు!"

"నీకు పిచ్చెక్కింది!"

"సరే, ఆమె ఎవరో కాస్సేపట్లో రావచ్చు. నీసంగతేమిటో ఆమె ద్వారానే కక్కిస్తాను!"

"నువ్వా బ్యాగును మాశావా?" అసహనంగా అర్చాడతను.

"మరింక దేన్ననుకున్నావు? నీ బొమ్మను చూశానా!"

"సోర్యూయి! ఆ బ్యాగును తెరిచి చూశావా?"

"లేదు!"

"చూడు!"

"అలాగే! లైనో ఉండు!"

ఫోను పెట్టి, బెడ్ దగ్గరికి నడిచాను. జాగ్రత్తగా హాండ్ బ్యాగు నందుకొని జిప్ లాగాను. అందులో రెండు హెయిర్ క్లిప్పులు, చిన్న అద్దం, లిప్ స్టిక్, ఫేస్ పౌడర్, కర్చీఫ్, సన్నటి తీగచుట్ట. ఒక రోల్డుగోల్డు గుండీ ఉన్నాయి.

తిరిగి ఫోన్ ఎత్తి బ్యాగులో ఏమున్నాయో చెప్పాను.

"అయోమయంగా వుంది! నా గదిలో కెవరొస్తారు?" అన్నాడతను.

నా మెదడులో ఓ మెరుపు మెరిసింది.

"మాన్! నువ్వు సీక్రెట్ సమావేశం ఏర్పాటు చేశావు! ఒకవేళ ఆమె ఎవరో మైక్రోఫోన్స్ ఏర్పాటు చేయడానికొచ్చిందేమో?"

"హిప్పీ! నీ మెదడును మ్యూజియంలో పెట్టాలి! ఎలా కనిపెట్టావు?"

"ఆ బ్యాగులో చిన్న గుండీ, తీగచుట్ట ఉన్నాయి.... అయితే ఎన్ని గాడ్జెట్స్ తెచ్చిందో తెలియదు. వాటి నెక్కడ పెట్టిందో తెలియదు. ఆమె తీరిగ్గా స్నానం చేసి బ్యాగు మర్చిపోయేంత హడావుడిలో యెందుకుపడిందో అసలు తెలియదు! నేను బగ్స్ గాలించి నీకు ఫోన్ చేస్తాను—"

ఫోను పెట్టేసి గదిలో వేగంగా గాలింపు ప్రారంభిం చాను.

టీపాయ్ క్రింద, టేబిల్ క్రింద, బెడ్ క్రింద, పూల కుండీల్లో, సీలింగ్ ఫానుమీదా....ప్రతిచోటా క్షుణ్ణంగా వెతికాను. ఎక్కడా మైక్రోఫోన్స్ కన్పించలేదు. ఒక వేళ ఆమె కంగారులో ఆ పని చేయలేదనుకొన్నాను: ఆమె ఈ ఒక్కటే మైక్రోఫోన్ తెచ్చి ఉండాలి.

చాలా సేపు సిగరెట్ తాగుతూ, కిటికీలోంచి చుక్కల్ని చూస్తూ గడిపాను. గంట గడిచినా ఎవరిజాడ లేదు. నాకు ఆవులింతలు ప్రారంభమై లైటార్పేశాను.

మసక చీకటిలో డ్రెస్సింగ్ మిర్రర్‌లో నా అవతారం చూసి భయపడ్డాను.

బెడ్‌మీద వాలి కళ్ళు మూసుకున్నప్పుడు నాకింక తెరువ బుద్ధికాలేదు.

ఉన్నట్టుండి మెలుకువ ఎందుకొచ్చిందో తెలియదు. కళ్లు తెరిచి చూస్తే చిమ్మచీకటి! కాస్సేపటివరకు నాకేమీ కన్పించలేదు.

ఇంతలో ఏదో చప్పుడు విన్పించింది....ఎవరో వూపిరి పీలుస్తున్న సవ్వడి. నా రక్తం చల్లబడింది. గదిలో ఎవరో ఉన్నారు!

తటాలున లేవబోయాను. కానీ నా భుజంమీద బల మైన హస్తం పడి వెనక్కి తోసింది. తిరిగి వెల్లకిలా పడ్డాను.

"ఆగు మిస్టర్!" ఒక స్వరం పలికింది—బుల్‌డోజర్ శబ్దంలా.

కొయ్యబారిపోయి అలాగే ఉండిపోయాను. ఆ గొంతు మళ్ళీ అంది:

"భయపడకు! నిన్నేమీ చెయ్యను! నన్నెవరో వెంటాడుతున్నారు.... చాలా దూరం పరిగెత్తి వచ్చాను. నువ్వు లేవకుండా, లైటు వెయ్యకుండా అలాగే ఉంటే, కాసేపట్లో వెళ్ళిపోతాను."

నాకేమీ తోచలేదు. ఎవరతను? ఏమిటీ దబాయింపు? ఆ చీకట్లో కనీసం ఆకారం కూడా కన్పించడం లేదు.

ఊపిరి బిగించాను-కొన్ని క్షణాల తర్వాత నా కాళ్ళ మీద బరువుగా ఏదో వచ్చి పడింది.... వెచ్చగా, మెత్తగా స్పర్శ తాకింది. దాని క్రిందనుంచి కాళ్ళను వెలికి లాగుతూ పైకి జరిగాను. వణుకుతున్న చేతులతో కాళ్ళను ముట్టుకొని చూశాను. వెచ్చగా, జిగురుగా ఏదో తాకింది. వాసన చూశాను—

హఠాత్తుగా నా గుండె పనిచెయ్యడం మానేసింది....

నా కాళ్ళదగ్గర ఎవరిదో శవం పడి ఉంది!

విసురుగా ఎగిరి నా ప్రత్యర్థి మీద దాడిచేయబోయాను.

"ఆగు!" మళ్ళీ అరుపుతోబాటు ఈసారి నల్లగా మెరుస్తూ గొట్టంలాంటి వస్తువు కన్పించింది.

నేను దాన్ని గుర్తించే లోపున నా తలమీద గట్టిగా దెబ్బపడింది. నేను మొండిగా ముందుకు దూకి చేతులు గాల్లోకి విసిరాను. ఏమీ అందలేదుగానీ—మరో దెబ్బ తలమీద పడింది.

బెల్లుకమ్ముతోన్న నా కళ్ళకు తెల్లటి గ్లోవ్స్ తొడుక్కున్న చెయ్యి—ఆ తర్వాత నల్లటి చీకటి కన్పించాయి.

## 4

తిరిగి కళ్ళు తెరిచినపుడు గదిలో చాలామంది హడావుడిగా తిరుగుతూ కనిపించారు. నేను పూర్తిగా తెలివిలోకి రావడానికి అయిదు నిమిషాలు పట్టింది.

నా ప్రక్కన ఒక ఇన్ స్పెక్టర్ నిలుచుని వున్నాడు. మరో ఇన్ స్పెక్టర్ బెడ్ మీద అడ్డంగా పడివున్న ఆకారాన్ని చూస్తున్నాడు. మరికొందరు నిపుణులు గదిలోని వస్తువుల్ని క్రిందా మీదా చేస్తున్నారు.

"గుడ్!" ఇన్ స్పెక్టర్ మంచినీళ్ళందించి అన్నాడు. "ఇక కులాసేనా?"

నీళ్ళుతాగి తలూపాను. ఇన్ స్పెక్టర్ నా రెక్క పుచ్చుకొని పైకి లేపాడు. "నీ వాలకం చూస్తే హిప్పీలా వున్నావు. హిప్పీలకు బయభక్తులుండవు. తెలివితప్పుతూ యెందుకలా కేక పెట్టావు?" అడిగాడతను.

"నాకు—నాకేమీ తెలియదు!" గొణిగాను అయోమయంగా.

"మరి అతన్నెవరు చంపారు?"

"తెలియదు."

"అతనెవరో తెలుసా?"

"తెలియదు-చూసి చెప్తాను." బెడ్ దగ్గర కెళ్ళి ఆగాను. శవం బోర్లా పడివుంది. కాళ్ళు నా వైపు వేలాడుతున్నాయి. తల అవతలివైపు వుంది. వీపు మీద కొంత భాగం పట్టు ఎర్రగా వుంది. ఆ మరకలో వెడల్పాటి గాయం కన్పిస్తోంది. బెడ్ అవతలికి వెళ్ళి వంగి చూశాను.

ఒక్క గావుకేక పెట్టి వెనక్కి దూకాను—అంతే—ఇన్ స్పెక్టర్ నా చెయ్యి పట్టుకొని ముందుకు లాగాడు. నా మరో చేతికి టీపాయ్ మీద బ్యాగ్ తగిలి దూరంగా పడింది.

ఇన్ స్పెక్టర్ నన్ను బలంగా పట్టుకొని నిలబెట్టాడు.
"ఎవరతను?"

"కాకా!"

"ఎందుకు చంపావు?"

"నేను చంపలేదు—ఎవరో తెచ్చి నామీద పడేశారు!"

"ఎవరు?"

"చీకట్లో కన్పించలేదు. అతని దగ్గర రివాల్వర్ ఉంది. చేతులకి గ్లౌవ్స్ తొడుక్కున్నాడు. బుల్ డోజర్—మీ రెప్పుడేనా బుల్ డోజర్ని చూశారా? దాని శబ్దం విన్నారా? అతని గొంతు అలాగే వుంది."

"నువ్విక్కడెందుకున్నావు?"

"షణ్ముగం రమ్మన్నాడు."

"అతనెవరు?"

"కాకా పార్ట్నర్."

"ఎక్కడవుంటాడు?"

"స్టేడియం వెనుక ట్రాన్స్పోర్టు కంపెనీ ఉంది — జూబ్లీ ట్రాన్స్పోర్టు."

"ఫోన్ నెంబర్?"

"100003."

"నీ పేరు?"

"రాకేష్కుమార్."

"అడ్రసు?"

"అశోక్నగర్లో వుంటాను, ఫోన్ నెం. 300086"

"వెల్, ఈ బ్యాగెవరిది?"

"తెలియదు."

"నీతోపాటెవరున్నారు—గర్ల్ఫ్రెండ్?"

"నో! గర్ల్ ఫ్రెండ్స్ని నేను చాలా గౌరవిస్తాను!"

"అయితే ఈ బ్యాగెలా వచ్చింది?"

"ఆమె ఎవరో నాకంటే ముందు వచ్చింది—"

"దేనికి?"

"ఆమె బ్యాగులో మైక్రోఫోన్ వుంది."

"ఓహ్, స్టాప్! ఈ గదిలోకూడా ఉన్నాయా? అవతల ఎవరైనా వింటూరు!"

"నాకు తెలియదు!"

"బాయ్స్! ఈ గదిని బగ్స్‌కోసం శ్రుణ్ణంగా గాలించండి! వెల్, మిస్టర్ రాకేష్, షణ్ముగం ఎక్కడున్నాడు?"

"తెలియదు."

"నిన్నెందుకు రమ్మన్నాడు?"

"చెప్పలేదు—వచ్చి మాట్లాడతానన్నాడు."

"ఓ. కే., మిస్టర్ డేవిడ్, షణ్ముగంని పిలవండి! వెల్, ఆమె యెవరో నిజంగా నీకు తెలియదన్నమాట?"

"షణ్ముగానికూడా తెలియదు, కాకా కూడా."

"ఎవరికీ తెలియని మనిషి ఇక్కడకెందుకొచ్చింది? మైక్రోఫోన్ అమర్చి మీ రహస్యాలు తెలుసుకోవడానికా? మీ రహస్యాలేమిటి?"

"షణ్ముగం నాతో ఏమీ చెప్పలేదు!"

"మీ వ్యవహారమంతా అనుమానాస్పదంగా వుంది!"

"మిస్టర్ నేశన్, షణ్ముగం నుంచి రెస్పాన్స్ లేదు." డేవిడ్ చెప్పాడు.

"ఐసీ! అయితే మీరు బయటకెళ్ళి ఈ గదిలోంచి ఎవరైనా వెళ్ళినట్లు చూశారేమో వాకబు చెయ్యండి."

"ఇన్‌స్పెక్టర్, ఇక నేను వెళ్ళనా?"

"నీతో చాలా పని వుంది—నువ్వు చాలా దాస్తున్నావు."

"హంతకుడి గురించి నాకేమీ తెలియదు!"

"అయినా నువ్వు మా కస్టడీలో వుంటావు. నీ గురించి హంతకుడికి తెలుసునేమో? నీ తలమీద మరో రెండు దెబ్బలు పడితే ఎలా వుంటుంది?"

"అతడు నన్ను కూడా చంపుతాడనుకోను!"

"చావు నీకు చెప్పి వస్తుందా?"

"మిస్టర్ నేశన్, అరగంట క్రితం ఈ గదిలోంచి లావుగా, పొట్టిగా ఉన్న మనిషి గాభరాగా బయట కెళ్ళినట్లు తెలిసింది...."

"వెరీవెల్! ఇంకెవరైనా వెళ్ళారా? ఒక యువతి-"

"నో యెవరూ చూడలేదు."

"దటీజ్ బాడ్! ఆ మనిషిని మనం ట్రేస్ చెయ్యాలి. మిస్టర్ రాకేష్, నీ ఆత్మకథ స్టేట్మెంట్లో యెక్కే-దాకా నువ్వు మాతోటే క్షేమంగా వుంటావు-సరేనా?"

# 5

హెడ్క్వార్టర్స్లో నన్ను అన్నివిధాలా ఇంట్రాగేషన్ చేసి—తృప్తిచెంది—అప్పుడు వదిలిపెట్టారు.

అప్పుడు సమయం రెండు గంటలవుతోంది. నాకు తిరిగి ఇంటికెళ్ళి ముసుగుతన్నాలని లేదు. నా గుండెను తొలిచివేస్తున్న అగ్ని కణాల్ని చల్లార్చుకోవాలి.

జీవితంలో నా ఆత్మీయుల్లో ఇద్దరి చావును చూశాను: పదిహేనేళ్ళ క్రితం మా తాతయ్య—ఇప్పుడు కాకా.

కాకా ఇక లేడు. అతని వీపులో ఆరంగుళాల బాకు నానుంచి అతన్ని ఆరడుగుల గోతిలోకి తోసింది. మారక ద్రవ్యాలలో నేను సృష్టించుకున్న మనోమాంద్యం కాకా లేని కారణాన నయం కాకపోయినా, అతనికా గతి పట్టించినవాడ్ని పట్టుకొని గోతిలోకి నెట్టకపోతే మనశ్శాంతి కూడా లేకుండా పోతుంది.

హంతకుడు ఏ వర్గానికి చెందినవాడో స్పష్టమవుతోంది. సాయంత్రం కాకా నాతో బొంబాయి నుంచి ఒక పార్టీ వస్తున్నట్లు చెప్పాడు. షణ్ముగం హోటల్ గదిలో కాన్ఫరెన్సు ఏర్పాటు చేశాడు. ఆ పార్టీ పెద్ద స్మగ్లింగ్ ముఠా. వాళ్ళు మరో పార్టీతో డీల్ చేసేటప్పుడు తమ ఉనికిని కాపాడుకొనే ప్రయత్నాలు చేయడంలో అసహజమేమీ లేదు. అందుకే హోటల్ గదిలో బగ్స్ ఏర్పాటు చేశారు. ఆ కాన్ఫరెన్స్‌ని రహస్యంగా రికార్డ్ చేసి, డబుల్ క్రాస్ ప్రమాదాన్ని నివారించడానికి ముందు జాగ్రత్త ఆయుధంగా వుంచుకోవాలనుకున్నారు.

అయితే కాన్ఫరెన్స్ జరగలేదు.

వింత వింత సంఘటనలు జరిగాయి—బయట ఎక్కడో వ్యవహారం బెడిసికొట్టిన పర్యవసానంగా కాకా నిర్జీవ శరీరం హోటల్ గదికి చేరింది.

షణ్ముగ అదృశ్యమయ్యాడు.—ఎక్కడికి?

శవం ఎవరి కంట బడకుండా హోటల్ కెలా చేరింది?

బ్యాగును మరిచివెళ్ళిన ఆ రహస్యమయ యువతి యెవరు? నన్ను బెదిరించిన బుల్‌డోజర్ గొంతు మనిషిని ఎలా పట్టుకోవాలి?

ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకలేదు—

అయితే ఒకటిమాత్రం నిశ్చయంగా తెలుసు: కాకా హత్య గోడవున్‌లో జరిగింది. షణ్ముగం నాకు రెండు సార్లు ఫోన్ చేసినప్పుడు కూడా గోడవున్‌లో నేవున్నాడు. అతనితోపాటు కాకా కూడా ఉంటాడు.

హత్య అక్కడ జరిగిందంటే—ఆ పార్టీతో కాన్ఫరెన్స్ కూడా అక్కడే జరిగి ఉంటుంది. అక్కడెందుకు

జరిగింది? హోటల్ గదిని యెందుకు మార్చుకొన్నారు? నేను బగ్స్ ఉన్నాయని చెప్పడంతో షణ్ముగం మనసు మార్చుకున్నాడా? ఆ బగ్స్ కారణంగానే వాళ్ళమధ్య వివాదం తలెత్తి పరిస్థితి హత్యకు దారితీసిందా?

ఏదేమైనా నేనొకసారి గోడవున్ కెళ్ళి చూడాలను కున్నాను.

పావుగంటలో అక్కడి చీకటి వీధిలో ఆటో దిగాను. నా గుండె వేగం హెచ్చింది. గోడవున్ ఇరవై అడుగుల దూరాన ఉందనగా—హత్య జరిగిన స్థలంలో అనధికారి కంగా ప్రవేశిస్తున్నానన్న భయంతో మెదడు మొద్దు బారింది.

గోడవున్ తలుపు తాళంవేసి లేదు, ఓరగా తెరిచి ఉంది. లోపల చీకటి.

జాగ్రత్తగా తలుపును కర్చీఫ్‌తో నెట్టాను. ఆతర్వాత లోనికెళ్ళి అదురుతున్న గుండెతో నిలబడ్డాను. కొన్ని క్షణాల తర్వాత తలుపు ప్రక్కన లైటు స్విచ్ ఉన్నట్లు జ్ఞాపకం వచ్చింది. మరుక్షణం లైటు వెలిగించాను.

వెలుతురు పరుచుకొన్న విశాలమైన హాలులో ట్రాన్స్ పోర్టు సరుకు చెక్కు చెదరకుండా కన్పించింది. చెక్క పెట్టెలు, గోనెసంచులు, డ్రమ్ములు వగైరా....

హాలులో లైటువల్ల ఆఫీసుగదిలో వస్తువులు అస్పష్టంగా కన్పిస్తున్నాయి. గబగబ ఆ గదిలోకెళ్ళి లైట్లు వేశాను.

హత్య అక్కడ జరిగిందని వాతావరణం చెపుతోంది- హత్యకుముందు చాలా పెనుగులాట జరిగింది. ఫైళ్ళూ కాయితాలూ నేలమీద పారేసి ఉన్నాయి. కుర్చీలు అడ్డంగా పడి ఉన్నాయి. టేబిల్ ఓ ప్రక్కకు జరిగి

పోయింది. గోడకు బిగించిన ప్లయివుడ్‌లో సరిగ్గా షణ్ముగం కూర్చునే స్థానంలో—అతని తల ఆనే చోట పొడవాటి గాటు కన్పిస్తోంది. బహుశ హంతకుడు అతని మీదకు దాడిచేసినపుడు గురితప్పి కత్తి ప్లయివుడ్‌ని చీల్చి ఉంటుంది.

టేబిల్ క్రింద చిన్న రక్తపుమడుగు, దాని పక్కనే అద్దం పగిలిన టార్చి కన్పించాయి. కర్చిఫ్‌తో టార్చి నందుకొన్నాను. ఎడమవైపు బార్లా తెరిచి ఉన్న కిటికీ లోంచి అవతల వీధి కన్పిస్తోంది. అదిరిపడ్డాను. ఆ వీధిలో నన్నెవరైనా చూస్తే నిండా మునిగిపోతాను!

తటాలున లైటార్పి కిటికీ దగ్గరకెళ్ళాను. తల బయట పెట్టి వీధిలో చూశాను. ఎవరూ లేరు.

వెంటనే బయట నేలమీద టార్చి వేశాను. అస్పష్టమైన పాద ముద్రలు కన్పించాయి....అక్కడే తెల్లగా మెరుస్తూ చిన్న స్టీలు స్పూను కూడా కన్పించింది.

అదెవరిది?

మరుక్షణం అవతలకి దూకి, దాన్ని కర్చిఫ్‌తో అందుకొని చూశాను. దానిమీద H S R అని అక్షరాలు చెక్కి ఉన్నాయి.

ఎవరిది? ఈ పేరు షణ్ముగానిదా? వీటిలో మధ్య అక్షరం అతని పేరు సూచించినా, ఒక మామూలు టీ స్పూనుమీద ఎవరూ పేర్లు చెక్కించుకోరు!

అయితే వీటిని ఎవరు, యెందుకు చెక్కారు? ఆ అవసరం ఎవరికి ఉంటుంది?

సమాధానం క్షణంలో దొరికింది—నేనో హిప్పీ కావటంవల్లా, హోటల్ పద్ధతులతో అనుభవం ఉండటం వల్లా—అంతేగాక ఆ హోటల్ పేరేమిటో కూడా కని

పెట్టేశాను!

HOTEL SEA ROCK.

అయితే ఆ స్కూటరు అక్కడికెందుకు వచ్చిందో అర్థం గాలేదు—అసలు పార్ట్‌నర్ షణ్ముగం! యెక్కడున్నా డిప్పుడు?

వెంటనే ఆ స్కూటరుతో హోటల్ కెళ్ళి ఆరా తీయా లన్న ఆత్రుతను అణుచుకున్నాను. నా మెదడులో మరో అనుమానం ప్రవేశించింది—స్మగ్లర్లు ఇక్కడ దౌర్జన్యం జరిపి గోడవును కూడా దోచుకున్నారా?

ఈ అనుమానంతో తటాలున లోనికి దూకి అండర్ గ్రౌండ్ రోకి పరిగెత్తాను. లైటు వెలిగించి నిశ్చేష్టు డ్నయ్యాను. ఖాళీ! అనుకున్నట్లే వాళ్ళు సరుకంతా దోచుకుపోయారు!

భారంగా నిట్టూర్చి వెనక్కి తిరిగాను. అప్పుడే వూహిం చని సంఘటన ఒకటి జరిగింది: హఠాత్తుగా లైటారిపోవ డంతో నేను తటాలున ముందుకు దూకి వేగంగా మెట్లె క్కడం, అంతలో పైన ఒక భారీ కాయం నన్ను గట్టిగా ఢీకొనడం, నేను గిర గిర తిరుగుతూ మెట్లమీంచి వచ్చి నేలమీద పడడం...క్షణాల్లో జరిగిపోయాయి.

## 6

కళ్ళు నులుముకొని చూశాను. చీకటి! అంత యెత్తు నుంచి క్రిందపడ్డంవల్ల తల గట్టిగా నేలకు కొట్టుకొంది.

చిన్నగా మూల్గి లేచి నిలబడ్డాను. చీకట్లో యేమీ కన్పించలేదు.

ఇంతలో ఒక స్వరం పలికింది! "మిస్టర్ రాకేష్!" నా ఒంటిమీద తేళ్ళూ జెర్రులూ ప్రాకాయి! అదే కంఠం-బుల్‌డోజర్ శబ్దం.

"నువ్వు మా దారికి అడ్డు తగులుతున్నావు. నీలో భయం పుట్టించి మానుంచి దూరంగా తరమడానికే నీ మీద శవం పడేశాను. కానీ—నువ్విప్పుడు హిప్పీవిగాక కోతి వన్నించుకుంటున్నావు! నీకు సరైన స్థానం ఇదే!"

ఆ తర్వాత వేగంగా అడుగులు పైకి వెళ్ళిపోతూ విన్పించాయి. నేను తేరుకొని విసురుగా మెట్లెక్కి ఉరుకుతూ గొంతు చించుకుని అర్చాను, "యూ బాస్టర్డ్! వెలుతుర్లో నీ ముఖం చూపించడానికి సిగ్గుపడుతున్నావెందుకు!"

సమాధానంగా గది ప్రతిధ్వనించింది: ఒక్క బుల్లెట్ ప్రేలిన శబ్దం బాంబుపడ్డ శబ్దాన్ని సృష్టించింది.

హతాశుడై నిలబడిపోయాను. కొన్ని క్షణాలో తేరుకొని నేను చీకటికూపంలో బందీనయ్యానని గ్రహించాను. ద్వారం దగ్గర రాతిపలక మూసుకుపోయింది!

క్రిందికి దిగివచ్చి సిగరెట్ వెల్గించాను. ఏం చెయ్యాలో చాలాసేపటివరకు తోచలేదు. టార్చిని ఆఫీసులో వదిలినందుకు తిట్టుకున్నాను.

ఇప్పుడు రాతిపలకను తొలగించడం సాధ్యంకాదు! అలాగే కాంక్రీటు సీలింగ్ పగలగొట్టడం కూడా! గోడల్ని త్రవ్వవచ్చు. కానీ ఆ మార్గం ఎక్కడికి తీసికెళ్తుందో అనూహ్యం.

ఆ క్షణంలో నాకు చావుభయం పట్టుకొంది. బోనులో పడ్డ ఎలుకలా అటూ ఇటూ తిరిగాను. గాలి చొరని ఈ చీకటి గదిలో కొన్ని గంటలు గడిపితే చాలు—మృత్యువు దానికదే వచ్చి గట్టిగా హత్తుకుంటుంది....

అప్పుడే చెనుటలు కక్కటం ప్రారంభించాను. నాకు తెలియకుండా నా నోటినుంచి విచిత్ర శబ్దాలు వెలు

వడసాగాయి. ఒళ్ళంతా చెమటలు కారుస్తూ భరింపరాని వాసన వేస్తోంది!

ఉన్నట్టుండి నా కళ్ళముందు నేను చేయబోయే ఈ దిక్కుమాలిన మృత్యుయాత్రకు నాందిపలికిన గోవాయాత్ర ఆ తర్వాత నా పతనం భీకరదృశ్యాలుగా తిరుగుతూ వెక్కిరించసాగాయి....

దానితో నాకు పిచ్చెక్కినట్లయి చుట్టూ పరిగెత్తాను. చేతుల్ని గాల్లోకి వూపాను. ఎగురుతూ గంతులేశాను. కాలికి తగిలిన ఏదో వస్తువునందుకొని విచిత్రంగా అర్చాను. దానితో గోడ దగ్గరికి పరిగెత్తి — దాన్ని తీసుకొని—నా శక్తికొద్దీ త్రవ్వడం ప్రారంభించాను.

త్రవ్వుతూ .... త్రవ్వుతూ .... ఎంతదూరం వెళ్ళానో తెలియనే లేదు! ఎంత సమయం గడిచిందో కూడ తెలీదు! ఇంతలో నా చేతిలో వస్తువు కేదో ఖణేలుమని తగలడంతో ఆగిపోయాను.

ఆయాసంతో వగరుస్తూ సిగరెట్ ముట్టించాను. అంత ఉన్మాదంలోనూ నా మెదడు చురుగ్గా పనిచేయడం ఆశ్చర్యంగా ఉంది. వెంటనే అగ్గిపుల్ల వెల్గించి చూశాను. నా మార్గాని కడ్డుగా పునాదిరాళ్ళున్నాయి!

అవక్కడ కెందుకొచ్చాయో అర్థంకాలేదు. గోడవున్ కాంపౌండులో మరో ఇల్లువుండే అవకాశం లేదు. ఆవైపు వీధి వుండాలి. ఆలోచించుకుంటూ రాయిని తొలగిస్తోంటే నా చేతులు తడవటం ప్రారంభించాయి. రాయిని పూర్తిగా తీసి క్రిందపడేశాను.

అంతే—చివ్వుమని నీళ్ళు చిమ్మి నా బట్టలు తడిసి పోయాయి! ఒక్కసారిగా దుర్వాసన కొట్టింది!

నా గుండెలో రాయి పడింది. ఆవైపు డ్రైనేజి కాలువ పారుతోంది! వెనక్కి తిరిగి గదిలోకి పరిగెత్తాను. కానీ అదెంత మూర్ఖత్వమో వెంటనే గ్రహించాను. ఆ అంతు లేని ప్రవాహంతో గది నిండడానికీ, నేను జలసమాధి కావడానికీ ఎంతో సమయం పట్టదు!

చటుక్కున జేబుల్ని తడుముకున్నాను. స్పూను వున్న కర్చీఫ్ని తీశాను. నాకింకా ప్రాణంమీద ఆశ చావడం లేదు! అగ్గిపుల్ల గీసి గదిలో వేగంగా గాలించాను. ఒక మూల పాలిథిన్ కవరు దొరికింది. దానిలో స్పూను పెట్టి తిరిగి కర్చీఫ్లో చుట్టి జాగ్రత్తగా జేబులో పెట్టుకున్నాను.

మురికినీళ్ళు వేగంగా గదిలోకి చిమ్ముతున్నాయి.

నేను కన్నందగ్గరికి వెళ్ళి నాకు సరిపడే మేరకు రాళ్ళు తొలగించి, ప్రవాహానికి తట్టుకొని ఎదురీదడానికి శక్తిని కూడదీసుకున్నాను. కళ్ళు గట్టిగా మూసుకొని, ఆ కుళ్ళు నీటిలో తలపెట్టి, రెండు చేతులతో ప్రక్కరాళ్ళను పట్టుకొని పైకెగిరాను.

కెనాల్లో మోకాళ్ళలోతు నీళ్ళు పారుతున్నాయి. దాని శబ్దానికి నా శరీరం జలదరించింది. వెచ్చటి దుర్గంధంతో కూడిన గాలికి వూపిరి కష్టమయింది.

అయినా శక్తినంతా కూడదీసుకొని మాన్యూహోల్ పాయింట్ కోసం నీళ్ళను చిమ్ముకుంటూ పరిగెత్తసాగాను. కెనాల్ గోడలు అయిదడుగుల ఎత్తు వున్నాయి. వంగి ఉరుకుతూ చేతులతో పైకప్పును తడమసాగాను.

చివరికి ఒకచోట పాయింట్ తగిలింది. భారంగా నిట్టూర్చి, మూతలేపి బయటికి వస్తున్నప్పుడు నా వొంట్లో సత్తువంతా చచ్చిపోయింది....

ఈ అనుభవంతో నేనిక లక్ష్యాన్ని సాధిస్తానన్న నమ్మకం పోయింది. విపరీతంగా ఆందోళనపడ్డాను. ఘరానా స్మగ్లర్ల చేతిలో ఇప్పుడు నా ప్రాణాలకు ప్రతి క్షణం ప్రమాదం ఉందన్నది భయపెట్టింది. కాకా ఆత్మకు శాంతి చేకూర్చలేనేమోనన్న శంకతో మనసంతా అల్ల కల్లోలమైంది....

# 7

కాకా నమ్మినబంటు గయారామ్ నన్ను కంగారుగా చూసి, "ఏమిటి రాకేష్?" అన్నాడు.

"కాకా చచ్చిపోయాడు!" అన్నాను.

రామ్ నోరు తెరిచాడు, కానీ మాట పెగలేదు.

"వింటున్నావా? కాకా చచ్చిపోయాడు! అతన్ని చంపి వాళ్ళు హోటల్లో నా మీద పడేశారు! సాయంత్రందాకా బొంబాయినుంచి ఒక పార్టీ వస్తున్నట్లు చెప్పాడు. వాళ్ళెవరు? నీకు తెలుసా?"

రామ్ కళ్ళు విశాలమయ్యాయి "సర్దార్!" అరిచాడతను. "సర్దార్ అలా చేశాడా! లేదు, రాకేష్, లేదు! అతనలా చేయడు! చాలా మంచివాడని...."

"నువ్వు నోర్మూయి! వాడెక్కడుంటాడు?"

"ఎందుకు? నువ్వక్కడికి వెళ్తావా? వద్దు రాకేష్! పోలీసులకి చెప్పేయ్!"

"ఓహ్, నువ్వొత్త దద్దమ్మవి! సర్దార్ ఎక్కడుంటాడో చెప్పు!" అరిచాను గట్టిగా.

రామ్ భయంగా చూశాడు.

"ఆదెవరికీ తెలియదు, అతని అనుచరులకి తప్ప! నాలుగేళ్ళ క్రితం బాగా పేరుపొందిన సినీనటి చిత్ర నీకు తెలుసా? ఇప్పుడామె మత్తుమందులు తిని సర్దార్కు బానిసయ్యింది!

అతనెక్కడుంటాడో ఆమెకు తెలుసు."

"సరే, ఒక లావాటి పొట్టిమనిషి — బుల్ డోజర్ చప్పుడులాటి గొంతు—అతనెవరో నీకు తెలుసా?"

"తెలియదు!"

"షణ్ముగం ఇక్కడికి కొచ్చాడా?"

"లేదు."

"ఇంట్లో లేడు—ఎక్కడికి కెళ్ళాడో తెలుసా?"

"తెలియదు!"

"సరే—నీ దగ్గర కత్తి ఉంటే ఇలా ఇవ్వు!"

"దేనికి!"

"షటప్! చెప్పినట్టు చెయ్యి!"

రామ్ లోనికి ఉరికి కత్తి తెచ్చాడు. దాన్నందుకున్నాను. ఆ తర్వాత పెరట్లోకెళ్ళి రెండు బకెట్ల నీళ్ళు నెత్తిమీద గుమ్మరించుకున్నాను. రామ్ నన్ను విచిత్రంగా భయంగా చూస్తోంటే; నేను గుడ్ నైట్ చెప్పి బయటికి నడిచాను.

సినీనటి చిత్ర ఖైరతాబాదులో ఒక అద్దె యింట్లో వుంటోంది. అక్కడికి చేరడానికి ఇరవై నిమిషాలు పట్టింది. ఇల్లు చీకటిగా వుంది. ఇంటిముందు గూర్ఖా లేడు. ఇంట్లో ఇదివరకటి వైభవం లేదు. చేజేతులా ఆమె భవిష్యత్తును పాడు చేసుకుంది.

గేటు ఎక్కి లోనికి దిగాను. లోపల ఒక కారు వుంది. అది ఆమెది కాదు.

మేడమీద ఒక గదిలో లైటు వెలుగుతోంది. మిగతా ఇల్లంతా చీకటి. అర్ధరాత్రిపూట ఇంట్లో పరాయి కారు ఎలాంటి అర్థాన్ని సూచిస్తుందో నాకు తెలిసినా— అందుకు భిన్నంగా నా మెదడులో తళుక్కున ఓ మెరుపు

మోసింది: హోటల్ హాండ్ బ్యాగు జ్ఞాపకం వచ్చింది. ఆ బ్యాగు మాజీనటి చిత్రదేనా?—అక్కడ మైక్రోఫోన్స్ ఏర్పాటు చేసింది ఆమేనా?

నా రక్తం పరుగులు తీసింది. వేగంగా యింటికేసి వురికాను. ముందు తలుపు తెరిచే ఉంది. శబ్దంగాకుండా జొరబడి గబగబ మేడమెట్లెక్కాను. పైన గది చేరుకొని తలుపు చాటున నిలబడ్డాను.

లోపల లైటు వెలుగులో కుర్చీలో కూర్చొని వున్న మంచి సౌష్టవం గల పాతికేళ్ళ యువకుడు కన్పించాడు. అతనెదురుగా మంచంమీద చిత్ర కూర్చొనుంది. ఆమె అసహనంగా చేతులు నలుపుకుంటూ, బిత్తర చూపులు చూస్తోంది.

కొన్ని క్షణాలు గడిచాక అందామె: "కుమార్! ఇక సర్దార్ నన్ను క్షమించడు! నన్ను నమ్ము. నువ్వు తప్ప నన్నెవరూ నమ్మరు! నామీద నీకు చాలా నమ్మకమూ, జాలీ వున్నాయికదూ కుమార్?

"అక్కడ కెళ్ళినప్పుడు నేనేమీ తిన్లేదు, తాగలేదు. పన్నెండు గంటలకి మీరింతా కాన్ఫరెన్స్‌కి అక్కడికొస్తారని చెప్పావు. నేను పది గంటలకే వెళ్ళి దాన్ని అమర్చాను—డ్రెస్సింగ్ మిర్రర్ వెనుక. మరొకటి అనవసరమన్పించింది. చాలా శక్తివంతమైనదని నువ్వే అన్నావు. ఆ పనయ్యాక నాకు స్నానం చేయాలన్పించింది. షవర్ బాత్ అంటే నేనెంత పడి ఛస్తానో, ఆ స్నానంచేసి ఎన్నాళ్ళయిందో నీకేం తెలుసు!"

కుమార్ సిగరెట్ నుసిరాల్చి, "నువ్వు చాలా దురదృష్టవంతురాలివి!" అని క్లుప్తంగా కామెంట్ చేశాడు.

"అవును, ఈ కొంపలో నాకు కన్నీళ్ళు తప్ప ముఖం

కడుక్కునేందుకో గ్లాసుడు నీళ్ళు దొరకవు!" అంది చిత్ర దుఃఖాన్ని ఆపుకునేందుకు యాతనపడుతూ. "అందుకే అక్కడ తెగించి స్నానం చేశాను! తనివితీరా ఆ సౌఖ్యం అనుభవించాను. ఇంతలో బయట అడుగులు, మాటలూ విన్పించడంతో ఆదరాబాదరా బట్టలేసుకొని తలుపుదగ్గర చెవులు రిక్కించాను. ఆ భయాన్ని వర్ణించలేను కుమార్! వాళ్ళెవరో నాకు తెలియదు. కాని మన క్లయింట్స్ అని అనుమానించాను. అయితే వాళ్ళెవరూ లోనికి రాలేదు! బయటనుంచే వెళ్ళిపోయారు.... వెంటనే నేను బ్రతుకు జీవుడా అనుకుంటూ పారిపోయి వచ్చేశాను. ఆ కంగారులో నా బ్యాగు నక్కడే మరిచిపోయాను!"

కుమార్ సిగరెట్ పూర్తిగా నలిపేసి, "ఈ మాటలు సర్దార్‌కు చెప్పు; చక్కగా వింటాడు" అని లేచి నిలబడ్డాడు.

"కుమార్!" చిత్ర ఛెంగున నిలబడింది, "నువ్వు కూడా ఇలాగే అంటావా? నిన్ను స్వాతి తమ్ముడికంటే ఎక్కువ చూసుకున్నాను."

"కానీ నేనేం చెయ్యను? ఈ రాకెట్‌లో బంధుత్వాలకు తావులేదు. అంతా సర్దార్ ఇచ్చే తీర్పుమీద ఆధారపడి ఉంది, పద!"

కుమార్ ముందుకు కదిలాడు.

చిత్ర అయోమయంగా చూసి అతన్ని అనుసరించింది. నేను స్తంభం చాటున నక్కి, వాళ్ళు బయటికొచ్చాక జాగ్రత్తగా అనుసరించాను: ఘోరమైన పొరపాటు చేశాను: అంత తెలివితక్కువ పొరపాటు నేనెప్పుడూ చేయలేదు. వాళ్ళు బయటికి వెళ్ళిపోయి తలుపుకు తాళం వేస్తోంటే లోపల నేనున్నాను ఆగమని ఎలా చెప్పాలి?

నన్ను నేను తిట్టుకొని వెనక్కి తిరిగి ఓ గదిలోకి దూరాను. అక్కడ కిటికీ తెరిచేసి బయటికి దూకాను. వడి వడిగా నడిచి ఇంటిముందుకొచ్చాను. వాళ్ళిద్దరు ఇంకా వరండాలోనే నిలబడి మాట్లాడుకుంటున్నారు. నేనొక్క క్షణం తటపటాయించలేదు! మొక్కలనానుకొని ఉన్న కారు దగ్గరి కురికాను. డిక్కీ తాళంవేసి ఉంది. ముందు నిరాశపడి, తర్వాత ఆలోచించకుండా వెనుక డోర్ తెరిచి ఫుట్ బోర్డుమీద వెల్లకిలా పడుకున్నాను. వాళ్ళు తప్పకుండా ఇద్దరూ ముందుసీట్లోనే కూర్చుంటారు కానీ, దారిలో ఎవరైనా వెనుకసీట్లో ఎక్కితే....

ముందుడోర్ తెరుచుకున్న శబ్దమైంది. వాళ్ళేదో మాట్లాడుకుంటూ ముందుసీట్లో కూర్చున్నారు. నిట్టూర్చాను! కుమార్ డ్రైవింగ్ సీట్లో వున్నాడు. కారు కదిలింది. కొంత దూరంలో ఆగింది. గేటు తెరుచుకున్న చప్పుడు— మళ్ళీ కారు బయలుదేరింది. గేటు మూసుకున్న చప్పుడు.

తర్వాత కారు స్టార్టయి వేగంగా వెళ్ళసాగింది. నేనలాగే కదలకుండా పడుకొని కత్తిని తడుముకున్నాను. కారు కుదుపులకి అది నా కడుపులో గుచ్చుకోకుండా తీసి చేతిలో పట్టుకున్నాను. కారు ఎటు వెడుతోందో తెలియదు. కొంత దూరం వేగంగా ప్రయాణించి హఠాత్తుగా వెలుతురు ఉన్నచోట ఆగింది.

"సర్దార్‌కు ఆపిల్ పళ్ళంటే చాలా యిష్టం...." కుమార్ అంటున్నాడు, "అతన్ని మస్కా కొట్టించాలంటే ఇదే మంచి ఉపాయం."

"వెళ్ళు!" అంది చిత్ర.

ముందుడోర్ తెరుచుకున్న శబ్దమైంది. కాస్సేపటి తరువాత వెనుకడోర్ తెరుచుకుంది. నా గుండె అదిరింది!

ఇంతలో ఒక ఆపిల్ బుట్టవచ్చి సీట్లో పడింది. తిరిగి తలుపు మూసుకుంది. అప్పుడు కుదుటపడ్డాను.

ఆ తర్వాత ప్రయాణమంతా ఎక్కడా ఆగకుండా సాగింది.

కారు కుదుపులకి ఒక్కో ఆపిల్ ఎగిరి నామీద పడు తోంటే, కత్తికి పనికల్పించి గమ్యం చేరేవరకూ నా కెపా సిటీకి సరిపడేన్ని పళ్ళు స్వాహా చేశాను.

చివరికి కారు ఒక బంగళాలో ఆగినట్టు గ్రహించాను. అప్పుడుగానీ మళ్ళా నేనెలాటి ప్రమాదంలో పడ్డానో తెలియలేదు! వాళ్ళు కారుదిగి పళ్ళకోసం వెనకడోర్ తెరిస్తే పట్టుబడతాను!

ఈ ప్రమాదాన్ని నివారించడానికి నేను రంగంలో దిగేలోగానే వాళ్ళు కారుదిగి నిలబడ్డారు.

"శంభూ! వెనుక పళ్ళబుట్ట వుంది, అందుకో!" కుమార్ అరిచాడు.

మరుక్షణం డోర్ తెరుచుకోవడం, ఒక పహిల్వాన్ నున్నటి గుండు పెట్టి తొంగిచూడ్డం, నాగుప్పెడు గుండె ఆగిపోవడం....అన్నీ జరిగిపోయాయి.

"కుమార్! ఇక్కడెవడో ఉన్నాడు!" కీచుమన్నా డతను.

"ఎవరు?"

"ఏమో!" పహిల్వాన్ వంగి నా కాళ్లు పట్టుకున్నాడు. ఈడ్చి తన్నాను. గిరగిర తిరుగుతూ దూరంగా వెళ్ళి పడ్డాడు. ఇంతలో ఇవతలి డోర్ తెరుచుకుంది.

"హల్లో! ఎవరది? ఓహ్, చిత్రా వీడు మనవెంట వచ్చాడేమిటి!" కుమార్ అరిచాడు.

నేను లేచి కూర్చున్నాను. అతనికి పళ్ళబుట్ట అందించి

కాదు దిగాను. ఇంటిలో వెనుకనుంచి పహిల్వాన్ నా చెయ్యిపట్టి లాగాడు.

"ఇక్కడి కెందుకొచ్చావ్! ఎవర్నువ్వు?"

అతన్ని విదిల్చికొట్టాను.

"నీతో మాట్లాడను! నన్ను సర్దార్ దగ్గరికి తీసి కెళ్ళు!"

అప్పుడు కుమార్ తెలివిలోకొచ్చి రివాల్వర్ తీశాడు. దాన్ని నాకు గురిపెట్టి చేతులెత్తమన్నాడు. పహిల్వాన్ నా జేబుల్లో వస్తువులన్నీ తీసుకున్నాడు.

"ఓహ్ కుమార్! ఇప్పుడు సర్దార్ నన్నేగాక, నీ పని కూడా పడతాడు!" అర్చింది చిత్ర.

"భయపడకు! అతని పని నేను పడతాను!" అన్నాను.

పహిల్వాన్ నన్ను ముందుకు నెట్టి నడవమని కసిరాడు.

# 8

స్మగ్లర్ సర్దార్ వయస్సు యాభై ఉంటుంది. ఆపిల్ పండులాంటి ముఖం. ఆంబోతులాంటి శరీరం. స్మగ్లర్ అనే సరికి అతను చాలా క్రూరంగా ఉంటాడని ఎవరైనా అనుకుంటారు గానీ, నాకలా అన్పించలేదు.

పహిల్వాన్ చేతిలో ఆపిల్ బుట్టను చూసి అతను సంతోషపడ్డాడు. నన్ను చూసి కూడా పట్టించుకోకుండా పహిల్వాన్ అందిస్తున్న పళ్ళను తనివితీరా తింటూ వాటి రుచిని పొగడసాగాడు.

చిత్ర భయం భయంగా చూస్తోంది. అయిదు నిమిషాలు గడిచాక కుమార్ చిన్నగా దగ్గి అన్నాడు: "సర్దార్, ఈ హిప్పీ మమ్మల్ని వెంబడించి వచ్చాడు. ఇతను కాకా మనిషని నా అనుమానం.."

సర్దార్ నెమ్మదిగా తలెత్తి నన్ను చూశాడు: "అవును, నువ్విక్కడికెలా వచ్చావ్!" అన్నాడతను చిరాగ్గా.

అంతవరకు ఆవేశం అణచుకుంటున్న నేను అతని మాటలకి రెచ్చిపోయాను. ముందుకి దూకి, అతని కంఠం పుచ్చుకొని అర్చాను.

"మా కాకాను చంపింది నువ్వే! నీ గొంతు పిసుకుతాను!"

సర్దార్ ఆపిల్ విసిరేశాడు. అతని బలిష్టమైన చెయ్యి నా చెంపను తాకింది. గిరుక్కున తిరిగి క్రింద పడ్డాను. ఇంతలో భళ్ళున ప్రక్క తలుపు తెరుచుకొని ఒక పొట్టి మనిషి వచ్చాడు. అతన్ని చూస్తూనే నా చెవుల్లో బుల్ డోజర్ కంఠం ధ్వనించింది.

మెరుపులా లేచి పిడికిలితో అతని దవడ కింద గుద్దాను.

"యూ మంకీ!" సర్దార్ అర్చాడు, "శంభూ! వాణ్ని కట్టి పడెయ్యి!"

శంభూ ముందుకు దూకాడు.

"ఆగు!" అతన్ని వారించి సర్దార్ వైపు తిరిగాను, "నువ్వు కాకాను చంపించావు—ఆ మనిషి చంపాడు! శవాన్ని నా మీద పడేశాడు. రెండుసార్లు చీకట్లో తారసపడ్డాడు. బుల్ డోజర్ చప్పుడులా అసహ్యంగా ఉంది గొంతు!"

"నువ్వు పొరబడ్డావు మైడియర్!" అన్నాడతను మృదువుగా.

"ఓహ్! గొంతుమార్చి మాట్లాడుతున్నాడు! సరే, సర్దార్, హోటల్ గదిలో పోలీసులకో బ్యాగు దొరికింది. అదెవరిదో తెలుసా? నీ బానిస చిత్రజ! ఆమెని మైక్రోఫోన్స్ అమర్చడానికి పంపావు కదూ? ఇప్పుడామె నీ మెడకు వురి బిగించింది—హ. హ.!"

సర్దార్ కలవరపడి చిత్రకు చూశాడు.

నేను పొట్టి మనిషివైపు తిరిగాను. "మిస్టర్! నువ్వు గొంతు మార్చి నటిస్తున్నావు. సరే, గోడవున్‌లో షణ్ముగాన్ని వెంబడిస్తూ నువ్వు కిటికీ దూకినప్పుడేం జరిగిందో తెలుసా? నీ జేబులోంచి చెమ్మా జారిపడింది!"

"చెమ్మా? అదెవరిది?"

"నీది! దానిమీద నీ వేలిముద్రలుంటాయి—"

సర్దార్ కల్పించుకొన్నాడు: "వెల్ మై బాయ్! పరిస్థితి పూర్తిగా అర్థమైంది! రాకేష్, నువ్వు నన్నూ—నా నిజాయితీని చాలా అపార్థం జేసుకొంటున్నావు. కాకాను మేం చంపలేదు. శ్రద్ధగా విను.

కాకా 12 గంటలకు హోటల్ గదిలో కాన్ఫరెన్స్ ఏర్పాటు చేశాడు. అంతకుముందే చిత్ర వెళ్ళి మైక్రోఫోన్స్ అమర్చింది. సరిగ్గా 12 గంటలకి ఈ పొట్టిమనిషి-జోగిందర్—అక్కడికి కెళ్ళాడు. కానీ....ఆ గదిలో తెలివితప్పి వున్న నిన్నూ, చచ్చి పడివున్న కాకానూ చూసి వెంటనే తిరిగి వచ్చేశాడు."

"బుకాయించకు! కాకాను చంపి గోడవున్ దోచుకున్నావు! షణ్ముగంని వెంబడించావు. నన్ను చంపడానికి—"

"నీ వెధవ గోడవున్ కెవరూ వెళ్ళలేదు!" సర్దార్ అర్చాడు: "నువ్వు పిచ్చిగా వాదిస్తున్నావు! వాస్తవం నేను చెప్తాను: విను! హంతకుడు చీకట్లో రెండుసార్లు తారసపడ్డాడన్నావు—హోటల్ గదిలో మా మైక్రోఫోన్స్ ద్వారా అతని మాటలు రికార్డు అయ్యాయని వూహించావా?" అతను సొరుగులోంచి ఒక కేసెట్ తీసి టేబిల్ మీద పడేశాడు.

"హంతకుడి మాటలు ఇంగ్లీషులో వున్నాయి. నువ్వన్నట్లు అది బుల్ డోజర్ స్వరమే, కానీ అది జోగిందర్ కాదు! నువ్వింకేదో స్విచ్ గురించి చెప్పావు. అది మాకు సంబంధించింది కాదు. దాన్ని వేలిముద్రలు చెడకుండా ఈ టేప్ తో పాటు నువ్వు పోలీసులకివ్వవచ్చు—అభ్యంతరం లేదు. కానీ రాకేష్, ఈ రాకెట్ లో కొన్ని నీతి నియమాలున్నాయి. వాటిని నేనెంత గౌరవిస్తానో ఎన్ని జన్మలెత్తినా నీ దుడుకుతత్వంతో తెలుసుకోలేవు!"

నేనేం చెప్పాలో తోచలేదు!

సర్దార్ మరో సొరుగులోంచి నోట్ల కట్ట తీసి టేబిల్ మీద పడేశాడు, "కాకాతో మా వ్యవహారాన్ని అవకాశంగా తీసుకొని మూడో పార్టీ యెవరో అతనిమీద కక్ష తీర్చుకుంది. ఈ సిటీలో చాలామంది బ్రోకర్లున్నారు. వాళ్ళ వివరాలన్నీ నాకు తెలియకపోయినా, ఒక ముఖ్యమైన టిప్ ఇస్తాను—అక్కడికెళ్ళి నువ్వు బ్రోకర్ల గురించి భోగట్టా సంపాదించి అసలు హంతకుడ్ని పట్టుకో!...." అంటూ సర్దార్ గబగబా కాయితం మీద యేదో వ్రాసి నా కిచ్చాడు.

"వెంకటాచలం—హిమాయత్ నగర్ లో ఉంటాడు." అని అడ్రసు చెప్పాడు సర్దార్, "దట్సాల్ రాకేష్. ఇంతకంటే నేను సహాయపడలేను. ఈ బిజినెస్ లో నీకు డబ్బు అవసరం ఉంటుంది. ఈ రూపాయలుంచుకో!.... విష్యూ గుడ్ లక్!"

సర్దార్ విసిరిన కట్ట అందుకొని నిర్ఘాంతపోయి చూస్తుండిపోయాను. అతను నవ్వుతూ వెళ్ళిపోయాడు. నేను తేరుకొని టేబిల్ మీద టేపూ, కుమార్ అందించిన వస్తువులూ తీసుకొన్నాను.

ఇంతలో పహిల్వాన్ నా కళ్ళకు గంతలుకట్టి—ఏమిటని నేను అరుస్తోన్నా వినిపించుకోకుండా మోసుకెళ్ళి కార్లో ఎత్తేశాడు.

కారు స్టార్టయి చాలా దూరం వెళ్ళాక, తిరిగి నన్ను కార్లోంచి తీసి క్రింద పడేసి వెళ్ళిపోయాడు....

# 9

మర్నాడుదయం సరిగ్గా తొమ్మిది గంటలకు హిమాయత్ నగర్‌లో వెంకటాచలం ఫ్లాట్ కెళ్ళి బెల్ నొక్కాను.

"ఎవరు?" లోపలినుంచి అరుపు వినిపించింది.

"నేనే!" అన్నాను.

"నేనే—అంటే?"

"నేనంటే నేనే!"

తలుపు తెరుచుకుంది. పాతికేళ్ళ యువకుడు తల పెట్టి తొంగి చూశాడు, "ఏం కావాలి మీకు?"

"భోగట్టా కావాలి."

అతని ముఖం విచ్చుకుంది. తలుపు విశాలంగా తెరిచాడు. "రండి! యెలాంటి వసతి కావాలి? ఒంటరిగా ఉంటారా, ఫ్యామిలీ కూడానా? ఫ్యామిలీ అయితే దిల్‌సుఖ్‌నగర్‌లో నాలుగు చక్కటి ఇళ్లు చేతిలో ఉన్నాయి—"

"నా వేషం చూడు ముందు! నా కో యిల్లూ అడ్రసూ ఉంటాయన్పిస్తుందా నీకు. నాకు బ్రోకర్ల గురించి భోగట్టా కావాలి!" అన్నాను అతని మాటలేమీ అర్థంగాక.

అతను ఉలిక్కిపడి, "సారీ మిస్టర్! నేనిప్పుడు లైను మార్చేశాను," అన్నాడు.

"దేనికి?" అడిగాను.

"ఆ మధ్య నా జాతకం తిరగబడింది. ఒక కేసులో పోలీసులు నన్ను కోర్టుకు తోలుకునిపోయి ఓ బ్రోకర్‌కు వ్యతిరేకంగా సాక్ష్యం ఇప్పించారు. అప్పుడేం జరిగిందో తెలుసా? బ్రోకర్లంతా కలిసి నన్ను చాకలి రేవుకు తోలుకొనిపోయి బాగా ఉతికారు. నో మిస్టర్ నో.... నేనిప్పుడు శుభ్రంగా ఉన్నాను. మళ్ళీ ఆ మురికి అంటించు కోను!"

నేను సర్దార్ ఉత్తరం తీసి అతని కందించాను.

దాన్ని చదివి అతను ఉలిక్కిపడ్డాడు, "సర్దార్! అతను పంపించాడా?"

"అవును కొంత డబ్బుకూడా యిచ్చాడు." జేబు లోంచి నోట్లకట్టతీసి, రెండు భాగాలు చేసి, అందులో ఒకభాగం అతని ముందుంచాను.

"నాకు సహాయపడితే ఈ డబ్బు నీది. రాత్రి స్టేడియం వెనుక మా గోడవున్‌ని యెవరో దోచుకుని మా పార్ట్‌నర్‌ని చంపారు. మరో పార్ట్‌నర్‌ని మాయం చేశారో, లేక పారిపోయాడో తెలియదు. అలా యెవరు చేస్తారు? నీకు తెలిసిన బ్రోకర్లలో యెవరైనా—"

అతను వెంటనే అడ్డంగా తలూపాడు, "లేదు, లేదు! అలాంటి పని చెయ్యరు! ఇక్కడ బ్రోకర్లంతా కలిసి కట్టుగా వుంటారు. మరో ముఖ్య విషయం మిస్టర్ రాకేష్. ఏ పార్టీకీ మరో పార్టీ గోడవున్ యెక్కడుందో తెలియదు."

"అయితే యెలా దోచుకొన్నారు!" అర్చాను, "ఇప్పుడీ ఫీల్డులో మార్పులొచ్చాయేమో—నీకు తెలిసి ఉండదు. సర్వీసులైను మానేసి చాలా రోజులైంది. నీకు కొన్ని ఆధారాలు చూపిస్తాను. వాటిని చూసి ఏదైనా

చెప్పగలవా?"

"ఏమిటవి?"

"హంతకుడు నాకు చీకట్లో రెండుసార్లు తారస పడ్డాడు. లావుగా, పొట్టిగా ఉంటాడు....కంఠం బుల్ డోజర్ ధ్వనిలా ఉంటుంది. గోడవున్ దగ్గర నాకో హోటల్ స్పూను దొరికింది. అది అతనిదేనని నా అనుమానం—"

"హోటల్ స్పూనా?" మధ్యలో అడిగాడతను.

"అవును దానిమీద అక్షరాలు చెక్కి ఉన్నాయి. హోటల్ సీరాక్. కానీ ఆ హోటల్‌తో హంతకుడికి గానీ, ఈ హత్యకుగానీ సంబంధంలేదని తెలుసుకున్నాకే నీ దగ్గరకొచ్చాను."

"మిస్టర్ ఆ స్పూను యెవరిదనుకున్నావు?"

"ఎవరిది?"

"లాయర్ ప్రతాప్! నీకు తెలుసా? కానీ...."

"ఏమిటి?"

"అతని గొంతు — అది బుల్ డోజర్ శబ్దంలా ఉండదు...."

నా రక్తం పరుగులు తీసింది, "గొంతు సంగతి అలా ఉంచు. కమాన్ వెంకట్! ఈ స్పూను లాయర్ ప్రతాప్ దెలా అవుతుందో చెప్పు!"

అతను నిట్టూర్చి అన్నాడు: "ప్రతాప్ రావ్ — అతను పేరుకు లాయర్. చట్టాన్ని రక్షించడు. అందుకు వ్యతిరేకం. అందుకే అతన్ని కోర్టునుంచీ, బార్ అసోసియేషన్ నుంచీ బహిష్కరించారు. బ్లాక్ మార్కెటీర్ల నుంచి స్మగ్లింగ్‌లో దిగినవాళ్ళంతా సాధారణంగా అతని క్లయింట్స్ అయివుంటారు. చట్టం కళ్ళలో యెలా దుమ్ము కొట్టాలో

అతన్ని సంప్రదిస్తుంటారు. భారీ మొత్తాల్లో ఫీజులు ముట్టజెప్తుంటారు. నాంపల్లిలో అతనికి ఆఫీసు ఉంది.... నువ్వు స్పూను గురించి చెప్పావ్ గనుక అతను నా దృష్టికి వచ్చాడు. అంతే—నా టిప్‌కు గ్యారంటీ యివ్వలేను. నో మిస్టేక్: డబ్బు తిరిగి యివ్వబడదు!"

"ఆ స్పూను అతని దగ్గరికెలా వచ్చింది?"

ఫకాలున నవ్వాడతను. "ప్రతాప్‌కి హోటల్స్‌లో తిని స్పూన్లు దొంగిలించే దరిద్రపు అలవాటు ఉంది.... అదొక రకం మానసిక తృప్తి అనుకుంటాను. గోడవున్ దగ్గర ఆ స్పూను అతనే జారవిడిచి ఉండాలి పొర పాటున...."

అతని మాటలు వింటోంటే వెంటనే వెళ్ళి ప్రతాప్‌ని పొడిచెయ్యాలన్నంత కసి పుట్టింది. కాని తేలికబడ్డ మన సుతో ఆలోచించాను: అలా చెయ్యడం యెంతవరకు ఉచితంగా ఉంటుంది? ఆ పోటువల్ల అతను కొన్ని క్షణాలు, లేదా నిమిషాలు భౌతికంగా బాధ అనుభవించి ప్రాణాలు వదుల్తాడు. అలాగాక, దుర్మార్గుడిగా సంఘం నుంచి వెలివేయబడి యావజ్జీవితమూ జైల్లో మగ్గుతూ క్షణ క్షణమూ మానసికంగా హింస అనుభవిస్తూ ఉంటే నా మనసుకు తృప్తిగా ఉండదూ?

మరొక ఆలోచన వచ్చింది: ఈ హత్యకు ప్రతాప్ కారకుడు కాకపోవచ్చు. పరోక్షంగా అతని క్లయింట్ ప్రేరణ ఉండవచ్చు. అతన్నికూడా వెలుగులోకి లాగక పోతే నా లక్ష్యానికి పరిపూర్ణత యేర్పడదు.

అంతేగాక షణ్ముగం క్షేమం కూడా దృష్టిలో ఉంచుకోవాలి. అతడు కూడా హతుడయాడన్పించడం

లేదు. ఎక్కడైనా బంధింపబడి ఉండవచ్చు, లేదా.... పారిపోయి ఉండవచ్చు.

# 10

నేను చెప్పిందంతా విని ఇన్‌స్పెక్టర్లు ఆలోచనల్లో పడ్డారు.

కాస్సేపయ్యాక శివ నేశన్ ఏదో నిశ్చయానికి వచ్చి అన్నాడు:

"రాకేష్, ప్రతాప్‌ని హంతకుడిగా పట్టుకోవాలంటే ఈ ఆధారాలు పనికిరావు. అతని తెలివితేటలతో మా కనుభవముంది. అతని చేతిలో చట్టం నామరూపాల్లేకుండా పోతోంది. అనేక సందర్భాల్లో మాకు గాజులు తొడిగాడు. క్రూక్‌డ్ లాయర్! ఆ రాస్కెల్‌ని లోనికి తోయాలన్న మా ప్రయత్నాలన్నీ విఫలమవుతున్నాయి.

ఈ స్పూనుమీద అతని వేలిముద్రలుండవచ్చు. అయితే హత్యాస్థలంలో దాని ఉనికి గురించి అతను చెప్పే సంజాయిషీ, దాన్ని ప్లాంటెడ్ ఎవిడెన్స్‌గా కల్పించే పరిస్థితులూ మమ్మల్ని ఫూల్స్ చేసి నవ్వులపాలు చేస్తాయి.

అలాగే ఈ టేప్‌లో గొంతు అతనిది కాదు. అతని మనిషిది కావచ్చు. అతనెవరో మనకు తెలియదు. అతనెందుకు చెప్తాడు? ఆ స్వరం అతనిదే కావచ్చు! గొంతు మార్చి మాట్లాడాడేమో? ఒకే ఘటనలో ఇద్దరి పాత్ర అతకడంలేదు. స్పూను—స్వరమూ ఒక్కడివే!"

"అయితే ఇప్పుడేం చెప్తారు?" అడిగాను ఆశ్చర్యంగా.

నేశన్ అన్నాడు: "ఆధారాలు చూపించి అతనిమీద నేరం ఋజువుచేయడం చిన్నపిల్లాడి... మేం మరోసారి

నవ్వులపాలు కాదలచలేదు. నువ్వు అండర్ గ్రౌండ్‌లో చనిపోయావని అతనుకొంటున్నాడు. ఇప్పుడు హఠాత్తుగా నువ్వు ప్రత్యక్షమైతే ఏం చేస్తాడు?"

"అక్కడికక్కడే కాల్చి చంపేస్తాడు."

"అంతే. అలా కాల్చినప్పుడు నువ్వు నమ్మకంగా ఛస్తావ్ గనుక కాకాను చంపింనవరో, ఎందుకు చంపారో, చెప్పడంవల్ల అతనికి ప్రమాదమేమిటి?"

"ఏమీ లేదు."

"అదే మన ట్రాప్!" టేబిల్ మీద గుద్దాడు నేశన్, "కాబట్టి అతను చెప్పే ఆత్మకథంతా మేం మైక్రోఫోన్ ద్వారా రికార్డు చేస్తాం. ఆ విధంగా అతని క్లయింట్‌తో బాటు అతనూ మా వల్లో చిక్కుకుంటాడు. అలా అతను స్వయంగా కమిట్ అవ్వాలి. అర్థమైందా? నువ్వు చేయవల్సిందల్లా చావుకు సిద్ధపడినట్టు నటించి—నీ చివరికోరికగా అతన్నుంచి వివరాలు కక్కించడం! అప్పుడు షణ్ముగం జాడకూడా తెలుస్తుంది. ఏమంటావు."

వెంటనే తలూపాను.

"గుడ్! రాత్రి మేం రహస్యంగా అతని ఆఫీసులో ఏర్పాట్లు చేస్తాం. రేపుదయం తొమ్మిది గంటలకు నువ్వక్కడికెళ్ళు. భయపడకు! మేం బయట కారిడార్‌లో ఉంటాం. నువ్వేదేనా ఆపదలో ఇరుక్కుంటే తక్షణం ఆదుకుంటాం—ఓ.కే.?"

జేబులోంచి ఆరంగుళాల పొడవు కత్తి తీసి వాళ్ళకి చూపించాను.

"నాకేం భయంలేదు! ఈ కత్తి వాడి వీపులో దిగబడే ప్రమాదం రాకుండా జాగ్రత్తపడండి!" అన్నాను.

# 11

ఆ రోజు సర్దార్ ఇచ్చిన డబ్బుతో హోటల్‌లో గడిపి, మర్నాడు ఉదయం ప్రతాపరావు ఆఫీసుకు బయలు దేరాను.

సరిగ్గా 9 గంటలకు అతని ఆఫీసు కారిడార్‌లో నడుస్తోంటే, కాచుకొన్న ఇనస్పెక్టరు ఎక్కడా కనిపించ లేదు. రాలేదా? లోనికెళ్ళాలా? కాస్సేపు సందేహించి తలుపుతట్టాను.

"హూ ఈజిట్?" లోపలినుంచి అరుపు.

"మై నేమ్ ఈజ్ రాకేష్" అన్నాను నింపాదిగా.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం. సమాధానం లేదు. ఏం జరుగుతోంది? అతను హఠాత్తుగా తలుపుతీసి షూట్ చేస్తాడా—పబ్లిగ్గా?

తటాల్న తలుపు తెరిచి ప్రతాప్ తొంగిచూసి, "కమిన్!" అన్నాడు. అతని ముఖంలో ఎలాంటి భావాలూ లేవు! అతన్ని జాగ్రత్తగా గమనిస్తూ లోనికడుగు పెట్టడంతో ధడాలున తలుపు మూశాడు.

నేను టేబిల్ దగ్గర అటు తిరిగి కూర్చున్న మనిషిని చూసి, "మిస్టర్ ప్రతాప్, ఇది పర్సనల్ బిజినెస్. అతన్ని వెళ్ళమను!" అన్నాను.

"అవసరంలేదు" ఆ మనిషి పలికాడు తెలుగులో—తమిళయాసను మిళితం చేస్తూ, మెల్లిగా వెనక్కి తిరిగి పెదవులమీద విషం పులుముకొని నవ్వుతూ.

నా గుండెలో ఆర్డీబర్మన్ మ్యూజిక్, ఒంట్లో చల్లటి కూల్ డ్రింక్ రక్తం—రెండూ పోటీపడి నన్ను మమ్మీలా నిలబెట్టేశాయి!

షణ్ముగం! ఇతను—ఇతను—ఇక్కడికెలా వచ్చాడు?

ఇక్కడేం చేస్తున్నాడు?

"కమాన్, మైసన్! ప్లీజ్ సిడవున్."

స్లీప్ వాకర్‌లా నడిచివెళ్ళి అతని దగ్గర ఆగాను: "నువ్వు-నువ్విక్కడేం చేస్తున్నావు షణ్ముగం! ఆ ప్రతాప్ ఎవరో తెలుసా!"

షణ్ముగం నవ్వాడు, "వూరికే అలా అరవకు! నువ్వు నన్ను చాలా ఆశ్చర్యపర్చావు, రాకేష్! ఎలా బయట పడ్డావు?"

"ఏమిటీ!"

"నువ్వు అండర్‌గ్రౌండ్‌లో చచ్చావనుకున్నాను. కానీ ఇలా చెక్కు చెదరకుండా వచ్చి—నెవర్ మైండ్— చావుకీ సమయం వుంటుంది. అదే ఇప్పుడు నిన్నిక్కడికి రప్పించిందనుకొంటాను. ఫరవాలేదు!"

అప్పుడుగానీ అసలు మర్మం అంతుబట్టలేదు! కాకా హత్య వెనుక అసలు హస్తం ఈ షణ్ముగానిది! నేను కల్లోకూడా వూహించలేదు.

హఠాత్తుగా రెచ్చిపోయి పిడికిలితో అతని దవడక్రింద గుద్దాను. అతను కుర్చీతోసహా వెనక్కిపడ్డాడు.

నేను ముందుకు దూకబోయేంతలో ప్రతాప్ వెనుక నుంచి నా కంఠం పుచ్చుకొని లాగాడు. నా వూపిరాగి నట్లయి రెండు చేతులూ వెనక్కిపోనిచ్చి, ప్రతాప్ తల పట్టుకొని నా తల వెనుక బాదాను. అతను నన్ను వదిలేసి ముఖం పట్టుకొని గట్టిగా అర్చాడు.

షణ్ముగం మెరుపులా లేచి జేబులోంచి రివాల్వర్ తీసి గర్జించాడు:

"కమాన్! నో ఫైటింగ్, మైసన్!"

అప్పుడు నాకసలు కర్తవ్యం గుర్తుకొచ్చి కుదుట

పడ్డాను. ఈ దుర్మార్గుల చేత వాళ్ళ పాపాలు పలికించాలి!

"సరే — మీరిద్దరూ హంతకులు. కాకాను చంపి, నన్నుకూడా చంపాలనుకున్నారు. నేను చావలేదు. అండర్ గ్రౌండ్‌కి కన్నంవేసి హోటల్ స్పూనుతో నిన్ను వెతుక్కుంటూ ఇలా వచ్చాను!"

"ఏమిటి నువ్వనేది?" ప్రతాప్ అర్చాడు.

"హోటల్ స్పూను! హత్యాస్థలంలో దొరికింది! నువ్వు దాన్ని హోటల్‌లో తిని దొంగిలించావు! ఎన్ని స్పూన్లు దొంగిలించిన పాపమో — ఈ రోజు నీకిలా మూడింది! ఆ స్పూను ఇప్పుడు పోలీసుల దగ్గర ఉంది — దానిమీద నీ వేలిముద్రలున్నాయి!"

ప్రతాప్ ముఖంలో నెత్తురుచుక్క లేదు. షణ్ముగం కళ్ళు చిట్లించాడు.

నేను నవ్వి మళ్ళీ అన్నాను: "ఆల్ రైట్, ఇప్పుడు మీరు నన్ను చంపాలనుకుంటున్నారు. అది కష్టంకాదు. కానీ ఆ తర్వాత మీరు పడే కష్టాలు వూహిస్తే ఇప్పుడే ఆత్మహత్య చేసుకుంటారు. పోలీసుల దగ్గర ఒక టేపు వుంది — హోటల్‌లో నామీద శవాన్ని పడేసినప్పుడు మీ మనిషి నన్ను బెదిరించిన మాటలు అందులో రికార్డయ్యాయి. అక్కడ మైక్రోఫోన్స్ ఉన్నాయని చెప్పినా నువ్వు పప్పులో కాలేశావ్! ఆ టేపుతో పోలీసులు మీ మనిషిని ట్రేస్ చేయడం కష్టంకాదు. వాడు పొట్టిగా, నల్లగా, దున్నపోతులా ఉంటాడు —"

షణ్ముగం పకపక నవ్వాడు:

"నువ్వెంత ఫూల్‌వి! నేను పొట్టిగా, లావుగా ఉంటాను.... చూశావా? అయినా నా మీద నీ కనుమానం గాలేదు కదూ? నుట్టిబుర్ర! హోటల్‌లో, గొడౌన్‌లో

నీకు తారసపడింతెవరనుకున్నావు? పిచ్చివాడా! ఇందులో మరో మనిషెవరూ లేడు! హోటల్ గదిలో మైక్రో ఫోన్స్ ఉన్నాయని నాకు తెలీదనుకొన్నావా? అందుకే గొంతు మార్చి మాట్లాడాను—పైగా నువ్వు నా స్వరం గుర్తించవచ్చుకూడా! ఇప్పుడా టేప్‌తో పోలీసులెవర్ని పట్టుకుంటారు, మైసన్? హుష్ కాకీ!"

షణ్ముగం చప్పట్లుకొట్టాడు.

నా వొళ్ళంతా చెమటలు పట్టింది. "నువ్వెంత ద్రోహివి! కాకా నెందుకు చంపావ్?" అనర్చాడు.

"చెప్తాను. ఈ సైలెన్సర్ రివాల్వర్‌తో నువ్వు గుట్టుగా ఛస్తావ్ గనుక-చెప్పకపోతే నీ కెయ్యం నన్ను పీడిస్తుంది!" షణ్ముగం రివాల్వర్ గురిపెట్టి నా దగ్గరకొచ్చి మళ్ళీ నవ్వాడు.

"నో మిస్టేక్! ఈసారి నమ్మకంగా చంపుతాను! ఓ.కే? కాకాతో నాకు విభేదాలున్నాయి. ఎవరికుండవ్? మొదట నేను డబ్బుకాశపడి అతనితో చేతులు గలిపానుగానీ, ఈ బిజినెస్ అతనికంటే నాకే ప్రమాదం తెస్తుంది—కదూ ప్రతాప్? ఇందులో నా రిస్కు ఎక్కువ! గొడౌన్ నాది, సరుకు రవాణా నాది, సగం వాటా ఉంది. ఎప్పుడైనా రెయిడ్ జరిగితే నాశనమయ్యేదెవరు? నేను. ఎలా? ఈ బిజినెస్ ఒప్పందానికి సంబంధించిన పత్రాలేవీ లేవు గనుక! ఓరల్ పార్ట్‌నర్‌షిప్. మిస్టర్ ప్రతాప్ నాకు ఈ లా పాయింట్ గుర్తుచేసి కళ్ళు తెరిపించాడు. న్యాయంగా బ్రతికేవాడిని అనవసరంగా చెడిపోతున్నా ననిపించింది...."

"అందుకేం చేశావ్?"

"నాలాటి గౌరవంగల మనిషి యేం చేస్తాడు?

నా వాటా ముఖానకొట్టి గోడవున్ ఖాళీచేసి చెక్కేయ్యమన్నాను. అప్పుడతని అసలు స్వరూపం తెలుసుకొన్నాను! గాడ్—త్రాచుపాము!" షణ్ముగం గుండెల మీద చేతులు వేసుకొన్నాడు. "త్రాచుపాము, రాకేష్, సరిగ్గా అంతే! అదే పోలిక! బుసకొట్టి నన్ను కాటేయడానికి సిధ్ధపడ్డాడు! అరమొంధా? పోలీసులకు ఆకాశరామన్న ఫోన్ చేసి, నా గోడవున్‌లో మత్తు పదార్థాలున్నాయనీ హెచ్చరిస్తాడట. డబ్బు పోయినా ఫరవాలేదు. నాతో పార్ట్‌నర్‌షిప నిరూపించే కాయితాలేవీ లేవు గనుక తనకేమీ కాదుట! నేనంతా పోగొట్టుకొని జైలుశిక్ష అనుభవిస్తానట...ఓహ్!"

ఈ అరుపులతో షణ్ముగం నెర్వస్ అయిపోయి, కుర్చీలో కూలబడి తల పట్టుకున్నాడు.

ప్రతాప్ కల్పించుకొని అన్నాడు:—

"మిస్టర్ రాకేష్, షణ్ముగం తన సమస్య నా దగ్గర ఏకరువు పెట్టాక దానికి మర్డర్ తప్ప మరో పరిష్కారం నాకు తోచలేదు. కాకా నుంచి రెండు విధాలా ప్రమాదముంది. నా ప్రత్యేకత నీకు తెలీదనుకుంటాను. అహింసలో నాకు నమ్మకం లేదు. ఐ వాంట్ యాక్షన్! దానికెంత హింస జరిగినా సరే—నాకు లెక్క కాదు. నా గురించి పోలీసులకు బాగా తెలుసు. ట్రిక్స్ గురించి నాకూ బాగా తెలుసు.

"ఓ. కే. మొన్న బొంబాయినుంచి పరమ సాధువు స్మగ్లర్ సర్దార్ వస్తున్నాడనీ, అతనితో కాకా కొత్త కాంట్రాక్టు లేర్పరచుకుంటున్నాడనీ తెలిసి నప్పుడు రంగంలో దిగడానికది మంచి సమయమని చెప్పాను. ఆ రాత్రి బిజినెస్ కాన్ఫరెన్స్ కాకా కోరికమీద షణ్ముగం

హోటల్ మయూర్‌లో యేర్పాటు చేశాడు. అది 12 గంటలకు జరుగుతుంది—ఈ లోపు మేం రంగంలో దిగా లనుకున్నాం.

"అప్పుడు షణ్ముగం ఫోన్ చేసి గోడవున్‌కు రమ్మని చెప్పాడు—కాన్ఫరెన్స్‌కు ముందు కొన్ని వ్యక్తిగత విష యాలు మాట్లాడ్డానికి. కాకా యెనిమిది గంటలకు వచ్చాడు.

"ఆ సాయంత్రం నేను చోటా స్మగ్లర్ మిస్టర్ ఎక్స్‌కు ఫోన్ చేసి, కాకా గోడవున్‌కు కారు తీసుకుని 0 గంట లకు వస్తే అతి తక్కువ మూల్యానికి అపారమైన అదృష్టం కొనుక్కోవచ్చని చెప్పాను. రాస్కెల్ ఒప్పుకున్నాడు.

"ఎనిమిది గంటలకు షణ్ముగం, కాకా ఆఫీసు గదిలో మాట్లాడుకొంటున్నారు. అప్పుడు నేను షణ్ముగం తెరిచి సిద్ధంగా వుంచిన వీధి కిటికీలోంచి లోనికి దూకాను. బహుశ నూనెను అప్పుడే జారివుంటుంది. నన్ను చూసి కాకా బెదిరిపోయాడు. నేను రివాల్వర్ తీసి అతన్ని షూట్ చెయ్యబోయానుగానీ—అతను మెరుపులా లేచి నా చెయ్యి కొరికాడు.

ప్రతాప్ కుడిచేతిమీద చిన్న బ్యాండేజిని చూపిం చాడు.

"అప్పుడేం జరిగింది?" అడిగాను.

"రివాల్వర్ జారి పడింది! షణ్ముగం వెంటనే సొరుగు లోంచి కత్తి అందుకొని కాకా మీదకు దూకాడు. కానీ కాకా అతన్ని విసిరేశాడు. నేను రివాల్వర్ అందుకో బోతే డొక్కలో తన్నాడు. షణ్ముగం ఆ విసురుకు గోడకు గుద్దుకొన్నాడు. కత్తి పైవుడ్‌లో దిగబడింది. కాకా నా రివాల్వర్ తీసుకోకుండా అతని పొట్టలో

కుమ్మారు. అతను గట్టిగా మూల్గి టేబిల్ మీద బోర్లా పడ్డాడు—అంతే రాకేష్—అప్పుడు షణ్ముగం అతని వీపులో కత్తి దించాడు. చివ్వుమని....”

ప్రతాప్ కాకా చివరి క్షణాల్ని వర్ణిస్తున్నాడు. కాస్సేపు సహించాను. ఆ తర్వాత కళ్ళు మూసుకున్నాను.

“దట్సాల్ రాకేష్, కాకా అలా చచ్చాడు. తెలుసుకున్నావా? ఇక—ఇంతలో బయట కారాగిన చప్పుడైంది. ఛోటా స్మగ్లర్ రమ్మన్న సమయానికి ముందే వూడిపడ్డాడు! నేను బయటకెళ్ళి తిట్టి, అండర్ గ్రౌండ్‌లో సరుకు చూపించాను. అరగంటలో వాళ్ళు చీపురు కొట్టేసి వెళ్ళిపోయారు.

“అప్పుడు పథకం ప్రకారం శవాన్నక్కడ వదిలేసి పారిపోదామన్నాను. షణ్ముగం కొన్నాళ్ళు పరారీలో ఉంటే, హత్య గురించి తెలిసి పోలీసులు, నీ స్టేట్‌మెంట్‌తో బొంబాయినుంచి వచ్చిన స్మగ్లర్ యెవరో దానికి కారకుడనుకొంటారు. తర్వాత షణ్ముగం తిరిగి వచ్చి సర్దార్ పేరు చెప్తాడు. పరిస్థితులన్నీ సర్దార్‌కు వ్యతిరేకంగా తిరగబెడతాయి. కాన్ఫరెన్స్ హోటల్‌లో గాక గోడవున్‌లోనే జరిగింది. అతని మనుషులు కాకాను చంపి సరుకు దోచుకున్నారు.

“కాని షణ్ముగం అందుకు ఒప్పుకోలేదు.” ప్రతాప్ నిట్టూర్చాడు, “కాకా అంటే నీకు ప్రాణం. అతను ఛస్తే నువ్వూరుకోవు! అక్కడా యిక్కడా పుల్లలుపెట్టి తనకే ముప్పు తెస్తావని భయపడ్డాడు. ఆ ప్రయత్నానికి నువ్వు పూనుకోకుండా భయపెట్టి దూరంగా ఉంచాలనుకొన్నాడు. నేనేమీ చెప్పలేదు. అతను నీకు ఫోన్ చేసి హోటల్‌కెళ్ళమన్నాడు. కానీ కాన్ఫరెన్స్ ఎప్పుడో నీకు

చెప్పలేదు.

"నీకు 12 గంటలవరకూ ఎదురుచూస్తూ మేల్కొనుండడం విసుగుపుట్టి నిద్రపోతావు. ఈ అంచనాతో శవంతో నీ గదిలోకెళ్ళి మీద పడేయ్యాలనుకొన్నాడు. హోటల్ మేనేజర్ అతనికి కీలుబొమ్మ. శవాన్ని చేర్చడానికి డబ్బు ఆశ చూపించాడు. అలా 12 గంటలకు కొన్ని నిముషాలముందు శవం పడేసి వెళ్ళిపోతే, ఆ తర్వాత కొన్ని నిమిషాలకు వచ్చే జోగిందర్ ట్రాప్‌లో ఇరుక్కుంటాడు.

"అనుకున్నట్టే చేశాడు. నువ్వు అనుకున్నట్టే తేలావ్! హంతకుడి వేటలో గోడౌన్ దాకా వెళ్ళావ్! నిన్నిక వదలడం ప్రమాదకరమని అండర్ గ్రౌండ్‌లో ట్రాప్ చేసినట్టు చెప్పినప్పుడు నాకు చాలా జాలివేసింది...."

"నోర్మూయ్!" షణ్ముగం ఒక్కసారిగా లేచి అర్చాడు, "వీడింకా బ్రతికి వుండటానికి టైంలేదు! కాన్సేపట్లో డబ్బుతో ఛోటా స్మగ్లర్ వస్తాడు! వీడ్ని షూట్ చేసి దాచెయ్యాలి! నేను డబ్బుతీసుకొని మద్రాస్ వెళ్ళిపోతాను. నువ్వు వీడి శవాన్ని గోవా పంపే ఏర్పాటు చెయ్. అక్కడ నీ మనుషులు సముద్రంలో విసిరేస్తారు."

ఈ మాటలు చెప్పి షణ్ముగం విసురుగా రివాల్వర్ ఎత్తి ట్రిగ్గర్ లాగేశాడు! అది ముందే పసిగట్టిన నేను తటాలున టేబిల్ క్రింద మారి విచిత్రమైన అరుపుతో సిగ్నల్ ఇచ్చాను.

మరుక్షణం ఫెళ ఫెళమంటూ తలుపులు విరిగిపడ్డాయి. వాటితోబాటు ఇన్‌స్పెక్టర్లు కూడా పడ్డారు. ఇద్దరి చేతుల్లో రివాల్వర్స్ పేలాయి. సైలెన్సర్ రివాల్వర్ క్రిందపడింది. రెండు గావుకేకలు పెద్దగా విన్పించి, శరీరాలు నేలమీద

పడ్డాయి.

ఆ కేకల్ని నేను చెవులారా తృప్తిగా విన్నాను.

## 12

గాయాలు తగిలి మూల్గుతోన్న ఆ ఇద్దర్నీ అంబులెన్స్‌లో తోసి, ఇన్‌స్పెక్టర్లు నన్ను విష్ చేసి వెళ్ళిపోయాక శూన్యంలోకి చూస్తూ నిలబడ్డాను.

నా లక్ష్యం సాధించాను! కాకా ఆత్మకు శాంతి చేకూర్చాను! నా మనసు ఇప్పుడు తేలికగా, నిర్మలాకాశంలో తేలిపోతున్న మాదిపింజంలాటి మేఘంలా వుంది.... నేనిప్పుడు శాంతికి చిహ్నంగా సుమార్గమ్యాల్ని అన్వేషిస్తూ పయనించబోతున్న పావురంలాటి రాకేష్‌ని. కాకా మీద ప్రమాణం చేశాను: ఇప్పుడు నా స్వశక్తితో మంచి మార్గంలో ప్రయోజకుడ్ని అవుతాను.

భారంగా నిట్టూర్చి ఆలోచనల్లోంచి తేరుకున్నాను. ముందు ఈ వేషం విసర్జించాలి: అప్పుడు యింటి ముఖం పట్టాలి.

ఎదురుగా బార్బర్ షాపు కన్పిస్తోంది .... వడివడిగా నడిచాను.

—:ఐపోయింది:—

# చేతిలో కత్తి - మెడలో త్రాచు

## ప్రతాప రవిశంకర్

ఎర్రగా వుంది-వాలుజడ వేసుకుంది. జడ చివర ప్లాస్టిక్ క్లిప్ వుంది....తలలో వాడిపోయిన గులాబి పువ్వు నల్లగా కనిపిస్తోంది. చెవులకు ఎరుపురంగు గుండ్రటి దుద్దులు. నుదుటిమీద చిన్న తిలకంబొట్టు—కళ్ళనిండా కాటుక— ఆమె నీలంరంగు ఫుల్ వాయిలు చీర కట్టుకుంది. అదే కలరు బ్లవుజు వేసుకుంది. పాదాలకు నల్లటి చెప్పులు....భుజానికి పసుపురంగు లెదర్ బ్యాగ్ వేల్లాడుతోంది....

గేటుముందు నిలబడి లోపలకు చూస్తోంది.

ఆమె ఆ రోడ్డు చివరనించి ఒక్కొక్క ఇంటినీ జాగ్రత్తగా చూసుకుంటూ రావటాన్ని గూర్ఖా ఎప్పుడో చూశాడు. అందుకే ఆమె అక్కడ నిలబడి లోపలకు చూస్తుంటే "ఎవరు కావాలి?" అనడిగాడు.

"దేవరాజుగారి ఇల్లు ఇదే కదూ" అన్నది.

"అవును"

"ఆయన యింట్లో ఉన్నారా?"

"ఉన్నారు....ఇంకో గంట తర్వాత బయటకు వెళ తారు."

గూర్ఖా చెప్పగానే 'ఆయన్ని కలుసుకోవాలి' అని లోపలకు నడిచింది.

గూర్ఖా ఆమెనే చూస్తున్నాడు. ఆమె అతని దృష్టిని ఆకర్షించింది. ఆమె అందమయినది. ఎవరినయినా ఆమె అందం నిలబడి చూసేలా చెయ్యగలదు.

పూలమొక్కల మధ్యగా వుంది సన్నని దారి....రక రకాల మొక్కలు యెండలో చిన్నగా కదులుతున్నాయి వీస్తున్న గాలికి.

ఓవైపు కారు గ్యారేజ్.

వరండాలోకి వెళ్ళింది ఆమె. ఒక్క క్షణం అక్కడ నిలబడిన తర్వాత లోపల్నించి పనిమనిషి వచ్చింది.

"ఎవరు కావాలి?" అన్నది ఆమెను చూసి.

"దేవరాజుగారు."

"ఆ గదిలో కూర్చోండి. చెబుతాను."

లోపలకు వెళ్ళిపోయింది పనిమనిషి.

పనిమనిషి చూపించిన విజిటర్స్ గదిలోకి వెళ్ళింది.... రెండు సోఫాలు మధ్యన టీపాయ్ ఉన్నాయి. టీపాయ్ మీద యాష్ ట్రే ఓ దంతపు ఏనుగుబొమ్మ ఉన్నాయి.

సోఫాలో కూర్చుంది ఆమె.

గది గోడలకు రెండు ప్రకృతి వర్ణ చిత్రాలు ఉన్నాయి.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

భుజానికి ఉన్న బ్యాగ్ లోనించి కర్చీఫ్ బయటకుతీసి మొహాన్ని తుడుచుకుంది ఆమె.

అయిదు నిముషాలు గడిచాయి.

రోడ్డుమీద అప్పుడప్పుడు పరుగులు తీస్తున్న వాహ

నాల చప్పుడు వినిపిస్తోంది.

బయటకు చూస్తోంది ఆమె!

పనిమనిషి బయటకువచ్చి "అయ్యగారు లోపలకు రమ్మంటున్నారు" అని చెప్పింది.

లేచి నిల్చుని పమిటను సర్దుకుని గబగబా పనిమనిషి వెనుక లోపలకు నడిచింది. పనిమనిషి ఆమెను ఓ గదిలోకి తీసుకెళ్ళింది.

ఆ గదిలో ఉన్న ఇనుప కుర్చీలో దేవరాజు కూర్చొని వున్నాడు. ఆయనకు నలభై యేళ్ళు దాటి ఉంటాయి. జుట్టు అక్కడక్కడ నెరిసి ఉంది. కుర్చీలో వెనక్కువాలి సిగరెట్టు కాలుస్తున్నాడు.

ఆమెను చూడగానే "కమిన్ .... ఇలా కూర్చో" అన్నాడు తన ఎదురుగా ఉన్న కుర్చీ చూపించి.

నమస్కారంచేసి ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నదామె.

తర్వాత బ్యాగ్ తెరిచి ఓ అంటించిన కవరును బయటకు తీసి ఆయన చేతికి ఇచ్చి "గజపతిరావుగారు పంపించారు" అన్నది చిన్నగా.

దేవరాజు కవరును ఓ పక్క చించి అందులోనించి ఓ ఉత్తరాన్ని బయటకు తీశాడు.

'డియర్ దేవరాజు—ఈ ఉత్తరాన్ని తీసుకొచ్చిన ఈ అమ్మాయి పేరు మంగళ. నా దూరపు బంధువుల అమ్మాయి. బియ్యే చదువుతూ మధ్యలో ఆపేసింది పరిసితులవల్ల .... టైపు చెయ్యటం వచ్చు. ప్రస్తుతం కష్టాల్లో ఉంది. నీడను కోల్పోయింది. అందుకే నీ దగ్గరకు పంపుతున్నాను. ఏదయినా ఉద్యోగం చూపించు. మంచిమనిషి. ఇంతకంటే రాయటానికి ఏమీ లేదు. ఉంటాను మరి—

కృతజ్ఞతలతో—నీ గజపతిరావు'

దేవరాజు ఆ ఉత్తరాన్ని చదివి మంగళను చూశాడు.

ఆశగా అతని కళ్ళల్లోకి చూస్తోంది.

'అందమైన అమ్మాయి' అనుకున్నాడు ఆయన.

"ఎటువంటి ఉద్యోగం చేయగలవు?"

దేవరాజు ఉత్తరాన్ని మడిచి కవరులో వుంచుతూ అడిగాడు.

"మీ ఇష్టం సర్. ఎలాంటి ఉద్యోగమైనా చెయ్యటానికి సిద్ధంగా వున్నాను."

"టైపిస్టు ఉద్యోగం చెయ్యగలవా?"

"చెయ్యగలను సర్."

"ఎక్కడో కాదు. మా ఆఫీసులోనే. నాకు ప్లాస్టిక్ గూడ్స్ తయారుచేసే ఫాక్టరీ వుంది. నీ అదృష్టం.... రెండ్రోజుల క్రితమే టైపిస్టు సులోచన పెళ్ళిచేసుకొని ఉద్యోగం వదులుకుని వెళ్ళిపోయింది. ఇప్పుడా ఉద్యోగం ఖాళీగానే వుంది. నువ్వు అందులో చేరవచ్చు."

మరో సిగరెట్టును వెలిగించుకున్నాడు దేవరాజు.

"థాంక్స్ సర్" అన్నది కృతజ్ఞతగా మంగళ.

"సిన్సియర్‌గా వర్క్ చెయ్యాలి" అన్నాడు పొగను వదులుతూ.

తల వూపింది.

"ఎప్పుడొచ్చావ్ ఈ వూరు?"

"నిన్న రాత్రి."

"ఎక్కడ దిగావ్?"

"నాకు తెలిసిన ఓ విధవావిడ ఇంట్లో."

"అక్కడే వుంటావా?"

"లేదండీ....ఎక్కడయినా ఓ గదిని అద్దెకు తీసుకుందా మనుకుంటున్నాను."

"అనవసరం. నువ్వు ఈ ఇంట్లోనే వుండొచ్చు."

మంగళకు ఆయన మాటలు ఎంతో సంతోషాన్ని కలిగించాయి.

"థాంక్స్ సర్" అన్నది మళ్ళీ.

"నో థాంక్స్. నువ్వు ఎందువల్లనో నన్ను ఆకర్షించావు. మంచిదానివనిపించింది. నువ్వు ప్రతి విషయానికీ థాంక్స్ చెప్పవలసిన అవసరంలేదు. రోజూ నాతోపాటే కార్లో ఆఫీసుకు రావొచ్చు."

దేవరాజు సగంవరకు కాలిన సిగరెట్టును యాష్ట్రేలో పడేశాడు.

మంగళ ఉక్కిరిబిక్కిరయ్యింది. ఆమెకు ఆనందంతో మాటలుకూడా రాలేదు.

"అన్నట్టు నాకు భార్య—కూతుళ్ళు లేరు. ఈ ఇంట్లో వుండేది నేను నా కొడుకు నరేంద్ర .... ఈ రోజు నించి నువ్వు."

దేవరాజు ఆ మాటలు చెప్పగానే అప్పటివరకూ మంగళ మొహంలో వున్న సంతోషం ఎగిరిపోయింది. ఆమె మొహం అదోలా ఐపోయింది.

## 2

డి.ఆర్. ప్లాస్టిక్స్ ఆఫీసులోనించి బయటకు వచ్చింది మంగళ.

ఆమె ఎర్రటి చీర కట్టుకొంది. అదే రంగు బ్లౌజు వేసుకొంది. ఉదయం నించీ పని చెయ్యటంవల్ల ఆమె మొహంలో అలసట కనిపిస్తోంది.

రోడ్డు పక్కగా నడుస్తోంది.

సాయంత్రం కావటంవల్ల రోడ్డు రద్దీగా వుంది. ఆఫీసులు వదిలే సమయం. ఆటోలు రివ్వున పరుగులు దీస్తున్నాయి.

చల్లని గాలి వీస్తోంది. మంగళ పమిట గాలికి రెపరెపలాడుతూ ఎగురుతోంది.

తల వంచుకొని నడుస్తోంది. ఇంకొంచెం దూరం నడిస్తే బస్టాపు వస్తుంది. ఆమె తల వంచుకొని నడుస్తూ వుండటంవల్ల ఆమె వెనుక ఓ మనిషి ఆమెనే అనుసరిస్తూ నడవటం మంగళ గమనించలేదు.

ఐదు నిముషాల తర్వాత మంగళ బస్టాపు దగ్గరకు వచ్చింది. అప్పటికే అక్కడ చాలామంది నిలబడి వున్నారు.

మంగళ ఓ పక్కగా నిలబడింది. బస్సులకోసం ఎదురు చూస్తున్న మగాళ్ళ చూపులు ఆమె మీదికి మళ్ళాయి.

ఆమె అందం వాళ్ళను ఆకర్షించింది. ఆమెను వెంబడిస్తున్న మనిషి ఆమె పక్కగా వచ్చి నిలబడ్డాడు.

మంగళ అతన్ని చూడలేదు.

చిన్నగా దగ్గాడు అతను.

తలెత్తింది ఆమె. అతన్ని చూసింది. ముప్ఫయ్యేళ్ళు దాటి వుంటాయి. సన్నగా, పొడుగ్గా వున్నాడు. పక్కకు దువ్విన క్రాపు. గీతల షర్టు వేసుకొన్నాడు. నల్లప్యాంటు. కాళ్ళకు మామూలు చెప్పులు.

ఒక్కసారి అతన్నిచూసి తల దించుకుంది మంగళ.

ఏదో బస్సు వచ్చింది. ముందుకు కదిలారు జనం. కాని బస్సు ఆగలేదు. బస్టాపుకు దూరంగా వెళ్ళి ఆగింది.

కొంతమంది పరుగుతీశారు మగాళ్ళు.

ఆడవాళ్ళు ఆగిపోయారు. మంగళ ఎక్కవలసిన బస్సు వచ్చింది. అంతగా దాన్లో మనుషులు లేరు. తను నిలబడిన చోటునించి కదిలింది ఆమె.

"మంగళా" పిల్చాడతను చిన్నగా.

ఉలిక్కిపడింది ఆమె.

అతని కళ్ళలోకి చూసింది.

"నీతో మాట్లాడాలి" చిన్నగానే అన్నాడు.

బస్సులో జనం ఎక్కుతున్నారు. ఆ బస్సుపోతే మళ్ళీ నలభైనిముషాలదాకా బస్సు లేదు.

ఎవరతను? తనతో ఏం మాట్లాడాలి?? ఇతన్ని ఇంతకు ముందు ఎప్పుడూ చూడలేదు. ఎవరై వుంటాడు? ఆలోచిస్తోంది మంగళ.

"నీతో మాట్లాడాలి."

"మీరెవరో నాకు తెలీదు" మంగళ అన్నది.

"తెలీదు. కాని-నువ్వు నాకు తెలుసు. అందుకే నీతో మాట్లాడాలంటున్నాను."

అతని మాటలు సౌమ్యంగా వున్నాయి.

కదులుతున్న బస్సువైపు చూసింది మంగళ. ఏం చెయ్యాలి? ఇతను తనతో ఏ విషయం గురించి మాట్లాడతాడో తెలీదు. ఆగిపోవటమా? వెళ్ళిపోవటమా?

"ఆ బస్సు పోయినా ఫర్వాలేదు. మరో బస్సు అర గంటలో వుంది" అన్నాడతను.

"మాట్లాడండి" అన్నది మంగళ బస్సు వెళ్ళిపోగానే.

"ఇక్కడ కాదు."

"ఏం?"

"కొంచెం రహస్యం."

"రహస్యమా?"

"అవును. అందుకే ఇంకెక్కడికయినా వెళ్ళి మాట్లాడుకుందాం. అనవసరంగా భయపడకు. నేను నీకు శ్రేయోభిలాషినే."

మంగళ యింక ఆలోచించలేదు.

ముందుకు కదిలింది. అతనుకూడా అక్కడినించి కదిలాడు.

చీకటి పడుతోంది. ఒక్కొక్కటే దీపాలు వెలుగుతున్నాయి.

"థాంక్స్ మంగళా నన్ను నమ్మి వస్తున్నందుకు" నడుస్తూ అన్నాడతను.

రోడ్డు ప్రక్కగా ఓ హోటలు వుంది.

దాన్లోకి నడిచాడు అతను. అతని వెనకే మంగళ వెళ్ళింది. 'ఫామిలీ' రూములోకి వెళ్ళారు. ఎదురెదురుగా కూర్చున్నారు.

కూర్చున్న తర్వాత "నువ్వు పులి నోట్లో చిక్కుకొన్నావు," అన్నాడతను.

ఉలిక్కిపడింది ఆమె మరోసారి.

"ఏమిటి మీరంటున్నది?" అంది అతన్ని అనుమానంగా చూస్తూ.

"అవును. దేవరాజు పులిలాంటి మనిషి. నువ్వు గొప్ప ప్రమాదంలో ఇరుక్కున్నావు."

"వివరంగా చెప్పండి. అసలు మీరెవరు? నేను దేవరాజుగారింట్లో ఉంటున్నట్టు మీకెలా తెలుసు?" భయంగా అడిగింది మంగళ.

ఆమెకు అంతా మిస్టరీలా తోచింది.

నవ్వాడు అతను.

"నేనెవరో నీకు అనవసరం. నీ గురించి నాకు యెలా

తెలుసునో చెప్పను. కాని నువ్వు ప్రమాదంలో ఇరుక్కున్నావని చెప్పటానికే వచ్చాను. నిన్ను వెంటనే ఆ ఉద్యోగంలోనించి ఆ దేవరాజు కబంధ హస్తాలనించి బయట పడమంటున్నాను. ఆ పైన నీ యిష్టం" సిగరెట్టు వెలిగించాడతను.

సర్వర్‌కు కాఫీ ఆర్డరిచ్చాడు.

మంగళకు తల తిరిగినట్లనిపించింది. ఆ మేను నిలువునా భయం ఆవహించింది. కొంచెంసేపు ఏమీ మాట్లాడలేక పోయింది. అతన్నే చూస్తూ ఉండిపోయింది.

పొగను రింగులుగా వదులుతున్నాడు.

సర్వరు కాఫీ తీసుకొచ్చాడు.

ఇద్దరూ చెరో కప్పు తీసుకున్నారు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"నాకంతా అయోమయంగా ఉంది. ప్లీజ్. వివరంగా చెప్పండి."

"ఇంతకంటే ఏమీ చెప్పలేను. దేవరాజు మంచివాడు కాదు. ఆయన చట్టవిరుద్ధమయిన మనిషి. ఆ యిల్లొక యమకూపం. అందులో నీలాంటి అందమైన ఆడది ఇరుక్కోవటం నేను సహించలేను. అందుకే చెబుతున్నాను. ఆలోచించు. వెంటనే ఆ నరకంనించి బయటకు వచ్చెయ్."

కప్పు కింద పెట్టింది మంగళ. కర్చీఫ్‌తో మొహానికి పట్టిన చెమటను తుడుచుకుంది.

"నా పరిస్థితి మీకు తెలియదు. నేను కష్టాల్లో వున్నాను. నాకు ఉద్యోగం అవసరం."

"ఉద్యోగం కోసం జీవితాన్ని నాశనం చేసుకుంటావా?" వెంటనే అడిగాడతను మంగళ కళ్ళల్లో సూటిగా చూస్తూ.

"ఉద్యోగం లేకుండా ఎలా బతగ్గలను?" హీన స్వరంతో అడిగిందామె.

"ఇంకో ఉద్యోగం కోసం ప్రయత్నించు."

"ఇంకో ఉద్యోగం అంత సులభంగా దొరుకుతుందా? అప్పటివరకు ఎక్కడ ఉండగలను?"

"నువ్వు ఈ వూరు రాగానే ఎక్కడ ఉన్నావో అక్కడే వుండు. ఇంకో ఉద్యోగం కోసం ప్రయత్నించు. అప్పటివరకు బతకటానికి కావలసిన డబ్బు నేనిస్తాను."

"మీరా? మీ కేమిటి నా గురించి ఇంత ఇంట్రెస్టు?"

"నీ గురించేకాదు. ఆపదలో యిరుక్కుంటున్న ఏ ఆడ దానికయినా నా సహాయం లభిస్తుంది."

"ఇంతకీ మీ రెవరు?"

"చెప్పను.... ఇప్పుడా అవసరం లేదు."

"మీ పేరు?"

"అదికూడా అనవసరమే. ఐనా చెబుతాను. నువ్వు ఏదో ఒక పేరుతో నన్ను పిలవాలి కదా. మోహన్ అనుకో," నవ్వుతూ చెప్పాడు.

అతను మంగళ కళ్ళకు చిత్రమయినవాడిలా అగుపించాడు.

"మీ మాటలు నమ్మశక్యంగా అనిపించటంలేదు. నా దృష్టిలో దేవరాజుగారు మంచిమనిషి. ఎటువంటి ఆధారాలూ చూపకుండా ఆయన దుర్మార్గుడంటే నమ్మ లేకుండా ఉన్నాను. ఆయన మంచివాడు కాదని అనిపించిన మరుక్షణమే నేను ఆ యింటినించి, ఉద్యోగంలోనించీ బయటకు వచ్చేస్తాను. అప్పటివరకూ నేను ఆ ఇంట్లోనే ఉంటాను. ఆ ఉద్యోగమే చేస్తాను" అన్నది మంగళ.

అతను ఆశ్చర్యంగా ఆమెను చూశాడు. ఉన్నట్లుండి

మంగళ అలా మాట్లాడుతుందని అతను వూహించలేదు.

సిగరెట్‌ను కింద పడేసి కాలితో తొక్కి "ఆల్ రైట్. నీ ఖర్మ నువ్వు అనుభవించు. ఆ నరక కూపంలో పడి గిలగిలా కొట్టుకో" అని విసురుగా లేచి బయటకు వెళ్ళిపోయాడతను.

భయంగా అతను వెళ్ళినవైపే చూస్తుండి పోయింది మంగళ.

# 3

రాత్రి పది గంటలు దాటింది.

తన గదిలో బెడ్ మీద పడుకొని ఏదో నవల చదువుతోంది మంగళ. చదువుతున్నదనేగానీ ఆమె ఆ రోజు తనని కలుసుకుని మాట్లాడిన మనిషి గురించే ఆలోచిస్తోంది.

అసలు అతనెవరు?

తన గురించి అతనికి యెలా తెలుసు?

దేవరాజు మనిషి మంచివాడు కాదా?

తను పులినోట్లో తల పెట్టిందా?

నరకకూపంలో ఇరుక్కుపోతోందా?

ఎంతవరకు నిజం? నిజంగా దేవరాజు మంచివాడు కాదా?

బహుశ అతను అబద్ధం చెప్పివుండాలి తనని భయపెట్టటానికి. ఒకవేళ అతనికీ దేవరాజుకీ మధ్య శత్రుత్వం ఉందేమో!

ఆలోచనలతో మంగళకు నిద్ర ముంచుకు వచ్చింది.

లైటు అలా వెలుగుతూనే వుంది.

నిద్రలోకి జారిపోయింది మంగళ.

ఎంతసేపు నిద్రపోయిందో తెలియదు.

మంగళకు ఉన్నట్టుండి మెలకువ వచ్చింది. కళ్ళు తెరిచింది.

గదంతా చీకటిగా ఉంది.

భయంతో ఒక్కసారి కళ్ళు మూసుకుంది.

గది యెందుకు చీకటిగా ఉంది? గదిలో దీపం ఎందుకు ఆరిపోయింది. కరెంటు ఫెయిలయిందా? ఏమై ఉంటుంది?

తనకి బాగా నే గుర్తు. తను లైటు తీసెయ్యలేదు. ఆలోచిస్తూనే నిద్రపోయింది. చదువుతున్న నవల పక్కనే చేతికి తగులుతోంది.

ఆలోచిస్తోంది.

కళ్ళు తెరిచింది.

అంతా చీకటి. ఎవరో గదిలో చిన్నగా నడుస్తున్న చప్పుడు.

'గదిలో ఎవరు?' 'యెవరు తిరుగుతున్నారు?'

నిజంగా ఎవరైనా వున్నారా? లేకపోతే తన భ్రమా?

భ్రమకాదు. నిజంగానే యెవరో నడుస్తున్నారు. చప్పుడు వినబడుతోంది. ఆ ఆలోచన రాగానే మంగళకు ఒళ్ళంతా చెమటలు పట్టింది.

చీకట్లోకి చూసింది. గది గోడలు మసగ్గా కనపడుతున్నాయి. తర్వాత ఒక్కొక్క వస్తువే నల్లగా కనిపిస్తోంది.

మంగళ కళ్ళను అటూ ఇటూ తిప్పుతోంది. ఒక్క చోట ఆమె దృష్టి నిలిచిపోయింది.

గదిమూల బీరువా పక్కనే యెవరో నిలబడినట్లు అనిపించింది.

మంగళ భయంతో బిగుసుకుపోయింది.

ఒక్కసారి కళ్ళు మూసుకుని మళ్ళీ వెంటనే తెరి

చింది. కళ్ళను మరింత వెడల్పుచేసి చూసింది.

ఎవ్వరూ కనిపించలేదు.

తన భ్రమ అనుకుంది. మెల్లగా మంచంమీద లేచి కూర్చుంది.

కిటికీ తలుపులను తెరిచింది.

బయటకూడా అంతా చీకటిగా ఉంది. కరెంటు ఫెయిలయిందని గ్రహించింది. నక్షత్రాల వెలుగులో రోడ్డు, యిళ్ళు కనిపిస్తున్నాయి.

ఎంతోసేపు నిద్రపోలేదు. గదిలో ఏదో వస్తువు కింద పడి చప్పుడయింది.

ఉలిక్కిపడి నిద్ర లేచింది మంగళ.

గదిలో దీపం వెలుగుతోంది.

ఒక్కసారి వెలుగును చూడలేక కళ్ళు చిట్లించి చూసింది. గది మూలగావున్న బీరువా చాటునించి ఓ మనిషి కాలు-చెయ్యి బయటకు కనిపిస్తున్నాయి. ఆ మనిషి కత్తి చేతిలో దీపం వెలుతురులో తళ తళా మెరుస్తోంది.

అంతే....

భయంతో కెవ్వున కేక పెట్టింది మంగళ.

# 4

కళ్ళు తెరిచింది మంగళ.

ఆమె మొహమంతా తడిగా ఉంది.

ఎదురుగా దేవరాజు కనిపించాడు.

గదిలో లైటు వెలుగుతూనే ఉంది.

"భయపడకు మంగళా. నేను దేవరాజుని." అన్నాడాయన.

మంచంమీద లేచి కూర్చుంది. ఆయన కొంచెం

దూరంలో ఉన్న కుర్చీని దగ్గరగా లాక్కుని కూర్చుని "ఎందుకలా కేక పెట్టావ్? ఏదయినా పీడకల వచ్చిందా?" అని అడిగాడు.

తలను అడ్డంగా వూపింది కాదన్నట్టు.

మంగళ గుండెలు యింకా వేగంగా కొట్టుకుంటున్నాయి.

కళ్ళముందు బీరువా చాటున నిలబడ్డ మనిషి కాలు, చెయ్యి-చేతిలో కత్తి కనిపిస్తున్నాయి.

భయంగా బీరువా వెనక్కి చూసింది.

అక్కడ యెవ్వరూ కనిపించలేదు. ఖాళీగా ఉన్న గోడ కనిపిస్తోంది.

"చెప్పు. ఏమయ్యింది? ఎందుకలా పెద్దగా అరిచావ్?" మళ్ళీ అడిగాడు దేవరాజు.

"నా గదిలోకి యెవరో ప్రవేశించారు" చిన్నగా చెప్పింది.

"ఈ గదిలోకా? ఎవరు?"

"ఏమో తెలీదు. మొత్తానికి యెవరో వచ్చారు."

"నువ్వు చూశావా?"

"చూశాను."

"ఎక్కడ?"

"ఆ బీరువా చాటున."

దేవరాజు లేచి బీరువా దగ్గరకు వెళ్ళాడు. అక్కడ ఎవ్వరూ లేరు.

కాని పగిలిపోయిన ఏదో ఖాళీ మందు సీసా పెంకులు చిందరవందరగా అక్కడ కనిపించాయి.

"ఇక్కడ యెవ్వరూ లేరు" అన్నాడాయన.

"అక్కడే చూశాను. ఒక కాలు, ఒక చెయ్యి కని

పించాయి. ఆ చేతిలో పదునైన కత్తి కూడా ఉంది."

ఆ దృశ్యాన్ని గుర్తు తెచ్చుకుంటూ చెప్పింది.

"ఆశ్చర్యంగా ఉంది. ఇక్కడ యెవ్వరూ లేరు. నువ్వు ఎవర్నో చూశానంటున్నావు."

"నిజంగానే చూశాను. ఆ కత్తిని చూడగానే నేను కేకపెట్టాను. తర్వాత ఆ మనిషి ఈ గదిలోనించి వెళ్ళిపోయి ఉండొచ్చు."

"అసలు నువ్వు ఆ మనిషిని యెలా చూశావ్?"

తను కరెంటు పోయినప్పుడు ఒకసారి లేవటం-మళ్ళీ పడుకోవటం, ఏదో చప్పుడుతో మెలుకువవచ్చి దీపం వెలుతురులో బీరువా వెనుక తను ఓ మనిషి కాలు, చెయ్యి-చేతిలోవున్న కత్తినీ చూడటం గురించి చెప్పింది మంగళ.

ఆసక్తిగా విన్నాడు దేవరాజు.

తర్వాత "నీకెవరయినా శత్రువులున్నారా?" అని అడిగాడు.

"నాకా! నాకు తెలిసి ఎవ్వరూ లేరు. నాకు తెలీకుండా ఎవరయినా ఉన్నారేమో నాకు తెలీదు."

"తప్పకుండా ఉండివుండాలి. లేకపోతే కత్తి తీసుకొని ఎందుకు వస్తాడు అతనెవరో."

"నాకు అంతా అయోమయంగా ఉంది."

"భయపడకు. పెద్ద గండం గడిచిపోయింది."

"ఇంకోసారి ఇలాంటి ప్రయత్నం జరిగితే."

"నీ జాగ్రత్తలో నువ్వు వుండాలి. ఐనా నువ్వు పడుకోబోయేముందు గది తెలుపులకు బోల్టు వెయ్యలేదా?"

"గుర్తులేదు."

"బహుశ వేసివుండవు. వేస్తే యెవ్వరూ లోపలకు

రాలేరు."

"అంతే అయుండాలి."

"పోలీసు రిపోర్టు యిస్తాను," అన్నాడు దేవరాజు సిగరెట్టు వెలిగించుకుంటూ.

"అందువల్ల ప్రయోజనంలేదు. ఏదయినా వస్తువులు పోయినట్లయితే పోలీసురిపోర్టు యిచ్చినా ఉపయోగం ఉంటుంది. ఇప్పుడు ఎవర్నని పోలీసులు పట్టుకోగలరు?" అన్నది మంగళ.

"అయితే ఏం చేద్దాం?"

"మీరన్నట్టు జాగ్రత్తగా వుండాలి. ఇంతకీ ఈ బీరువాలో ఏమున్నాయి?" బీరువాను చూపిస్తూ అడిగింది.

"ఏమీ లేవు. పనికిరాని కాయితాలు."

"ఒకవేళ ఈ బీరువాలో ఏవో నగలు వున్నాయని వాడు వచ్చాడేమో" అన్నది మంగళ ఆయన మొహం లోకి చూస్తూ.

"కావచ్చు. అంతే అయివుంటుంది. ఈ బీరువాని ఇక్కడనించి ఇంకో గదిలోని మార్పిస్తాను. ఇకనించీ నువ్వు కొంచెం జాగ్రత్తగా ఉండు." అని ఆ గదిలో నించి వెళ్ళిపోయాడు దేవరాజు.

మంగళ పగిలిపోయిన గాజు పెంకుల దగ్గరకు వెళ్ళింది ఏరి పారెయ్యటానికి.

## 5

టైపు చేస్తోంది మంగళ. మిషన్ మీద ఆమె చేతివేళ్ళు సుతారంగా నాట్యం చేస్తున్నాయి.

ఆరోజు వర్కు బాగా వుంది. అందుకే మొహమంతా చెమట పట్టినా తుడుచుకోకుండానే గబగబా టైపు చేస్తోంది.

మంగళ దగ్గరకు ప్యూన్ వచ్చి "మిమ్మల్ని యెవరో ఫోన్‌లో పిలుస్తున్నారు" అని చెప్పాడు.

"నన్నా!" టైపు చెయ్యటం ఆపి అడిగింది.

"అవును మంగళని పిలవండి అంటున్నారు."

సీట్లోనించి లేచింది మంగళ.

ఫోన్ వున్న గదిలోకి నడిచి బల్లమీద పెట్టివున్న రిసీవర్ ని తీసుకుని "హలో" అన్నది చిన్నగా.

"ఎవరు మంగళేనా?" ఓ మగాడి గొంతు వినిపించింది.

"అవును."

"ఏం నిర్ణయించుకొన్నావ్? ఆ యమకూపం నించి బయటపడదల్చుకోలేదా?"

"ఎవరు మీరు? మోహన్ గారా?"

"అవును. ముందు చెప్పు మంగళా. నువ్వు నా మాట వినదల్చుకోలేదా?"

ఒక్క నిముషం మంగళ మాట్లాడలేదు. తర్వాత "నాకు ఆయన మీద నమ్మకం వుంది. ఆ నమ్మకం పోనంత వరకు నేను బయటకు రాను" అన్నది.

"దేవరాజు నమ్మకంగానే నీ గొంతు కోస్తాడు."

"ఇన్ని మాటలు అనవసరం. ఆయన మంచివాడు కాదని మీరు నాకు ఏవయినా ఆధారాలు చూపించండి. నమ్ముతాను."

"ఆధారాలు కావాలా?"

"అవును."

"త్వరలో నే నిన్ను కలుసుకుని మాట్లాడుతాను. ఈ లోపల నువ్వు జాగ్రత్తగా వుండు. దేవరాజు ఉచ్చులో ఇరుక్కోకు" అని ఫోన్ డిస్కనెక్ట్ చేశాడు.

రిసీవర్‌ని పెట్టేసి కొంచెంసేపు అక్కడే నిలబడి పోయింది మంగళ.

తర్వాత మెల్లగా వాడిపోయిన మొహంతో తన సీటు దగ్గరికి వచ్చింది.

ఆమెకు ఏపు చెయ్యాలనిపించలేదు.

ఎవరీ మోహన్? ఎందుకిలా తనకి ప్రతి నిమిషం హెచ్చరిస్తున్నాడు??

ఇలాంటి ఆలోచనలతో సతమత మయిపోయింది మంగళ.

సాయంత్రం వరకూ ఎలాగో ఆఫీసులో గడిపింది.

ఆఫీసు వదలగానే బస్సులో ఇంటికి వచ్చింది.

నౌకరు తోటలో మొక్కలకు నీళ్ళు పెడుతున్నాడు. గూర్ఖా బయట నిలబడి బీడీ కాలుస్తున్నాడు. వంటమనిషి లోపల వంట ప్రయత్నంలో వుంది.

స్నానం చేసింది మంగళ.

మేడమీదకు వెళ్ళి నిలబడింది. బాగా చీకటిపడే వరకూ అక్కడే వున్నది. తర్వాత కిందకు వచ్చింది.

అప్పటికి దేవరాజు ఇంటికి రాలేదు.

ఎనిమిది గంటలయ్యింది. ఇంట్లో, తోటలో దీపాలు వెలుగుతున్నాయి. నౌకరు ఇంటికి వెళ్ళిపోయాడు.

వంటమనిషి వంటచేసి వెళ్ళిపోయింది. ఇక ఆ ఇంట్లో మిగిలింది మంగళ.

ఆమెకు భయంగా వుంది ఆ యింట్లో ఉండాలంటే రాత్రి ఆ సంఘటన జరిగిన తర్వాత.

నిజంగా దేవరాజు మంచివాడు కాదేమో.

ఈ ఆలోచన మంగళలో అప్పుడప్పుడు వస్తోంది.

అయినా ఆయన్ని చూస్తూంటే అలాంటి మనిషిగా

అనిపించటంలేదు. ఆయన గురించి యెవ్వరూ చెడుగా చెప్పలేదు. గజపతిగారు కూడా అయన గురించి మంచిగానే చెప్పాడు.

మరి ఈ మోహన్ యెవరో దేవరాజు దుర్మార్గుడంటున్నాడు. ఇది యెంతవరకు నిజం? ఏమిటో అంతా మిస్టరీలా ఉంది అనుకున్నది.

తొమ్మిది గంటలు అవుతుండగా వచ్చాడు దేవరాజు కారులో.

"భయపడి చస్తున్నాను ఒక్కదాన్నే యింత యింట్లో" అన్నది మంగళ ఆయన్ని చూడగానే.

"సారీ. ఎర్లీగానే వచ్చేవాడిని. మధ్యలో ఓ ఫ్రెండ్ కలిశాడు. రాత్రి ఇన్సిడెంట్ తర్వాత నువ్వు మరీ భయపడుతున్నట్లున్నావు" అన్నాడు.

"అవును. రండి. వడ్డిస్తాను" అన్నది ఆమె.

"ఐదు నిముషాలు" అని డ్రెస్ మార్చుకోటానికి తన గదిలోకి వెళ్లాడు దేవరాజు.

ఈ లోపల టేబిల్ మీద అన్నీ అమర్చింది మంగళ. ఆమె ఆ ఇంట్లో చేరినదగ్గర్నుంచీ దేవరాజు బలవంతం మీద ఆయనతోనే కలిసి భోజనం చేస్తున్నది.

దేవరాజు వచ్చి కూర్చున్నాడు.

ఇద్దరికీ వడ్డించింది.

ఆయన్నే చూస్తోంది మంగళ. మోహన్ ఆయన గురించి చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకుంటోంది. నమ్మశక్యంగా అనిపించలేదు.

మోహన్ గురించి ఆయనతో చెప్పేయ్యాలనిపించింది. కాని మంగళ చెప్పలేదు. మోహన్ ఏదో మాట్లాడుతున్నాడు. తర్వాతనే తను నిర్ణయించుకోవాలి.

భోజనాలయినాయి.

"నువ్వు రాత్రికి బోల్టులు బిగించి పడుకో. జాగ్రత్త" అన్నాడు దేవరాజు తన గదిలోకి వెళ్ళబోతూ.

"అలాగే. ఒక్కమాట సర్" అన్నది మంగళ.

వెళ్ళబోతున్న ఆయన ఆగిపోయి "ఏమిటి?"అన్నాడు

"మీ అబ్బాయి నరేంద్ర ఈ ఇంట్లో ఉండడా?" అడిగింది.

"నరేంద్రా. ఓ ముఖ్యమయిన పనిమీద బొంబాయి వెళ్ళాడు పదిరోజుల క్రితం. ఇంకో నెలవరకూ తిరిగి రాడు" అని వెళ్ళిపోయాడు దేవరాజు.

అక్కడే నిలబడిపోయింది మంగళ.

## 6

లోపలకు వచ్చి గది తలుపులను మూసి బోల్టులను బిగించింది మంగళ.

బయటినించి తలుపులను యెవరైనా తెరిచే వీలుం దేమోనని చూసింది. ఎక్కడా కనిపించలేదు.

ఇక తన గదిలోకి ఎవ్వరూ రాలేరన్న తృప్తి కలిగిన తర్వాత కిటికీ దగ్గరకు వచ్చింది.

పది గంటలయ్యింది.

గదిలో దీపం వెలుగుతోంది. తెరచివున్న కిటికీలోంచి బయటకు చూసింది.

రోడ్డు నిర్మానుష్యంగా ఉంది. అప్పుడప్పుడు దూరంగా మెయిన్ రోడ్డుమీద వెడుతున్న వాహనాలు కనిపిస్తున్నాయి.

తోటలో చెట్లు చిన్నగా కదులుతున్నాయి. పువ్వుల పరిమళం గాలిలో కలిసి అన్నివైపులా వ్యాపిస్తోంది.

కొంచెంసేపు కిటికీదగ్గర నిలబడింది. తర్వాత పక్క

మీద పడుకుంది.

నిద్ర రాలేదు.

రాత్రి సంఘటన గుర్తుకొచ్చింది.

కళ్ళముందు బీరువాచాటున నిలబడిన మనిషి కాలు, చెయ్యి-చేతిలో కత్తి కదిలాయి.

భయం పుట్టింది.

గుండె దడదడలాడింది.

లైటు తీసెయ్యాలనిపించలేదు. అందుకే అలాగే కళ్ళు మూసుకుంది.

ఎప్పటికో నిద్రపోయింది.

ఒంటిగంట దాటిన తర్వాత ఎప్పటికో మెలకువ వచ్చింది.

బాత్ రూంలోకి వెళ్ళాలి.

ఎలా?

తలుపు తెరిచి బయటకు వెళితే ఏమవుతుందో? గది బయట ఎవరైనా వున్నారేమో!

రాత్రి వచ్చిన మనిషి తనకోసమే వచ్చి ఉంటే.

ఇవాళ కూడా వస్తాడు.

తలుపులు బిగించి ఉండడంవల్ల బయట తనకోసం కాచుకుని వుండొచ్చు.

ఐతే బయటకు వెళితే తనకు ప్రమాదం తప్పదు.

బయటకు వెళ్ళకుండా ఎలా?

ఆపద తనకోసం పొంచి వుంది.

చాలాసేపు పక్కమీద లేచి కూర్చుని ఆలోచించింది మంగళ.

చివరకు బయటకు వెళ్ళడానికే నిర్ణయించుకుంది.

జాగ్రత్తగా అటూ ఇటూ చూసి వెళ్ళాలనుకుంది.

భయపడుతూనే వచ్చి బోల్టులు తీసి తలుపును కొంచెంగా తెరిచింది. గదిలో వెలుగుతున్న దీపం వెలుతురు బయటకు పడింది.

తొంగి చూసింది లోపలే వుండి.

నిశ్శబ్దంగా వుంది. యెవ్వరూ కనిపించలేదు.

అంతా తన భయం. ఎవ్వరూ లేరు.

చిన్నగా నవ్వుకుని బయటకు వెళ్ళింది.

వెలుతురు సన్నగా పడుతోంది.

బాత్ రూంలోకి వెళ్ళి మూడు నిముషాల తర్వాత గదిలోకి వచ్చి తలుపులను మూసి మళ్ళీ బోల్టులను బిగించి పడుకుంది మంగళ.

పడుకున్న అరగంటలో నిద్రపోయింది.

ఆ తర్వాత బీరువా చాటునించి ఓ మనిషి బయటకు రావటం ఆమెకు తెలీదు.

అతను గదిలో ఉన్న లైటును తీసేశాడు. తర్వాత ప్యాంటు జేబులోనించి ఓ కర్చీఫ్ బయటకు తీసి మంగళ ముక్కు దగ్గర ఉంచాడు. కొంచెంసేపట్లో ఆమె స్పృహ కోల్పోయింది.

వెంటనే అతను కిటికీ తలుపులను కూడా మూసేశాడు.

మంగళ గుండెలమీద పమిటను పక్కకు తొలగించాడు. కొంచెంసేపు ఆమె ఎగిరిపడుతున్న గుండెలను చూసి తర్వాత చీరను వూడదీశాడు.

గదిలో వెలుగుతున్న జీరోవాల్టు బల్బు వెలుతురు మసగ్గా ఉంది. ఆ మనిషి మంగళ శరీరాన్ని నిమిరాడు. తర్వాత హుక్స్ తొలగించి ఆమె జాకెట్టును తీసేశాడు. లోపల బ్రా లేదు. అతని కళ్ళు చెదిరాయి. మంగళ మంచి

యవ్వనంలో వుంది.

ఇంకో రెండు నిముషాల్లో ఆమె లోపలి లంగాని కూడా వూడదీశాడు అతను.

మంగళ యిప్పుడు పూర్తి నగ్నంగా తయారయ్యింది.

అతను బీరువా మీదున్న కెమేరాని తీసుకొచ్చాడు.

నగ్నంగా వున్న మంగళ శరీరాన్ని వివిధ కోణాల్లో ఫోటోలు తీశాడు.

తర్వాత ఒక్కొక్కటే బట్టల్ని ఆమెకు తొడిగాడు.

కిటికీ తలుపులను తెరిచాడు.

జీరో వాట్ల బల్బును ఆర్పేసి లైటు వేసి ఆ గదిలో నించి మాయమయినాడు.

ఏమీ తెలీని మంగళ క్లోరోఫాం మత్తులో పడి నిద్ర పోతోంది. కిటికీలోనించి చల్లని గాలి లోపలకు వస్తోంది.

## 7

ఆ రాత్రి ఏమీ జరగనందుకు మంగళ యెంతో సంతో షించింది. క్రితం రాత్రి వచ్చిన మనిషి తప్పకుండా దొంగ అయి ఉంటాడనుకొంది. తను అనవసరంగా భయ పడింది.

ఉదయం మంగళ దేవరాజు కార్లోనే ఆఫీసుకు వెళు తుంది. సాయంత్రం మాత్రం ఒంటరిగా బస్సులో ఇంటికి వస్తుంది.

ఆరోజు ఆఫీసులో వర్కు అంత యెక్కువగా లేదు. అందుకే నెమ్మదిగా టైపు చేస్తోంది.

మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తుండగా ఆమె దగ్గరకు ప్యూను వచ్చి "మీ కోసం యెవరో వచ్చారు." అని చెప్పాడు.

"ఎవరు?"

"ఏమో నాకు తెలీదు. మంగళ గారిని పిలుచురా" అని పంపించాడు.

తప్పకుండా ఆ వచ్చిన మనిషి మోహన్ అయి వుంటాడని అనుకొన్నది.

టైపు చేసిన కాయితాలమీద వెయిట్ ఉంచి బయటకు వచ్చింది.

విజిటర్స్ గదిలో కూర్చుని సిగరెట్టు కాలుస్తున్న మోహన్ కనిపించాడు.

అతను నీట్ గా ఉన్నాడు. నున్నని గడ్డం, అప్పుడే ఇస్త్రీ చేసినట్టున్న బట్టలు. నల్లగా నిగనిగలాడుతున్న షూస్.

"కూర్చో" అన్నాడు మంగళను చూడగానే.

అతని ఎదురుగా కూర్చుంది మంగళ.

"ఇంకా నువ్వు నన్ను నమ్మటంలేదా మంగళా" అని అడిగాడు మోహన్ సిగరెట్ ను అక్కడే టీపాయ్ మీద ఉన్న యాష్ట్రేలో కుక్కి.

"మీ మాటలు ప్రవర్తన నాకు అశ్చర్యాన్ని అనుమానాన్ని కలిగిస్తున్నాయి. మీరెవరో నాకు తెలీదు. నేను మీకు తెలుసంటున్నారు. కొత్తవ్యక్తికైనా నన్ను 'నువ్వు' అని పిలుస్తున్నారు. అయినా నేను ఆ విషయం గురించి అంతగా పట్టించుకోలేదు. కాని మీరు నా గురించి ఎందుకింత ఇంట్రెస్టు తీసుకుంటున్నారో నాకు తెలీదు. పైగా నమ్మశక్యంగాని ఓ విషయాన్ని చెప్పి దాన్ని నమ్మమని నన్ను బలవంతం చేస్తున్నారు.

అసలు దేవరాజుగారు మంచివాడు కాదని మీకెలా తెలుసునో చెప్పండి. ఆధారాలతో రుజువు చేయండి.

అలా కాకుండా మీరు ఎన్ని మాటలు చెప్పినా నేనెలా నమ్మగలను?

కేవలం తన స్నేహితుడు రాసిన ఉత్తరం ఆధారంగా నాకు తన కంపెనీలో ఉద్యోగం ఇచ్చాడు. తన ఇంట్లోనే ఉండమన్నాడు. అటువంటి మనిషి మంచివాడు కాదని దుర్మార్గుడని మీరు చెబుతుంటే నమ్మశక్యంగా లేదు. అసలు ఒక విషయం చెప్పండి. నా గురించి మీ కెందుకింత ఇంట్రెస్టు?" అన్నది మంగళ.

మంగళ అలా మాట్లాడగానే కొంచెంసేపు మోహన్ మాట్లాడలేదు.

"ఆల్ రైట్ నువ్వు నా మాటలు మామూలుగా చెబితే నమ్మవని అర్థమయ్యింది. ఇంక నిజం దాచవలసిన అవసరంలేదు. నేనెవరో నీ గురించి ఎందుకింత ఇంట్రెస్టు చూపిస్తున్నానో చెబుతాను. కాని ఇక్కడ కాదు. ఇక్కడనించి బయటకు వెడదాం. ఎక్కడయినా కూర్చుని మాట్లాడుకుందాం" అన్నాడు మోహన్.

అతని మొహంలోకి చూసింది మంగళ. ఏదో బాధ పడుతున్నట్టుగా అనిపించింది. సిన్సియారిటీ కనిపించింది.

"ఇప్పుడు మాకు లంచ్ టైమ్ పన్నెండున్నరకు. పదండి ఇప్పుడే ఏదయినా హోటలుకు వెళదాం" అన్నది నిలబడి.

ఆమెకు బాగా ఇంట్రెస్టింగ్ గా వుంది అతను చెప్ప బోయేదేమిటో వినాలని.

ఇద్దరూ బయటకు వచ్చారు.

ఆటోలో సెంటర్లో ఉన్న ఓ హోటలుకు వెళ్ళారు.

ఫామిలీ రూములో కూర్చున్నారు.

"చెప్పండి." అన్నది మంగళ.

ఆతను ఏదో మొదలు పెట్టబోయేలో సర్వరు వచ్చాడు. టిఫిన్ కి ఆర్డరిచ్చాడు మోహన్.

"ముందుగా నా గురించి చెబుతాను. నేను బి. కాం., పాసయ్యాను. నాకు తండ్రి లేడు. తల్లి వుంది. ముగ్గురు చెల్లెళ్ళు. ఇద్దరు తమ్ముళ్ళు. నిజానికి ఇంటి బాధ్యత అంతా నేనే నిర్వహించాలి. కాని కొంతమంది స్నేహితులవల్ల నేను పనికిరానివాడినయ్యాను. ఇంటి విషయాలు పట్టించుకోకుండా తిరిగాను.

అందువల్ల నా పెద్ద చెల్లెలు సుమతి చదువుతున్న బియ్యేను మధ్యలోనే ఆపేసి ఉద్యోగంకోసం ప్రయత్నించింది. ఎవరో ఒకాయన్ను కలుసుకుంటే ఉద్యోగం ఇప్పిస్తాడని ఎవరో చెప్పారు. ఆయన పేరు గజపతిరావు. ఆయన ఓ ఉత్తరం రాసి దేవరాజు దగ్గరికి పంపించాడట. దేవరాజు తన కంపెనీలో ఖాళీ లేదని ఇంకో చోట యెక్కడో ఉద్యోగం యిప్పించాడు. కాని తన ఇంట్లోనే వుండమన్నాడుట సుమతిని.

నీలాగనే వుండిపోయింది. కాని పదిహేను రోజుల తర్వాత కనిపించకుండా మాయమయ్యింది. ఈ విషయా లేవీ నాకు తెలీదు. అప్పుడు నేను స్నేహితులతో వూళ్ళు తిరుగుతున్నాను. రెండు నెలల తర్వాత నాకు-చెల్లెలు కనిపించటంలేదని తెలిసింది.

గజపతిరావుని అడిగాను. నాకు తెలీదన్నాడు. దేవరాజు దగ్గరకు వచ్చి ఆయన్ని అడిగాను. "నాకేమీ తెలీదు. నా యింట్లో పదిరోజులు వున్నది. తర్వాత యెవరో స్నేహితురాలు తన యింట్లో వుండమన్నదని వెళ్ళిపోయింది." అన్నాడు. అంతకుమించి తనకేమీ తెలీదన్నాడు.

నేను నా చెల్లెలు సుమతికోసం వెతికాను. పోలీసు రిపోర్టు ఇచ్చాను. అయినా ఉపయోగం లేకుండా పోయింది. సుమతి ఇంతవరకు కనిపించలేదు. ఇది జరిగి ఆరు నెలలయ్యింది. పోలీసులు కూడా సుమతి జాడ తెలుసుకోలేకపోయారు.

నా అనుమానం దేవరాజే నా చెల్లెల్ని ఏదో చేసి చంపేశాడని. ఇప్పుడు నువ్వుకూడా నా చెల్లెలు సుమతి లాగానే దేవరాజు దగ్గరకువచ్చావు. ఆ ఇంట్లో ఉన్నావు. నువ్వుకూడా నా చెల్లెలు లాగా మాయమవుతావేమోనని నా భయం. అనుమానం. అందుకే నిన్ను ఇంతగా హెచ్చరిస్తున్నాను.

ప్లీజ్ నన్ను నమ్ము మంగళా. ఆ దేవరాజు బారినించి తప్పుకో .... లేకపోతే నువ్వు కూడా కనిపించకుండా పోతావు."

మంగళ కళ్ళలో భయం కనిపించింది. అతను చెప్పిన మాటలు వినగానే. అతను చెప్పినదంతా నమ్మశక్యం గానే అనిపించింది. ఇంతకు ముందు జరిగినది తల్చుకుంటే ఒళ్ళు జలదరించింది. బీరువా చాటున మనిషి - చేతిలో కత్తి.

టిఫిన్ చెయ్య బుద్ధికాలేదు.

కాఫీ తాగింది.

"ఇప్పటికయినా నీకు నా మీద నమ్మకం కుదిరిందా?"

తల వూపింది మంగళ ....

అతన్ని పూర్తిగా నమ్మింది. నిజంగా తను గొప్ప ప్రమాదంలో చిక్కుకున్నానని తెలుసుకుంది.

అలా అనుకోగానే ఆ రాత్రి జరిగిన సంఘటనగురించి అతనితో చెప్పింది మంగళ.

"నిజంగా!" అన్నాడు మోహన్ మంగళ చెప్పింది విని.

అవును భయంతో కేక పెట్టి స్పృహ తప్పాను. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా దేవరాజు ఉన్నాడు.

"నో డౌట్. మొత్తానికి ఇందులో ఏదో మిస్టరీ ఉంది. దేవరాజు ఇంట్లో ఏదో జరుగుతోంది. ఈ మిస్టరీ ఏదో తెలుసుకోవాలి." అన్నాడు మోహన్.

"ఎలా?"

"ఇందుకు ఒకటే మార్గం, నువ్వు సాయంత్రం ఆఫీసు నించి రాగానే ఇద్దరం డిటెక్టివ్ జగదీష్ దగ్గరకు వెళదాం. ఈ మిస్టరీని ఆయన తప్పకుండా తేల్చేస్తాడు. నాకు నమ్మకం ఉంది"

"డిటెక్టివ్ జగదీష్ దగ్గరికా. అలాగే. ఆఫీసు వదలగానే వస్తాను."

"నేను ఈ హోటలు బయటే నిలబడి వుంటాను. వచ్చి కలుసుకో."

తల వూపింది మంగళ.

ఇద్దరూ హోటోల్లోనించి బయటకు వచ్చారు.

ఆటోలో ఆఫీసుకు వెళ్ళిపోయింది మంగళ. అతను అక్కడే నిలబడిపోయాడు.

# 8

"ఆశ్చర్యంగా వుంది. నిజంగా ఇదేదో మిస్టరీలావుంది" అన్నాడు డిటెక్టివ్ జగదీష్, మంగళ — మోహన్ చెప్పినదంతా విన్న తర్వాత.

"అవును సర్. పోలీసులకు ఇదంతా చెప్పినా వాళ్ళు సరయిన ఇంట్రస్టు తీసుకుని ఈ మిస్టరీని తేల్చలేరు. ఇదంతా రహస్యంగా జరగాలి. అందుకే మీ దగ్గరకు

వచ్చాం. ఇలాంటి మిస్టరీ కేసులను మీరు ఫీజుకోసం కాకపోయినా టేకప్ చేస్తారని ఇంతకుముందు విన్నాను" అన్నాడు మోహన్.

నవ్వేడు జగదీష్.

"నేను ప్రయివేటు డిటెక్టివ్ నే కావచ్చు. ఐనా ఇవ్వ గలిగిన వాళ్ళదగ్గరే ఫీజు తీసుకుంటాను. ఈ కేసులో నాకు ఫీజు అవసరంలేదు. నా ఇంట్రెస్టుకొద్దీ నేను పరిశోధిస్తాను. ఐనా నా దృష్టిలో ఈ మిస్టరీ తేల్చటానికి ఎంతో టైము తీసుకుంటుందని నేను అనుకోను. ఇంతకు ముందు జరిగినట్టుగా ఈ రాత్రికూడా జరిగితే ఈ రాత్రికే ఈ కేసు ముగుస్తుంది."

"ఈ రాత్రికేనా?" ఆశ్చర్యంగా అడిగింది మంగళ.

"అవును. ఇవాళ కూడా ఆ మనిషిని ఎవరో మీరు అనుమానిస్తున్నట్టు దేవరాజే అనుకోండి గదిలోకి వచ్చాడంటే పట్టుకోవచ్చు. ఆ మనిషిని పట్టుకుంటే అంతా తేలిపోతుంది."

"మొన్నటిలాగా ఆ మనిషిని నా గదిలోకి వస్తాడంటారా?"

"ఏమో రావచ్చు. ఎందుకంటే మీ గదిలోకి ప్రవేశించిన మనిషి దొంగతనం కోసం రాలేదని మనం ఇంతకు ముందు అనుకున్నాం. ఇంతకుముందు మోహన్ చెల్లెలు సుమతి కూడా 'ఆ ఇంట్లోనే మాయమయింది. కాబట్టి ఆ ఇంట్లోనే యేదో జరుగుతోంది. అటువంటప్పుడు ఒకసారి వచ్చిన ఆ మనిషి మళ్ళీ రావొచ్చు. వస్తాడనుకునే మనం ప్రొసీడ్ అవుదాం."

డిటెక్టివ్ జగదీష్ సిగరెట్ ను యాష్ట్రేలో కుక్కాడు.

"నిజమే. ఇంత జరిగిన తర్వాత మనం ఉపేక్షించ కూడదు." అన్నాడు మోహన్.

"అవును. అందుకే వీలయినంతవరకు ఈ కేసును రాత్రికే తేల్చేద్దాం. మీరు నేను చెప్పినట్టు చెయ్యాండి."

"చెప్పండి ఏం చెయ్యమంటారు?" అని అడిగింది మంగళ ఉత్సాహంగా. డిటెక్టివ్ జగదీష్ ఆ రాత్రికే ఆ కేసును తేల్చేస్తాననటంతో ఆమెకు భయం పోయి ఉత్సాహం కలిగింది.

"మీరు మామూలుగానే భోజనం చెయ్యగానే మీ గదిలోకి వెళ్ళండి. తలుపులు దగ్గరగా వెయ్యండి. పది గంటలు కావస్తుండగా నేను మోహన్ వస్తాము. లోపల మీ గదిలో మంచం కింద దాగి వుంటాము. మీరు లైటు తీసెయ్యండి. పడుకోండి. నిద్రవస్తే నిద్రపోండి. తర్వాత సంగతి మేము చూసుకుంటాం."

"ఓ.. కే. అలాగే," అన్నది మంగళ.

"మీ గది ఎక్కడ వుంటుందో ఇంకొక్కసారి వివరంగా చెప్పండి." అన్నాడు జగదీష్ మంగళతో.

చెప్పింది ఆమె.

"ఇక మీరు వెళ్ళండి. దేవరాజుతో మీరు మామూలుగానే ప్రవర్తించండి. మా కోసం ఎదురు చూస్తూ వుండండి."

డిటెక్టివ్‌కి థాంక్స్ చెప్పి నిలబడింది మంగళ.

"నేను మంగళను బస్సు ఎక్కించి వస్తాను" అన్నాడు మోహన్.

తల వూపాడు జగదీష్.

మోహన్, మంగళ డిటెక్టివ్ గదిలోనించి బయటకు వచ్చారు.

"ఇప్పుడు నాకెంతో ధైర్యంగా వుంది." అన్నది మంగళ మోహన్‌తో.

బస్టాపు దగ్గరకు వచ్చారు.

"అసలు నా గురించి ఈ ఎంక్వయిరీ అంతా ఎందుకు చేశారు," అన్నది ఆమె నిలబడిన తర్వాత.

"నా చెల్లెలు మాయమయిన తర్వాత నేను దేవరాజు గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే వున్నాను. అందువల్లనే నీ గురించి కూడా తెలిసింది."

"మీరు ఈ రోజున మీ చెల్లెలు గురించి చెప్పకుండా వున్నట్లయితే నేను మీరు దేవరాజు గురించి చెప్పిన మాటలు నమ్మేదాన్ని కాదు. ఆ వూబిలో దిగబడిపోయేదాన్ని మీ కెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీటం లేదు."

"ఫర్వాలేదు కృతజ్ఞత చెప్పుకోనే దారి వేరే ఒకటుంది." అన్నాడతను నవ్వుతూ.

మంగళ ఏదో అనబోయింది. ఇంతలోనే ఆమె ఎక్కవలసిన బస్సు వచ్చింది.

"జాగ్రత్త. సీ ఫర్ బోత్" అన్నాడు మోహన్.

మంగళ బస్సు యెక్కింది తల వూపి.

అతను వెనక్కు వెళ్ళాడు.

# 9

గూర్ఖా గేట్లో కునికిపాట్లు పడుతున్నాడు. రాత్రి పది గంటలు దాటింది.

ఇద్దరు మనుషులు గోడ దూకి ఆ ఇంట్లోకి ప్రవేశించటం ఆ నిద్ర మత్తులో వున్న గూర్ఖా గమనించలేదు.

అంతా నిశ్శబ్దంగా వుంది. రాత్రి పదిగంటలు అయ్యిందంటే ఆ ప్రాంతంలో అంతగా జన సంచారం వుండదు.

మంగళ గదిలో బెడ్ లైట్ మసగ్గా వెలుగుతోంది. కిటికీ తలుపులు తెరిచే వున్నాయి.

బెడ్ మీద పడుకొని ఆలోచిస్తోంది మంగళ. మంచం కింద డిటెక్టివ్ జగదీష్, మోహన్ పడుకున్నారు.

అందుకే మంగళ ధయిర్యంగా ఆ గదిలో పడుకుంది. ఆ మనిషికోసం యెదురు చూస్తోంది.

తలుపులు దగ్గరకు వేసింది. బోల్టులు బిగించలేదు.

పదకొండు గంటలయ్యింది.

మంచంకింద పడుకొన్న జగదీష్, మోహన్ తలుపుల వైపు చూస్తున్నారు.

ఇంకో పది నిముషాల తర్వాత చిన్నగా ఏదో చప్పుడు వినిపించింది.

జగదీష్ తల తిప్పి బీరువావైపు చూశాడు. బీరువా తలుపు మెల్లగా తెరుచుకుంది. అందులోనించి ఓ ఆకారం లీలగా కనిపించింది.

జగదీష్ ఆశ్చర్యపోయాడు. మంగళ తలుపులకు బోల్టులు వెయ్యకపోవటంవల్ల ఆ రోజు రాత్రి ఆ మనిషి లోపలకు వచ్చాడనుకున్నాడు. అందుకే ఈ రాత్రికి కూడా తలుపులకు బోల్టులను వెయ్యలేదు.

కాని-బీరువాలోనించి అవతలినించి ఆ మనిషి ఎవరో దారి ఏర్పాటు చేసుకున్నాడని తను వూహించలేక పోయాడు.

మంగళకూడా ఆశ్చర్యంగా బీరువాకేసి చూసింది. ఆ గదిలో డిటెక్టివ్, మరో మనషి వున్నారని తెలిసినా భయం కలిగింది. అయినా నిగ్రహించుకుంది.

రెండు నిముషాల తర్వాత బీరువాలోనించి బయటకు వచ్చాడు ఆ మనిషి.

బీరువా తలుపులను మూశాడు.

బెడ్ లైట్ వెలుతురులో ఆ మనిషి కళ్ళు ఎర్రగా మండుతున్న అగ్ని గోళాల్లా కనిపించాయి. ముఖం అతి భయంకరంగా వుంది. మెడలో బుసలుకొడుతున్న త్రాచు. చేతిలో ధగధగ మెరిసే కత్తి.

బీరువాలోనించి బయటకు వచ్చిన ఆకారాన్ని చూసి గట్టిగా కళ్ళు మూసుకుంది మంగళ.

ఆ వింత మనిషిని చూసి డిటెక్టివ్ జగదీష్ మోహన్ కూడా విస్తుపోయారు. వాళ్ళ మొహాల్లో ఆశ్చర్యం కొట్టొచ్చినట్లు కన్పించసాగింది.

ఆ మనిషి కొంచెంసేపు కాలితో నేలమీద చప్పుడు చేశాడు.

జగదీష్‌కి ఆ మనిషి ప్రవర్తన అర్థం కాలేదు. ఎందుకలా కాలితో చప్పుడు చేస్తున్నాడు? దాని అర్థం ఏమిటి? నిద్రపోతున్న మంగళకు మెలుకువ వచ్చేలా చెయ్యటమా?

ఐదు నిముషాలు గడిచాయి.

అతను కాలితో చప్పుడు చెయ్యటం ఆపి వెళ్ళి కిటికీ తలుపులను మూశాడు. తర్వాత స్విచ్‌బోర్డు దగ్గరకు వెళ్ళి లైటును వేశాడు.

కళ్ళు మరింత గట్టిగా మూసుకుంది మంగళ.

అతన్ని లైటు వెలుతురులో మరింత స్పష్టంగా చూశాడు డిటెక్టివ్ జగదీష్. మోహన్ కూడా చూశాడు ఆశ్చర్యంగా ఆ మనిషిని. ఇంతకుముందు ఎక్కడా చూడలేదు వాళ్ళు.

అతను బీరువా చాటుకు వెళ్ళి సగంవరకు దాక్కున్నాడు. తర్వాత జేబులోనించి ఓ ఖాళీ సీసా తీసి

బీరువా పైన వుంచి దాన్ని కిందకు నెట్టాడు. చప్పుడయింది. గాజు పెంకులు చిందరవందరయినాయి.

ఎంత నిగ్రహించుకున్నా మంగళ వుండలేకపోయింది. మళ్ళీ అదే చప్పుడు. ఆ రాత్రి బీరువా చాటున దృశ్యం కళ్ళముందు కనపడి చప్పుడు కాగానే 'కెవ్వున' అరిచింది.

అంతే. మంచం కిందనించి జగదీష్, బయటకు దొర్లి లేచి ఒక్క గెంతులో బీరువాదగ్గరకు వెళ్ళాడు.

"భయపడకు మంగళా" అన్నాడు మోహన్ బయటకు వచ్చి.

మోహన్ గొంతు వినగానే బీరువా చాటున నిలబడిన ఆ మనిషి కంగారుపడి దాని చాటునించి బయటకు వచ్చాడు.

వెంటనే ఆతనిమీద పడి చేతిని పట్టుకుని వెనక్కు విరిచాడు జగదీష్. చేతిలోని కత్తి కిందపడి ఖంగున చప్పుడయ్యింది.

అతని మెడలోని పాము కోరలు తీయబడినది. బాధగా అరిచాడు ఆ మనిషి.

"ఎవరు నువ్వు?" అడిగాడు జగదీష్ ఆ చేతిని మెలి తిప్పుతూ.

బాధగా అరుస్తూనే వున్నాడతను.

ఇంతలో మోహన్ వచ్చి ఆ మనిషి మొఖానికి వున్న మాస్కును లాగేశాడు.

"మీరేనా!" అన్నది మంగళ షాక్ కొట్టిన దానిలా అదిరిపడి.

"ఎవరు ఈయ నేనా దేవరాజు?"

"అవును." చెప్పాడు మోహన్.

తల వంచుకొన్నాడు దేవరాజు.

"ఏమిటీ వేషం?" అడిగాడు జగదీష్.

"నువ్వింత నీచుడివనుకోలేదు." అన్నది మంగళ చీదరింపుగా.

దెబ్బతిన్నవాడిలా చూశాడు దేవరాజు.

"మొత్తానికి బలే ఏర్పాటు చేసుకున్నారు దేవరాజుగారూ. ఇంతకీ ఏమిటి ప్లాను? మంగళను చంపటమేనా?" అడిగాడు జగదీష్-దేవరాజును అసహ్యంగా చూస్తూ.

"మీరెవరు?" అడిగాడు దేవరాజు.

"డిటెక్టివ్ జగదీష్."

"ఇంతకీ ఇదంతా మీరెందుకు చేస్తున్నారో చెబుతారా?"

ఒక్క నిముషం దేరాజు మాట్లాడలేదు. తర్వాత చిన్నగా అన్నాడు.

"చెబితే మీరు నమ్మరేమో. నాకు పదేళ్ళక్రితం కారు యాక్సిడెంటయింది. కొన్ని నరాలు దెబ్బతిన్నాయి. నేను సంసార జీవితానికి పనికిరానని డాక్టరు నిర్ణయించారు. ఈ విషయం తెలిసిన నా భార్య కారు డ్రయివర్‌తో అక్రమ సంబంధం ఏర్పరుచుకుంది. ఈ విషయం నేను గ్రహించాను. కాని తెలియనట్లు వూరుకున్నాను.

ఆమెను హత్య చెయ్యాలనుకున్నాను. అయితే ఆమెకు తెలియకుండా కాదు. తెలిసేలా భయపెట్టి చెయ్యాలనుకున్నాను. మాస్క్ తయారు చేయించాను. ఒకరోజు రాత్రి ఆమె నిద్రపోతుండగా గదిలో ఫ్లవర్ వాజ్‌ని ఎత్తునించి కింద పడేశాను. ఆ చప్పుడికి ఆమె ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. ఎదురుగా మాస్క్ ధరించిన నేను కత్తి పట్టుకుని నిలబడ్డాను.

అంతే. నా భార్య భయంతో కళ్ళు పెద్దవిచేసి అరవ టానికి నోరు తెరచింది. కాని అరవలేదు. భయంతో అలాగే బిగుసుకుపోయి చచ్చిపోయింది. నేను హత్య చెయ్యవలసిన అవసరం లేకుండా సరిపోయింది.

అప్పటినించే నాలో ఓ విచిత్రమయిన ప్రవృత్తి ఏర్ప డింది. వయసులో వున్న ఆడవాళ్ళను అలాగే భయపెట్టి చంపాలనుకోవటం.

ఆ కోరిక మొదటిసారిగా గజపతిరావు ద్వారా పంపించ బడిన మోహన్ చెల్లెలు సుమతి తీర్చింది. నన్ను బీరువా చాటున చూడగానే భయంతో అరవబోయి చచ్చి పోయింది. ఆ శవాన్ని నేను ఇంటివెనుక పూడ్చిపెట్టాను. అందరికీ ఎప్పుడో నా ఇంట్లోంచి వెళ్ళిపోయిందనిచెప్పాను.

అయితే నా కొడుకు నరేంద్రకు ఈ విషయాలేవీ తెలీదు. వాడిని కంపెనీ పనులమీద వూళ్ళకు పంపిస్తూ వుంటాను. వాడు ఇంట్లో వుంటే బహుశ నాకు యిటు వంటి అవకాశం కలగకపోవచ్చు.

గజపతిరావుకి కూడా నా విషయం తెలీదు. అందుకే మంగళను నా దగ్గరకు ఉద్యోగం కోసం పంపించాడు. అందమైన మంగళను చూడగానే మళ్ళీ నాలో ఆ విచిత్ర మైన కోరిక బలంగా చెలరేగింది. అందుకే ఆమెకు ఉద్యోగం ఇచ్చి ఈ ఇంట్లోనే వుండమని ఈ గది ఇచ్చాను.

ఈమెనుకూడా భయపెట్టి చంపామనుకున్నాను. కాని కుదరలేదు. ఈమె చనిపోయిన తర్వాత ఎక్కడెక్కడ కత్తితో పొడవాలో కూడా ముందుగానే ఫోటోల మీద గుర్తు పెట్టుకున్నాను.

"ఫోటోలమీదా? ఏ ఫోటోలు?" ఆశ్చర్యపోయి

వింటున్న జగదీష్ అడిగాడు.

"నిన్న రాత్రి మంగళకు మత్తుమందు వాసనచూపించి స్పృహ పోగానే నగ్నంగాచేసి కొన్ని ఫోటోలు తీశాను. ఆ ఫోటోలమీద ఎక్కడెక్కడ ఆమె శరీరం మీద కత్తితో పొడవాలో గుర్తు పెట్టుకున్నాను.

ఎందుకంటే నాకు ఆడదాని శరీరమంటే ఓ విధమైన కసి యేర్పడింది. నా అశక్తతవల్ల, నా భార్య ప్రవర్తన వల్ల. అందుకే ఇలా చెయ్యటం. నా భార్య చనిపోయిన తర్వాత అట్లాగే చేశాను. సుమతిని కూడా అలాగే చేశాను. మంగళకు కూడా అలా చేద్దామనే అనుకున్నాను కాని మీ జోక్యంవల్ల కుదరలేదు. పట్టుబడ్డాను.
నేను నేరస్తుడిని. అంతేకాదు, మహా పాపిని. నాకు నేనే శిక్షించుకుంటాను. ప్లీజ్. ఆ కత్తిని ఇలా ఇవ్వండి. నా గుండెల్లో పొడుచుకుంటాను" అన్నాడు దేవరాజు.

మోహన్ ముఖం కోపంతో ఎర్రబడింది తన చెల్లెలు సుమతి ఎంత ఘోరంగా చనిపోయిందో వినగానే.
మంగళ మొహం భయంతో పాలిపోయింది తను ఎటువంటి చావుకు గురి అయ్యేదో తల్చుకుంటే.

"సారీ. ఎవరికి వాళ్ళు శిక్షలు విధించుకుంటే చట్టం ఎందుకు? మీ నేరాలకు ఎటువంటి శిక్ష విధించాలో కోర్టుకు తెలుసు. కోర్టు విధించే శిక్షను అనుభవించండి. అదే మీ నేరాలకు ప్రతిఫలం," అన్నాడు డిటెక్టివ్ జగదీష్ ఫోన్ వైపు నడుస్తూ.

—:ఐపోయింది:—

# పొగమంచు




ముద్దా సురేష్

# (ఐదవ భాగము)

"ఓహ్! కమాన్ మిస్టర్ రాణా! ప్రతి విషయాన్నీ అనవసరంగా శంకిస్తావ్. ఆ పొగమంచు వాతావరణంలో మార్పులవల్ల యేర్పడి వుండొచ్చు. దగ్గర్లో వున్న యేదో ఫాక్టరీవల్ల యేర్పడి వుండొచ్చు. ప్రకృతి రహస్యాలు ఛేదించి, మానవుడింకా తెల్సుకోవాల్సిన విషయాలు చాల వున్నాయి. అన్నిటికీ మిలటరీ బేస్‌ని బ్లేమ్ చేయడం బావుండదు. అంతెందుకు? మొన్న నిన్ను చూడ్డానిక్కాంబే వచ్చినప్పుడు నాకు నేనుగా ఆ విచిత్రమైన పొగలో ప్రవేశించాను...."

"కాని భూకంపానికీ, మిలటరీ పరిశోధనలకీ సంబంధం వుందని మీరనుకొంటున్నారు."

"డెఫెనిట్లీ నాట్. డియర్ బోయ్! కొన్ని అంశాల్లో డిఫెన్స్ మినిస్ట్రీ ప్రవర్తన, మన యిద్దరకూ కూడా నచ్చదని నీకు తెల్సు. అలాగని, వాళ్ళు, యిలా బాధ్యతారహితంగా, వివేకహీనుల్లా....మనిషి జీవనాన్ని ప్రత్యక్షంగా నష్టపరిచే యిలాంటి ప్రమాదాల్ని సృష్టిస్తారనుకోవడం పొరపాటు."

"నేను పంపిన ఫోటోల సంగతేమిటి? అందులో అనుమానం రేకెత్తించే విశేషాలు లేవూ? ఒక ఫోటోలో ఆ గొడుగులాంటి ఆకారాన్ని పరీక్షించా...."

"ఇట్ కెన్ ప్రూవ్ నథింగ్!" అర్చాడు రామ్‌కింకర్ అసహనంగా. "మన అనుమానాల్ని అవి ఏ విధంగానూ నిరూపించలేవ్!"

తన కంఠంలో తీవ్రత ఆయన గుర్తించాడు.

మరోసారి భారంగా కుషన్డ్ ఛైర్‌లో వెనక్కి జారబడ్డాడు.

నెమ్మదిగా పల్కిందిప్పుడతని గొంతు.

"ఎస్ వే, వాటిని తగల్బెట్టేసా.."

"వ్వాట్?"

"కాంట్ యూ అండర్ స్టాండ్ ది డేంజర్ బిహైండ్ యిట్ రాణా?

నీకు రాబోయే ప్రమాదాన్ని ఊహించలేవూ?

డిపార్ట్ మెంట్ కి రాబోయే ప్రమాదాన్ని గ్రహించలేవూ?

మనిది గూఢచారి శాఖ కాదు మిస్టర్ రాణా!

వాతావరణ కాలుష్య పరిశోధన శాఖ!

ఇన్వెస్టిగేషన్ విషయంలో మనకి కొన్ని పరిధులున్నాయ్.

ఆ సీక్రెట్ ఇన్ స్టాలేషన్ కి సంబంధించిన ఫోటోలు మనదగ్గరున్నాయన్న విషయం బైటపడితే?...."

"డటీజ్ ది హెల్ విత్ యూ బాస్! నన్ను అక్కడికి సంపడంలో మీ ఉద్దేశం ఏమిటి?"

"ఫోటోలు తియ్యడాన్కి. ఎస్స్. కాని వాటిని ఉపయోగించడాన్కి కాదు. వ్యక్తిగతంగా నాకు కొన్ని ఆధారాలు కావలసివచ్చింది. మిలటరీ ఆధీనంలో ఉన్న ఖరీదైన, దాదాపు వంద ఎకరాలు పైగా విస్తరించి వున్న ఆ భూమి వృధా చేయబడుతోంది. అందమైన ప్రకృతితో టూరిస్టు ప్లేస్ గా ఉండాల్సిన ఆ ఖుల్నా ప్రాంతం సద్వినియోగం కావడంలేదు. ఈ విషయాలలో నేను డిఫెన్స్ శాఖతో గట్టిగా వాదించడాన్కి కావల్సినన్ని ఆధారాలు...."

"ప్లీజ్ స్టాపిట్ బాస్!" నవ్వాడు రాణా. "ఈ కట్టుకథ, మీ పర్సనల్ సెక్రటరీ మోనాను కూర్చోబెట్టి

చెప్పండి. ఇన్ని సంవత్సరాలు డిపార్టుమెంట్‌లో ఉన్న నాతో మీరు అసలు విషయాలు చెప్పడాన్కి ఎందుకు జంకుతున్నారో అర్థం కావడంలేదు."

కంగారుగా చూశాడు రామ్‌కింకర్. "దేఖో రాణా! నేను డిఫెన్స్ మినిస్ట్రితో కొన్ని సంప్రదింపులు చేస్తున్నాను. ప్రస్తుతం ఆ శాఖలో విచిత్రమైన సెక్యూరిటీ వల అల్లుకుని ఉంది! దీనిలో అంతరార్థం ఏమైనా వుందో లేదో నాకు తెలీదు. ఉంటే మనం చేయగలిగేదేమీ లేదు కూడా. ఈ మధ్యాహ్నం నేను రక్షణ మంత్రితో మాట్లాడాన్కి ఓ సమ్మావేశం అరేంజ్ చేయబడింది. కొన్ని సమాధానాలు వస్తాయని ఆశిద్దాం. ఈ విషయం నిన్ను నన్ను దాటి పోకూడదని నీకు వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను."

"ఈ దుర్ఘటనలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆర్మీ హస్తం వుందని మీరు కనుక్కొంటే?"

భుజాలెగరేసాడు రాంకింకర్. "వుయ్ షల్ హావ్ టు వెయిట్ అండ్ సీ."

"ఎప్పుడూ యిచ్చే జవాబే! ఈ తతంగాల్ని ఫైల్స్‌లో మెంటైన్ చేస్తారని ఆశించినా? ఎస్ ఆర్ నో సర్?"

కోపంతో యెగిరి పడ్డాడు రాంకింకర్. "డామ్ యువర్ రివోల్టింగ్ యాటిట్యూడ్! నీ స్థానం, నీ పరిధి మర్చిపోతున్నావ్. నా ఉద్దే...." వుద్రేకంలో ఆయన మాటలు తడబడ్డాయ్....

"నేను డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎన్విరాన్‌మెంట్‌లో సీనియర్ ఆఫీసర్ని. ఈ విషయంలో ఆర్మీ హస్తం వున్నట్లు రుజువైతే పేపర్ పబ్లిసిటీ...."

బాస్ సైగ చూసి, ఆగిపోయాడు రాణా.

ప్రశాంతంగా వుండడాన్కి ప్రయత్నిస్తూ అన్నాడు రాంకింకర్. "యిక మౌనం వహిద్దాం రాణా! ఆర్గ్యుమెంట్స్‌వల్ల వుపయోగం...."

మళ్ళీ తడబడ్డాయ్ ఆయన మాటలు..

ఆయన ముఖంలో హఠాత్తుగా యేర్పడ్డ మార్పులు గమనిస్తూనే వులిక్కిపడ్డాడు రాణా.

రామ్‌కింకర్ చూపులు యిప్పుడు శూన్యంగానే వున్నాయ్! "వాట్స్ రాంగ్ బాస్?? వాట్...."

అప్పటికే చివాలున లేచి నిలబడ్డాడు రామ్‌కింకర్, శూన్యంగా చూసే కళ్ళతో....

ఆయన గిరుక్కున వెనక్కి తిరిగి కిటికీవైపు అడుగులు వేసాడు.

రామ్‌కింకర్ అద్దాల కిటికీ తలుపులు తెరిచి, ఒక్క క్షణం మౌనంగా రాణావేపు చూసాడు.

ఆ ఒక్క క్షణం ఆయన కళ్ళు రాణాని గుర్తించాయ్. కెమెరా క్లిక్‌మన్నట్లు మళ్ళీ శూన్యంగా మారాయ్!

అప్పుడు ఆయన తిరిగి కిటికీవేపు తిరిగాడు. కిటికీ యెక్కాడు.

అంతా క్షణంలో జరిగిపోయింది!

రాణా పరిస్థితి అర్థం చేసుకోనేలోగా, రామ్‌కింకర్ బైటికి దూకేశాడు.

రాణా నిశ్చేష్టుడైపొయ్యాడు!

నోరు తెర్చుకొని, కుర్చీలో కొయ్యబారిపోయాడు!

అతను చూసిన విషయాన్ని, అతని మెదడు నమ్మడాన్కి-అంగీకరించడంలేదు. అకస్మాత్తుగా "బాస్!" అంటూ పిచ్చిగా అరుస్తూ కిటికీవైపు రివ్వున పరిగెత్తాడు. తొమ్మిది అంతస్థులు క్రిందుగా పేవ్‌మెంట్ మీద చితికి

పడున్న ఆకారం అతని కంట బడింది.

ఆయాసంతో, బలహీనంగా ఒగురుస్తూ కిటికీ అంచుకు జారబడ్డాడు రాణా.

ప్రజలు గుంపులు గుంపులుగా, విరిగి, నలిగి, పడివున్న ఆ కళేబరం చుట్టూ చేరుకుంటున్నారు.

ఏమయింది?

బాస్ ఎందుకు దూకాడు? కారణమేమిటి?

ఆయన ఆలోచనా సరళిని అకస్మాత్తుగా మార్చేసిన దేమిటి?

ఆ ఫీలింగ్ మళ్ళీ రాణాలో ప్రవేశించసాగింది.

లూసీ, రాణాలు యిద్దరూ ఆ విచిత్రమైన పొగ మంచులో ప్రవేశించినపుడు వారి వీపుమీద ఏదో పాకి నట్లు పొందిన అనుభూతి!

అదే అయ్యుంటుందా?

ఒళ్ళు జలదరించింది రాణాకి.

అతని అనుమానానికి ఆధారం?

రాణా మనసుకిపుడు ఆధారాలక్కర్లేదు.

ఆ భయంకరమైన అనుభూతి చాలు!

చివాలున పైకి లేచాడు రాణా.

ఆఫీసులోకి ప్రవాహంలా ప్రవేశిస్తున్న జనాన్నితోసు కుంటూ బైటికి నడిచాడు. రాణాలో యిప్పుడు ఒకే ఆలోచన. తను వెంటనే లూసీని చేరుకోవాలి!

రాణా టాక్సీలో బయలుదేరాడు.

రాణా అసహనాన్ని విస్తుపోతూ చూస్తున్న డ్రైవర్ అతను తన చేతిలో బలవంతంగా పెట్టిన రెండు పదినోట్లు చూడగానే-ముఖం చేటంత చేసుకున్నాడు.

ఫలితంగా-టాక్సీని స్పీడుగా విన్సెంట్ రోడ్డులోకి

మళ్ళించి, జాకబ్ సర్కిల్ వైపు రాకెట్‌లా పరిగెత్తించాడు.

రాణా ఆలోచనలన్నీ అతని ప్రేయసిమీద కేంద్రీకృతమై వున్నాయ్.

లూసీకేమీ కాలేదు కదా?

బస్ యాక్సిడెంట్ సంఘటనలో - లూసీ కార్లో వుంది.

ఆ పొగమంచు ఆమెపై ప్రభావం చూపకపోవచ్చు.

తన సంగతేమిటి?

తను చాలసేపు పొగమంచులో వున్నాడే!

పొగమంచుకి పూర్తిగా తాను ఎక్స్‌పోజ్ అయ్యాడు.

అయినా తను బాగానే వున్నాడు.

కాని బాస్-రామ్‌కింకర్???

రెండురోజుల క్రితం - తను హాస్పిటల్‌లో వుండగా తనను చూడ్డానికి వచ్చినపుడు దార్లో తను పొగమంచులోంచి ప్రయాణించానని ఆయన చెప్పాడు!

అదీ-యిదీ ఒకే పొగమంచా?

హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది రాణాకి.

ఆ విచిత్రమయిన వాసన!

పొగమంచులో పసుపుదనం!

అగాంధంలోంచి వచ్చింది కూడా అదే రంగు!

అదే వాసన!

రెండూ ఒకటేనా?

అదే తనని పిచ్చివాడ్ని చేసిందా?

ఒకవేళ .........

తను యిప్పుడు పిచ్చివాడేనా?

టాక్సీ చిన్న జర్క్‌తో ఆగిపోయింది.

రాణా వేగంగా తన ఫ్లాట్ తలుపును తెరుచుకొని తడబడుతూ జేబుల్లో చేతులు పెట్టుకుని తాళం వెతుక్కోసాగాడు.

లూసీ ఆరోగ్యంగా వుంటే?

తను ఫూల్ కావాలి.

పరిపరివిధాల ఆలోచనలతో సతమతమౌతూ రాణా తలుపు తెరిచాడు.

అతని వెన్నెముకలోంచి ఒక్కసారిగా చలి పుట్టుకొచ్చింది.

అంతా చీకటిగా వుంది....

లూసీ యింకా నిద్రపోతోందేమో?

లూసీని పేరుతో పిల్చాడు గుమ్మంలో నిలబడి తగ్గు స్వరంతో ఆమెను హడలుకొట్టడం యిష్టంలేక.

జవాబు లేదు.

లాంజ్ కి వెళ్ళే తలుపు సగం తెర్చుకొని వుంది.

తలుపు పూర్తిగా తెరుస్తూ-లోపలికి చేరి లైట్ వేశాడు.

గది ఖాళీగా వుంది.

అంతా—అతను వదిలిపెట్టి వెళ్ళినప్పటిలాగే వుంది.

వంట గదిలో ప్రయత్నించాడు రాణా.

ఖాళీ!

పడగ్గది తలుపులు చేరుకొని, హాండిల్ పట్టుకొని మెల్లగా లోనికి తోసాడు రాణా.

"లూసీ?"

నిశ్శబ్దం—

చీకట్లో బెడ్ ని చూడగలుగుతున్నాడు రాణా. కానీ బెడ్ షీట్స్ క్రింద ఎవరైనా వున్నదీ లేనిదీ కన్పించడం

లేను.

లైట్ వేశాడు.

సరిగ్గా అప్పుడే—

అతని వెనుకనుంచి వెలువడ్డ భీకరమైన జంతువు కేక లాంటి అరుపు-

అతని ప్రాణాల్ని క్రుటిలో కాపాడగల్గింది.

ఆ శబ్దానికి త్రుళ్ళిపడుతూ మెరుపులా ప్రక్కకి జరిగాడు రాణా.

గురితప్పిన లూసీ చేతిలోని కత్తి అతని కోటుని నిలువునా చీల్చేసింది!

వీపు ప్రక్కగా సన్నని చీరుకుపోతూ, యేర్పడ్డ గాయానికి బాధగా పళ్లు బిగబట్టాడు రాణా.

ఆమె అతనిముందు నిలబడి వుంది.

ఆమె చూపులు భావశూన్యంగా వున్నాయి....

మరణించిన జంతువు నోరులా,ఆమె నోరు వెనక్కిసాగి, తెర్చుకొని వుంది.

ఆమె బుగ్గలపై రక్కుకున్న గుర్తులున్నాయ్. ఆమె గడ్డంమీదుగా చారలు కట్టిన చొంగ లైట్ కాంతిలో భయంకరంగా మెరుస్తోంది.

ఆమె గొంతులోంచి విచిత్రమైన గరగర శబ్దం వెలువడుతుండగా కత్తిపట్టిన ఆమె చెయ్యి తటాలున పైకి లేచింది.

మెరుపులా ఆమె కత్తిని కిందికి దింపింది!

కాని ఈసారి రాణా రెడీగా వున్నాడు.

అతను వెనక్కి తప్పించుకుంటూ, కత్తి వున్న ఆమె చేతిని పట్టుకోబోయి విఫలనుయ్యాడు.

మరోసారి పైకి లేచింది ఆమె చేయి-ఈసారి కత్తి

అతని పొట్టను గురిపెట్టబడి వుంది.

ఒకచేయి పైకెత్తి ఆమె చేతిని పిడికిలితో బిగించి, మరో చేత్తో ఆమె నడుం బంధించి దగ్గరగా జరిగాడు రాణా.

ఒక్క క్షణం యిద్దరి ముఖాలు దగ్గరయ్యాయి, దాదాపు స్పర్శించుకుంటూ—

అంతే!

ఆమె పళ్ళు బలంగా అతని దవడలో దిగబడ్డాయి.

రాణా బాధగా అరుస్తూ గింజుకుంటూ పెనుగులాడాడు.

ఇద్దరూ మంచంమీద, వెనక్కి తూలి పడ్డారు.

కత్తికోసం యిద్దరూ పెనుగులాడసాగారు.

ఆమె ఎడంచేయి సాచి గోళ్ళతో అతని ముఖాన్ని రక్కడానికి ప్రయత్నిస్తోంది.

రాణా ఆమె చేతిను వెనక్కి విరిచి పట్టుకున్నాడు పిడికిల్లోంచి కత్తిని వేరుచేసే ప్రయత్నం చేస్తూ-

కాని ఆమె శక్తి పైశాచిక శక్తి!

రాణా ఓ చెయ్యి ఆమె గడ్డంక్రిందుగా తీసుకొచ్చి మోచేత్తో కంఠాన్ని నొక్కిపట్టాడు, తల వెనక్కి వంచుతూ, ఒకశంక ఆమెకు ఊపిరి ఆడకుండా చేస్తున్నానేమోనని భయపడ్తూ—

లూసీ కీచుగా అరిచింది ఊపిరి అందక బాధబడ్తూ.

ఆమెను వదిలేశాడు రాణా.

అంతే!

లూసీ మోకాళ్ళతో బలంగా అతని పొత్తికడుపు మీద బలంగా తన్నింది.

కడుపులో ప్రేవులు కల్సిపోయినట్లయింది రాణాకి.

బాధగా కడుపు పట్టుకుంటూ ఆమెవైపు చూసాడు.

ఆమె చేతిలోని పదునైన కత్తి అతనివైపు వస్తోంది.

వెనక్కి జరుగుతూ బూటుకాలితో ఫెడేల్న తన్నాడు రాణా.

కత్తి ఎగిరి ఖంగుమంటూ దూరంగా పడింది.

రెచ్చిపోయింది లూసీ! నిప్పులుకురిసే కళ్ళతో చూస్తూ అతని కళ్ళు పీకేయడాన్కి రెండు చేతులు ముందుకు జాపింది.

ఆమె రెండు చేతులు అందుకొని వెనక్కి తోయ బోయాడు రాణా. కాని యిద్దరూ ఒకరిమీద ఒకరు మంచంమీద పడ్డారు.

కుషన్ మంచాన్ని కుమ్మేస్తూ యిద్దరూ పెనుగులాడ సాగారు.

ఆమె అతని ముఖంపై వుమ్మేస్తోంది, వికృతంగా అరుస్తూ....

ఆమెను దెబ్బతీయ్యడాన్కి నిజానికి రాణాకి అంత సమయం అవసరంలేదు కాని తన ప్రియురాల్ని గాయ పర్చడం అతని లక్ష్యం కాదు. అందుకే అతను విఫల మౌతున్నాడు.

పెనుగులాటలో బెడ్‌షీట్ వారికి చుట్టుకుపోగా, గింజుకుంటూ మంచంమీంచి యిద్దరూ దభాల్న నేలమీద పడ్డారు.

మోకాలితో అతన్ని పొడవడాన్కి ప్రయత్నం చేస్తూంది లూసీ. కాని దుప్పటి వారి చుట్టూ చుట్టుకు పోడంతో ఆమె ప్రయత్నం విఫలమౌతోంది.

పెనుగులాడుతూ, రాణా ఆమె బ్లౌస్‌ని పట్టుకున్నాడు, లూసీ వెనక్కి గింజుకోగా, బ్లౌస్ సర్రున చిరిగిపోయి.

ఆమె స్తనాలు బయటపడ్డాయి.

రాణా తనను తాను అసహ్యించుకున్నాడు.

తను బాధాకరమైన పరిస్థితిలో వున్నాడు.

ఆమెపై అతనికి జాలి కలిగింది.

లూసీ నోటి నుంచి వెలువడ్డ వికృతమైన నవ్వు—మళ్ళీ ఆతనిలో ప్రవేశించిన జాలిని అవతలికి నెట్టింది.

బెడ్ షీట్ లోంచి బైట పడ్డానికి ప్రయత్నించ సాగాడు రాణా.

ఆమె నవ్వు వింటుంటే ఆతని ఒళ్ళు జలదరిస్తోంది.

లూసీ చేయి టీపాయ్ మీదున్న టేబిల్ లైట్ ని అందుకొంది!

మరుక్షణం ఆమె చేయి రివ్వున క్రిందికి దిగింది. గురి తప్పి—రాణా భుజంమీద బలంగా క్రాష్ అయింది టేబుల్ లైట్.

రెచ్చిపోతూ లేచి నిలబడ్డాడు రాణా. ఉద్రేకంలో కంపిస్తూ పిడికిలి బిగించి ఆమె కడుపులో గుద్దాడు.

పొట్టపట్టుకుని ఆమె బాధగా అర్చింది — బలంగా ఊపిరి పీలుస్తూ....

అంతే! ఆమె చంపలు అటూ ఆటూ ఛెళ్ళు ఛెళ్ళున మ్రోగసాగాయి, తలను అటూ ఇటూ ఎగరగొడ్తూ.

ఆమెను పైకి లేవనెత్తుతూ మళ్ళీ కొట్టాడు రాణా పిచ్చి ఆవేశంతో.

పెదిమలు చిట్లి రక్తం కార్తోండగా, మూలుగుతూ పడివున్న లూసీని చూడగానే అతని ఆవేశం జారి పోయింది.

ఆమె పక్కగా మోకాళ్ళమీద కూర్చున్నాడు రాణా లూసీని ప్రేమగా చేతుల్తో చుట్టి సున్నితంగా కదుపుతూ

"లూసీ....! ఓహ్ లూసీ....అయామ్ సారీ డార్లింగ్!" హీనంగా పలికాడు రాణా-ఒకక్షణం ఆమె వికృత చేష్టలను మర్చిపోయి.

మెల్లగా ఆమె ఊపిరి మామూలు కావడం, ఆమెలో తిరిగి చలనం కన్పించడం చూసి కంగారుగా అటూఇటూ చూసాడు రాణా.

వారగా పడివున్న దుప్పటి కనబడింది.

దాన్ని అందుకుని, స్రవిస్తున్న మధ్యకు చించాడు రాణా.

లూసీ మోచేత్తో మెల్లగా పైకి లేవసాగింది.

కంగారుగా ఆమెను నేలమీద నొక్కిపెట్టి చేతులు వెనక్కి విరిచి పట్టుకున్నాడు రాణా.

లూసీ గింజుకోసాగింది....

కాని ఆమె వీపుమీద కూర్చొని వున్నాడు రాణా.

అతను ఆమె చేతులు బంధిస్తుండగా ఆమె తల అటూ ఇటూ ఊపుతూ వికృతంగా అరవసాగింది.

అకస్మాత్తుగా, తల వాల్చేస్తూ ఆమె స్పృహకోల్పోయింది. రాణా ఆమెను సున్నితంగా యెత్తుకొని, బెడ్ మీదకు చేర్చాడు.

ఆమె కనుబొమలమీద తడిని కర్చీఫ్‌తో తుడిచాడు. పెదిమలమీద రక్తాన్ని తుడిచాడు. స్తనాలని బహిర్గత పరుస్తూ, రెండు చీలికలుగా చీలిపోయిన ఆమె బ్లౌజ్ మీద టవల్ కప్పాడు.

తొడలమీదుగా చెదిరిపోయిన స్కర్టుని సరిచేశాడు. చంప చర్మం మండడంతో కర్చీఫ్‌తో బుగ్గమీద అద్దుకున్నాడు రాణా.

కర్చీఫ్ అంతా రక్తంతో తడిసిపోయింది.

లూసీ తనకు కలిగించిన నష్టం యిప్పుడే తెలుస్తోంది

రాణాకి.

అమాయకంగా మంచంమీద పడివున్న ఆమెను తదేకంగా చూస్తూ ఎదురుగా కూర్చుండిపోయాడు రాణా.

ఆ గాస్,

ఆ పొగమంచు లూసీమీద యెంత ప్రభావాన్ని చూపింది?

మళ్ళీ ఎప్పటికైనా నార్మల్ కండిషన్‌లోకి వస్తుందా లూసీ?

తన బాస్ రామ్‌కింకర్‌లాగే ఈమెకూడా ఆత్మహత్యా ప్రయత్నం చేస్తుందా?

నిజానికి తనుకూడా ఆ విషమేఘం ప్రభావంలో వుండగా, గాజుముక్కతో కంఠాన్ని కోసుకోడానికి ప్రయత్నించాడే?

ఆ పసిపాప ఈ విషమేఘం వల్లనే మరణించింది! కాని ఆమె అగాధంలో వుండడంచేత విషమేఘం—ఎక్కువ ఎఫెక్ట్ చూపించి వుండొచ్చు. పైగా ఆమె లేత వయస్సుకి, దాన్ని తట్టుకొనే శక్తి తక్కువ.

రాణా ఆశ ఒక్కటే.

లూసీ ఎక్కువసేపు పొగమంచులో ఎక్స్‌పోజ్ అవ్వలేదు. కారుకి అద్దాలు తీసి వుండడంవల్ల ఆ ప్రభావం ఆమె మీద పడివుండాలి! అన్న నిర్ధారణకు వచ్చాడు రాణా.

అతని లక్ష్యం యిప్పుడు ఒక్కటే. లూసీని వెంటనే హాస్పిటల్‌కి చేర్చాలి.

ఆమె ఒకర్ని హింసించకుండా—తనను హింసించుకోకుండా వుండేటట్లు చూడాలి.

మేఘం—విష ప్రభావానికి తట్టుకొని నిలబడే శక్తి

లూసీ మస్తిష్కాన్కి వుంటుందా?

ఆమె కోలుకోనే ప్రసక్తి ఈ విషయం మీదే ఆధార పడి వుంటుంది. అయిదు నిముషాల తర్వాత పోలీసులు వచ్చి తలుపు బాదే వరకు అర్థ-చీకటిలో అలాగే కూర్చుని వున్నాడు రాణా.

* * *

రాణా వేగంగా తలుపువద్దకు చేరుకున్నాడు, లూసీని ఎక్కువసేపు ఒంటరిగా వదల్లాన్కి భయపడ్తూ.

పోలీసుల్ని చూడగానే ఆశ్చర్యపోయాడు రాణా.

లూసీ కేకలు విని ప్రక్క పోర్షన్ వాళ్ళు పోలీసులకి ఫోన్ చేశారా?

ఇద్దరు—నిలబడివున్నారు.

ఒకవ్యక్తి పోలీసు యూనిఫాంలో.

మరో వ్యక్తి మఫ్టీ దుస్తుల్లో.

"మిస్టర్ రాణా?" మఫ్టీలోవున్న వ్యక్తి ప్రశ్నించాడు వేగంగా.

"ఎస్. మీరు వచ్చినందుకు చాల...."

మాటలు పూర్తికాకముందే లోపలికి తోసుకుంటూ వచ్చి అతను జేబులోంచి వేగంగా ఐడెంటిటీ కార్డు తీసి రాణా ముఖంముందు ఆడించి, వెంటనే జేబులో పెట్టుకున్నాడు. "అయామ్ ఇన్స్పెక్టర్ రైనా ఆఫ్ క్రైం బ్రాంచ్!

"కొద్దిసేపు క్రితం ఎన్విరాన్మెంట్ బిల్డింగ్ దగ్గర జరిగిన దుర్ఘటనకు మీరొక్కరే ప్రత్యక్ష సాక్షి అని మాకు తెల్సింది."

డిటెక్టివ్ యిన్స్పెక్టర్ రైనా, రాణా ఊహల్లో డిటెక్టివ్లా లేడు.

అతనికి ముప్ఫై సంవత్సరాల లోపే వుంటుంది వయసు. పోలోనెక్ జంపర్, పొడుగాటి స్వ్యేడో జాకెట్ ధరించాడు.

ఎర్రగా, దృఢంగా వున్నాడు. డేగ కళ్ళతో ఫ్లాట్ లోపలి భాగమంతా పరికిస్తున్నాడు.

"ఎస్. అది నిజమే. మా బాస్ ఆత్మహత్య చేసుకున్నాడు. కాని...."

"....మీ రెందుకు పారిపోయి వచ్చినట్లు?" అడిగాడు యిన్స్పెక్టర్ లోనికి నడుస్తూ, తలుపులు తెరిచి వరుసగా ఒక్కో గదిలోకీ చూస్తూ.

అతని ప్రశ్నను నిర్లక్ష్యం చేస్తూ గుమ్మంలో యూనిఫాంలో నిలబడివున్న లావుపాటి వ్యక్తివేపు తిరిగాడు రాణా. "లుక్ యిన్స్పెక్టర్! మనం వెంటనే అంబులెన్స్ని యిక్కడికి పిలిపిం...."

"నారిమన్! హోల్డు హిమ్!"

పొలికేక పెట్టాడు యిన్స్పెక్టర్ రైనా, బెడ్రూంలోకి మాయమౌతూ.

రాణా కంగారుగా బెడ్రూంవైపు కదులుండగా ఓ బలమైన హస్తం అతని చేతిచుట్టూ బిగుసుకొంది.

"యు డోంట్ అండర్స్టాండ్!"కోపంగా అన్నాడు రాణా "ఆమెను వెంటనే హాస్పిటల్కి చేర్చాలి" నారిమన్ పిడికిలినుండి చివాల్న తన చేతిని వదిలించుకొని బెడ్రూంలోకి పరిగెత్తాడు రాణా.

లూసీ చేతుల్ని బంధనంనుండి విముక్తిరాల్ని చేస్తూ కనబడ్డాడు యిన్స్పెక్టర్ రాణా.

"నో.... వెయిట్!" గాభరాగా అన్నాడు రాణా. "ఆమె కట్లు విప్పకండి. లూసీ మెంటల్ కండిషన్ బాగు

లేదు."

ఓ బలమైన హస్తం అతని మెడ చుట్టూ అల్లుకొని బలంగా వెనక్కి లాగింది. బరువుగా ఊపిరి పీలుస్తూ అరిచాడు.

రాణా "మీకు చెప్పినా అర్థం కాదు! నా మాట వినం...."

"మాకు అంతా అర్థం అయ్యింది మిస్టర్!" పిడుగుల్లా వినబడ్డాయి యిన్స్పెక్టర్ రైనా మాటలు.

"ఆఫీసులో నీ సహచరులు చెప్పారు, నీ మెంటల్ కండిషన్ బాగులేదని. డోంట్ మేక్ ఎనీ ట్రబుల్ ఫ్రెండ్! నీలాంటి వాళ్ళతో ఎలా డీల్ చెయ్యాలో మాకు బాగా తెల్సు."

రాణా తన కండరాల్ని వదులు చేస్తూ, రిలాక్స్ అయ్యాడు. అతన్కి రైనా మాటలు భయం కల్గించ లేదు. ప్రస్తుతం తాను చెయ్యగలిగేదేమీ లేదని గ్రహించాడు.

"ఆల్ రైట్ యిన్స్పెక్టర్ కాని నేను చెప్పేది ప్రశాంతంగా వినండి. ఆమెను అర్జంట్గా హాస్పిటల్కి చేర్చాలి." చెప్పాడు రాణా తన కంఠంలో తీవ్రతను తగ్గిస్తూ. "క్రిందటి వారం భావ్నగర్లో భూకంపం యేర్పడినపుడు నేను అక్కడే వున్నాను. అందులోంచి ఓ విధమైన గాస్ రిలీజ్ అయింది. అది మెదడును పాడు చేస్తుంది...."

"అది నీ మెదడును ఖచ్చితంగా పాడుచేసింది" అన్నాడు కఠినంగా క్రైంబ్రాంచ్ డిటెక్టివ్ రైనా, లూసీ నిలబడ్డంలో సహాయం చేస్తూ. "నువ్వామెను ఏం

చేసావో నాకు తెలీదు. కానీ ఆమె కళ్ళు చూడు. ఆమె ఆకారం చూడు. ఆ...."

"నో,నో.... దానికి కారణం నేను కాదు. విష మేఘం! పొగమంచు! రామ్‌కింకర్ కూడా ఆ విష మేఘంలో ఓసారి చిక్కుకున్నాడు. అది మెదడును పాడు చేస్తుంది!"

"మాకు తెల్సినంతవరకూ భూకంపం జరిగిన సమయంలో ఎటువంటి గాస్ రిలీజ్ కాలేదు."

"బట్ ఐ వజ్ ఇన్‌సైడ్ మిస్టర్ రైనా! భూమి చీలిపోయినపుడు నేను లోపల వున్నాను. గాస్ ఉన్నచోట."

"ఎస్." తలూపాడు రైనా "ఓ వ్యక్తి, ఓ పసిపాప, అగాధంలోంచి రక్షించబడ్డారని మాకు తెల్సు. ఆ పాప చనిపోయింది. ఆ వ్యక్తి నువ్వే అయివుండొచ్చు. కాని ఆ చీలికలో మీరిద్దరూ తప్ప మరెవ్వరూ వున్నట్లు సాక్ష్యం లేదు."

"వాళ్ళు ఆ చీలికలో లేరు." సహనం కోల్పోతూ అర్చాడు రాణా. "ఇది తర్వాత జరిగింది. వేరు వేరు సలాల్లో. అదే రోజున కాదు."

"ఆల్‌రైట్ సబిన్స్పెక్టర్! గెట్ హిమ్ ఔట్ టాఫ్ హియర్! ప్రశ్నలకు చాలా టైం వుంది."

"ఆగండి. నేనింకో విషయం చెప్పాలి!" సబిన్స్పెక్టర్ ఉక్కు హస్తాల్లో గింజుకుంటూ అరిచాడు రాణా "స్కూల్!.... నా మాట వినండి!బస్సులో ఒక స్కూల్ పిల్లలంతా విష మేఘంలో చిక్కుకున్నారు.... ఆ స్కూలు పేరు నాకు జ్ఞాపకం లేదు. కాని అది కాంబేలో వుంది. వారికేమయిందో వెంటనే కనుక్కోండి! ఈ పాటికి అక్కడ ఏదో దారుణం...."

* * *

పోలీస్ హెడ్ క్వార్టర్స్!

ఇంటరాగేషన్ గదిలో ఖాళీగావున్న టేబుల్ ముందు అసహనంగా కూర్చొని వున్నాడు రాణా.

గది బైట ఓ సాయుధుడైన పోలీస్ గార్డ్ కాపలా వున్నాడు.

"నాతో వున్నామెను యేం చేసారు?" సెంట్రీని మూడోసారి ప్రశ్నించాడు రాణా, ఆతృతగా.

ముందులాగే జవాబు లేదు.

ఆ రాతి విగ్రహాన్ని మట్లాడించడానికి ప్రయత్నించడం మూర్ఖత్వం అని గ్రహించాడు రాణా.

రాణా పోలీస్ హెడ్ క్వార్టర్స్‌కి వచ్చి మూడు గంటలయింది. ఆ మూడు గంటల్లో పదే పదే అడగబడ్డ ప్రశ్నలకు, చెప్పిన సమాధానాన్నే చెబుతూ వచ్చాడు రాణా.

తనపై యింకా పోలీసులకి నమ్మకం కలగకపోవడం సహజమే అని తెల్సుకున్నాడు రాణా.

తన బాస్ రామ్‌కింకర్ చనిపోయినపుడు తనొక్కడే అక్కడ వున్నాడు!

తన గదిలో దెబ్బలు తిని స్పృహ కోల్పోయిన ఓ యువతిని కనుక్కున్నారు పోలీసులు!

ఈ ఆధారాలు రెండూ చాలు పోలీసులు తనను నమ్మకపోవటానికి.

లూసీ యింకా షాక్‌లో వుందనీ, తమ ప్రశ్నలకు జవాబు యిచ్చే స్థితిలోలేదనీ చెప్పారు తనను యింటరాగేషన్ చేసిన పోలీసు అధికార్లు.

చివరికి ఎలాగో ఒప్పుకున్నారు కాంబే టౌన్‌లోని అన్ని స్కూళ్ళు చెక్ చెయ్యడానికి.

కిర్రున తలుపు తెర్చుకున్న శబ్దం విని ఉలిక్కిపడి వెనక్కి తిరిగాడు రాణా. యిద్దరు వ్యక్తులు పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ లోనికి వచ్చారు.

వెనక వ్యక్తి క్రైంబ్రాంచ్ డిటెక్టివ్ రైనా.

మొదటి వ్యక్తి సూపరింటెండ్ ఆఫ్ పోలీస్—వెనగ్గా చేతులు వెనక్కి పెట్టుకుని నిలబడ్డాడు రైనా.

ఎస్. పి. నవ్వుతూ వచ్చి రాణా కెదురుగా ఉన్న కుర్చీలో ఆశీనుడయ్యాడు.

పోలీస్ సూపరింటెండెంట్ మెహ్రోత్రా గంట క్రితం రాణాను యింటరాగేట్ చేయడంలో చాల నైపుణ్యం కనపరిచాడు.

ప్రశ్నలు అడిగేటప్పుడు, రైనాలో వుండే కోపం, దర్పం, మెహ్రోత్రాలో ప్రస్ఫుటం కావు.

ముద్దాయిపై సానుభూతి చూపిస్తూ జవాబులు లాక్కోవటంలో దిట్ట మెహ్రోత్రా.

రాణా నిజంగా ఓ ప్రమాదకరమైన పిచ్చివాడా? లేక తెలివైన అబద్ధాలకోరా? అన్న సమస్య పోలీస్ సూపరింటెండెండ్ మెహ్రోత్రాని వేధిస్తోంది.

ఇప్పటివరకూ ఓ నిర్ణయానికి రాలేదు.

చిన్నగా దగ్గి ప్రారంభించాడు మెహ్రోత్రా. "ఇప్పటి వరకూ కాంబేలోని పాఠశాలలన్నీ చెక్ చేయిస్తున్నాం" రాణాలో రియాక్షన్ కోసం యెదురుచూస్తూ అడిగాడు మెహ్రోత్రా.

"వాట్ హాపెండ్?" ముందుకు వంగాడు కంగారుగా రాణా.

"హా ఎవర్" పైపు ముట్టించుకుంటూ సంభాషణ కొనసాగించాడు సూపరింటెండెంట్, "కాంబే పోలి

మేరల్లో ఉన్న ఒక స్కూల్లో ఓ పెద్ద అగ్ని ప్రమాదం జరిగినట్లు మాకు రిపోర్టు అందింది."

"అదే! దానికి కారణం అదే!" ఉద్వేగంగా అన్నాడు రాణా.

"అప్పుడే కారణం చెప్పలేం. స్కూలుకు దగ్గర్లో వున్న జిమ్నాసియంలో ఈ అగ్ని ప్రమాదం జరిగింది. దాదాపు ముఫ్ఫైమంది పైగా విద్యార్థులు మంటల్లో ట్రాప్ అయినట్లు తెలుస్తోంది. బ్రతికి బైటపడ్డ విద్యార్థులు ప్రాణాపాయస్థితిలో వున్నారు. మోర్ ఓవర్ దె ఆర్ ఇన్ షాక్. వార్ని అప్పుడే ప్రశ్నలడగలేం. అగ్ని ప్రమాదాన్కి పూర్తి కారణాలు యింకా తెలియలేదు. కాని పాఠశాల పేరు మాత్రం తెల్సుకోగలిగాం...."

మెహ్రోత్రా చూపులు తీక్షణంగా మారాయి "పేరు బజాజ్ మెమోరియల్ స్కూల్!"

రాణా తలవంచుకొని టేబుల్ వైపు తదేకంగా చూసాడు. పేరు గుర్తుకు తెచ్చుకోవడాన్కి తీవ్రంగా ప్రయత్నిస్తూ.

"నో. కాదు. ఆ పేరు కాదనుకుంటూ. టీచర్ చెప్పాడు ఆ స్కూలు పేరు. కాని నాకు గుర్తుకు రావటంలేదు. ఆ టీచర్ కి ఓ చెయ్యి మొండి చెయ్యి. అదే జ్ఞాపకం వుంది. కాని ఈ క్లూ మీకు ఉపయోగపడక పోవచ్చు."

కొద్ది క్షణాలు రాణా ముఖ కవళికల్ని స్టడీ చేసాడు పోలీస్ సూపరింటెండెంట్.

"ఆల్ రైట్! నేను చెప్పింది నిజమైన పేరు కాదు. నీకో లిస్టు చూపించబోతున్నాను, గుర్తుపట్టగలవేమో చూద్దాం" అన్నాడు ఓ కాగితాన్నిస్తూ. (సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖ చిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం పరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. •



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## సమయస్ఫూర్తి

డిటెక్టివ్ నరేంద్ర, అసిస్టెంట్ కృపాల్ రోడ్డమ్మట నడుస్తున్నారు.

వారికి నాలుగు గజాల దూరంలో నెత్తిమీద హ్యాట్ వున్న వ్యక్తి నడుస్తున్నాడు.

డిటెక్టివ్ నరేంద్ర తన అసిస్టెంట్ యొక్క సమయస్ఫూర్తిని పరీక్షించదలచి "కృపాల్, నీ సమయస్ఫూర్తి ఇక్కడ చూపించు" అంటూ నేలమీద రాయితీసి, ఎదురుగా నడుస్తున్న వ్యక్తి హ్యాట్‌ని కొట్టాడు.

కృపాల్ గుండె దడ దడలాడింది.

హ్యాట్ ఎగిరి దూరంగా పడింది. హ్యాట్ వ్యక్తి కోపంగా వెనక్కి తిరిగాడు. నరేంద్ర ఏమీ ఎరుగనివాడిలా దిక్కులు చూడసాగాడు.

హ్యాట్ వ్యక్తి ఏదో అనబోయాడు. అంతలో కృపాల్ అతని దగ్గరకు వెళ్ళి, చెవిలో ఏదో చెప్పి, హ్యాట్ తీసి అతనికిచ్చాడు.

హ్యాట్ వ్యక్తి వెళ్ళిపోయాడు.

"శభాష్! నా అసిస్టెంట్ అనిపించుకున్నావు కృపాల్.

అసలింతకీ అతనికి ఏం చెప్పావ్?" కుతూహలంగా అడిగాడు నరేంద్ర.

"సింపిల్. హ్యాట్ వ్యక్తితో, మిమ్మల్ని రాయితో కొట్టిన వ్యక్తికి కొద్దిగా పిచ్చి—అని చెప్పాను. అంతే!" అన్నాడు.

—కె. ప్రసాద్, ఏలూరు.

## కమీషనర్ ఎవరు?

ఆ పట్టణానికి కొత్త కమీషనర్ వచ్చారు. ఆయన అప్పట్'దోరు విజిట్లుచేస్తూ ఒక పాఠశాలను సందర్శించారు. ఆయనతోపాటు నలుగురైదుగురు ఆఫీసర్లుకూడా వచ్చి వెళ్ళారు. అయితే వారిలో అసలు కమీషనర్ ఎవరు? అనే ప్రశ్న ఉపాధ్యాయులకు, విద్యార్థులకు వచ్చింది....

తలారకంగా జవాబిచ్చారు. ఎవరూ చెప్పలేకపోయారు.

అందరూ తర్జన భర్జన చేస్తుంటే ఒక కుర్రాడు లేచి "నే చెప్తానండి! ఆ చారల షర్టు వేసుకున్నాయనే కమీషనర్" అన్నాడు.

అందరూ ఆశ్చర్యపోయారు.

"ఎలా చెప్తావురా?" అన్నారు ఉపాధ్యాయులు.

"అదేసార్? ఆ వచ్చినవారిలో ఆయన ఒక్కరే సిగరెట్టు త్రాగారు సార్. మిగతావారెవరు కాల్చలేదు. అంటే మిగతా వారు ఆయనకంటె తక్కువ స్థాయివారు. అనగా ఆయనే కమీషనర్‌గారు అన్నమాట సార్!" అన్నాడు విద్యార్థి ....

నిజమే! ఆయనే కమీషనర్ అని తర్వాత తెల్సింది. ఆ విద్యార్థి తెలివిని మెచ్చుకొన్నారు వుపాధ్యాయులు.

—మన్నవ రామారావు, విజయవాడ-13.

